440

# కాలగర్భంలో......

4110/440

మూలం:

మహాపండిత శ్రీ రాహుల్ సాంకృత్యాయన్

అనువాదకులు:

రావి సత్యనారాయణ,

కారంచేటి రామయ్య.

కాగడా ప్రచురణాలయం,

కర్నూలు.

1PLA105B189 3 ~~IPLB101B189~~

# -: కృతజ్ఞత :-

ఇది మహా పండిత రాహుల్ సాంకృత్యాయన్ గారి "విస్మృతికే గర్భమేం" అను కృతికి అనువాదం. కోరినంతనే అనువదించడానికి దయతో అంగీకరించి అనుమతించినందుకు వేనోళ్ళ వారికి కృతజ్ఞత తెలియజేస్తున్నాము.

స్వీయరచనకంటే అధికమైన శ్రమకోర్చి యీ పుస్తకము ప్రచురణకు ఏర్పాట్లు జేసిన శ్రీ డి. వెంకటేశ్వర్లు గారికి హృదయపూర్వకమైన కృతజ్ఞతను తెలియజేయడం మా ప్రధాన కర్తవ్యంగా భావిస్తున్నాము.

భాషాంతరీకరణం ఎంతో కాలం క్రితం జరిగినా యీ నాటికైనా ప్రచురణ కర్తలు దొరికినందుకు వారికి ధన్యవాదాలర్పిస్తూ ఎంతో సంతసిస్తున్నాము.

సద్విమర్శనాని కెంతైనా హర్షించేవాళ్ళం గాబట్టి మా మలి ప్రయత్నంలో లోపాల్ని సవరించుకోవడానికి శాయశక్తులా కృషిచేస్తాము.

ఇట్లు

అనువాదకులు.

# ఉపోద్ఘాతం



విద్యావ్రతుడు, ప్రాచీన చరిత్రాధ్యాపకుడనైన నేను స్వీయపర్యటనను గూర్చి నవలారూపమున ఒక గ్రంథమును రచించెదనన్న నేనేమాత్రమునూ విశ్వసింపను. జనసామాన్యపు సరళ విశ్వాసమును చూరగొని సత్యము వాస్తవమునైన విషయమందు ఖ్యాతి నార్జించుటను నేను సంభవంగా యెంచుట లేదు. అనేక విచిత్ర ఘటనలను వర్ణించి వానిని వాస్తవమైనవిగా విశ్వసింపజేయు ప్రయత్నము అసంభవం కానప్పటికీ అవశ్యం అనుచితం. అయిననూ యిదే ప్రజల నాకర్షించు పద్ధతిగూడా.

నాకు ఈజిప్టు ప్రాచీన చరిత్రనుగూర్చిన పూర్తి పరిజ్ఞానముంది. అచ్చటి ప్రాచీన అత్యద్భుత కర్మకాండలను గూర్చిన పరిచయమున్నది. ఆ యద్భుత ప్రాచీన నాగరికతకు సంబంధించిన దివ్య మహాత్ములను సంపూర్ణముగ నేనెరుగుదును. అయినప్పటికీ అట్టి దైవికమహాత్మ్యములను గూర్చి నా కేమాత్రం విశ్వాసం లేదు. నేను స్వయంగా విశ్వసించే విషయాలనే పాఠకులను గూడ విశ్వసించమని కోర్తాను. అనగా దివ్యమైన * "గోబరైలా" గూడా మాపై యెలాంటి ప్రభావమును ప్రస

* దీన్నిగూర్చిన వివరణ 2 వ ప్రకరణం, మూడు - నాలుగు పేరాలలో వుంది.

రింపలేక పోయింది. ఒక చిన్న రాతిముక్క - కొద్దిపాటి బరువు ప్రకాశము గలది - సకల మానవజాతియొక్క జీవితంపై గాని, భవిష్యత్తుపైగాని తన ప్రభావాన్ని చూపగల్గడం నిజంగా అసంభవమే ఔతుంది. నా దృష్టిలో యిలాంటి ప్రభావాత్మకమైన విషయాలన్నీ ఘుణాక్షరన్యాయానుసారం జరిగేవే. కాని దీని స్వీకరణ తృణీకరణలను పాఠకుల అభిరుచికే వదలివేస్తాను.

స్వాభావికంగా నేనొక శాంతిప్రియుణ్ణి, విద్యావ్యసనుణ్ణి, విద్యార్థిని మాత్రమే. పరిశోధనకై అనేకపర్యాయాలు నేను నైలునదిపై విహరించాను. మూడుసార్లు మిస్సొపొటేమియా, ఒకసారి పాలస్తీనా, గ్రీసులను సందర్శించాను. ఒక భయంకరమైన పర్యటనలో పాల్గొనవలెనన్న కోర్కె నా హృదయంలో ఏనాడూ పొడసూపలేదు. వాస్తవంగా - నా చర్యలను మీరు గమనిస్తే - నా హృదయం దుర్బలమైనది. ఇంకో విధంగా చెప్పాలంటే నేను పిరికివాణ్ణి. దీన్ని నేను హృదయపూర్వకంగా స్వీకరిస్తున్నాను.

ఆయుధ ప్రయోగాల్లో నాకెలాంటి అనుభవమూ లేదు. నేను చాలా దుర్బలుణ్ణి. ఇందుకు నిదర్శనం నాయెత్తు '5.4'లు బరువు 1 మణుగు 12 సేర్లు మాత్రమే. ఇన్ని కారణాలను పురస్కరించుకొని నాకథా ప్రారంభానికి ముందు రెండు-మూడు మాటలు 'వుపోద్ఘాతము' గా చెప్పడం అవసరమైంది.

కొన్ని వర్గాల్లో నాకు మంచి ప్రఖ్యాతికలదనే వొప్పుకొంటున్నాను. కాని బహుళసంఖ్యాకులు విశేషించి - నాయీ

కథనుచదివేవాళ్ళు-నాపేరునుమాత్రం తెలుసుకోలేరు. కాబట్టి నేనెవరినో చెప్పడానికి నే నేమాత్రమూ సంకోచించడంలేదు. ఎందుకంటే ఆ యాత్రలో శవపేటికా అన్వేషణలో సంభవించిన కష్టాలను అనుభవించినవారు నా మిత్రులే. ఆ కారణంగానే, నేను ఆకీర్తిని ఆశించడంలేదు. వాస్తవంగా నాకా ఘనకార్యంలో యెలాంటి భాగమూలేదు. నేను అనాలోచితంగా దీనిలో జోక్యం చేసుకొన్నాను. ఆపదలు నన్నుచుట్టి ముట్టినప్పుడు, కష్టాల్లో మునిగియున్నప్పుడు, పర్యటనాధికారిగా నియమింపబడినప్పుడు నేనిందుకు అయోగ్యుడనని తెలుసుకోగల్గాను.

ఈ ఆపదలన్నిటిలో నా సహచరులైన ఆ యసాధారణ వీరపురుషు లిద్దర్నీ ప్రశంసించడానికి నావద్ద శబ్దాలు లేవు. వీరిద్దరివల్లనే, నేను బ్రతికివుండగలిగాను. నా జీవితంలో యేనాడూ తీర్చుకోలేనంతగా వారిద్దరికీ ఋణపడియున్నాను. కెప్టెన్ ధీరేంద్రనాధునిలాంటి వ్యక్తిని హృదయపూర్వకంగా ఆహ్వానించడానికి నేను సర్వదా సంసిద్ధుణ్ణి. ప్రచండ సాహసం, భయంకరమైన ఆపదలలో గూడ చలించని స్థిర మనస్కత, ఆశావాదం, విశ్వాసపాత్రత మొదలైన అద్భుత గుణములుగల అలాంటి మిత్రుని పొందినందుకు నేను నిజంగా గర్విస్తున్నాను.

మరి చాంగ్ మహాశయుడో? నేను వ్యవహార కుశలుణ్ణీ కాను, మనస్తత్వ శాస్త్రవేత్తనూగాను, అయినప్పటికీ నేను యిలాంటి స్ఫూర్తిగల శీఘ్ర నిర్ణయకర్తను ఎక్కడా చూడ

లేదు. పరిణామాన్ని సాధించే అతనిపద్ధతి లోకోత్తరమైనది. మా యాత్రలో అతని వ్యూహశక్తి, బౌద్ధికవాదనా పటిమను దర్శించే అనేక అవకాశాలను పొందాను. స్థూలకాయులైనా ధీరోదాత్తులు అలాంటి వీరుడు, అలసటచెందని ధీరుడు, ఆ మహా ప్రస్థానంలో అడుగు పెట్టగానే అలాంటి మహాపురుషులు లభించడం నా మహాద్భాగ్యము. ఆ యిద్దరు వ్యక్తులవెంట లేమిడిని వూహించుటకే కంపిస్తున్నాను. భయంకరమైన ఆ 'నుబియా' ఎడారిలో అంతమొంది గ్రద్దలకు ఆహారమై యుండుట సందేహం లేనిమాట.

కార్యవాదిగానన్ను భగవంతుడు సృష్టించలేదు. శారీరక బలహీనత, సాహసలోపమూగల నాకు వీరత్వాన్ని ప్రదర్శించే కోరిక లేదు. చిన్నప్పటినుండీ కళ్ళద్దాలు, సన్నని నడుము చిన్నవక్షముగల నిర్బలుణ్ణి. వీటన్నిటికీ బదులు వికారంగావుండే పెద్ద తల గలదు. స్కూలులో నేనొక పేరు బడ్డ మేధావంతుణ్ణి. అందువల్ల నేననేక బహుమతులు గూడా పొందాను. కాని ఆటల్లో సఫలుణ్ణి కాగల్గే యోగ్యతా లేదు, అభిలాషా లేదు. చరిత్రజ్ఞానం కలిగినప్పటినుండి ఈజిప్టు చరిత్ర అంటే ఆసక్తి గల్గింది. నాతండ్రి ధనాఢ్యుడైనందువల్ల జీవన భృతికోసం చింతించే అవసరం కలుగకపోవడం నా అదృష్టం. 8 సం॥ ల వయస్సులోనే పితృహీనుణ్ణయ్యాను. నా ఆస్తి, సంరక్షణ కోర్టువారి ఆధీనంలో వుంది. యుక్తవయస్కుణ్ణి కాగానే ఆ ఆస్తికి సర్వాధికారినయ్యాను. అది నామామూలు అవసరాలకు చాల మించియున్నది. స్వయంగా చదవడం, యితరులను చదివించడంకంటే నాకు వేరే వుద్దేశ్యంలేదు.

నా విద్యాభ్యాసాంగాలకు అవసరమైన ధనాన్ని వెచ్చిస్తూండే వాడను. మిగిలిన ధనం బ్యాంకులో వడ్డీసహితంగా పెరుగు తూండేది. 40 సం॥ల ప్రాయంవరకు నేను నిరంతరం నా అభి మాన విషయాలమీద యెంతగానో శ్రమపడేవాడిని. అందుకు తగినట్లుగా నా జిజ్ఞాస విద్యాభిమానం పెరిగి పోతూండేవి.

నేను బీహారు విశ్వవిద్యాలయంలోనూ, నేపాలు కళా శాలలోనూ ఆచార్యస్థానంలో వుంటిని. నేను ఈజిపు శబ్ద పరిశోధనా సంఘంలో సభ్యుడనేకాక బీహారు విశ్వవిద్యా లయపు ఆనరరీ డి. సి. యల్. ను గూడా. అప్పుడు నా వయస్సు 35 సం॥లు. అదే సమయంలో నాకు నలందా సంగ్రహాలయంలో నేడు నిర్వహిస్తున్న బాధ్యతాయుతమైన పదవి లభించింది.

ఇక్కడ చెప్పే విషయాలన్నీ కల్పితాలని ఎవరూ అనుకోగూడదనే వుద్దేశ్యంతో చెప్తున్నాను. నాలాంటి ప్రామాణిక ప్రతిష్ఠితవ్యక్తి ఆవిధంగా చేసి తనకు తానై కీడు తెచ్చుకోనడని గుర్తించాలి. విశ్రాంతి సమయాల్లో యేవో కథాకల్పనలు చేయడం నాపనికాదు వైజ్ఞానికు లెప్పుడూ సత్యాన్నే ప్రేమిస్తారు. నాకు సంభవించిన ఘటనలేవీ అతి శయోక్తులు కావు; ఏవ్యక్తికైనా నా యీ కథపై సందేహం కల్గితే ఆ విచిత్రమైన "మితనీనగర" యాత్ర చేయవచ్చు. అచ్చటి రాజప్రాసాదానికి వుత్తరంగావున్న వుద్యానవనంలో ఆ విలక్షణదేశాన్ని శాసించే,సౌమ్యసుందరమూర్తియగు మహా

గాణి దర్శనమౌతుంది. అంతేగాక అద్భుతమూ, వ్రాయదగిన విషయమూ యేమంటే ఆనాటి పాట్నా హైకోర్టు ప్రసిద్ధ న్యాయవాదియొక్క సురక్షిత శవమును అచ్చట చూడవచ్చు.

— ర చ యి త

## థేబిస్ రాకుమారుడు సెరాఫిస్;
## గోబరైలా ప్రథమ దర్శనము;
## శివనాధ్ జౌహరీ రహస్యహత్య.

మొట్టమొదట నేనీ అద్భుత యాత్రలో పాల్గొనవలసి వచ్చిన కారణాలను వివరిస్తానేగాని ప్రకరణ విరుద్ధంగా ఈజిప్టుదేశపు చారిత్ర్యకములగు నానా విషయాలను యేకరువు పెట్టబోను. నా పాఠకులలో అధిక సంఖ్యాకులు బహుశా ఈ విషయంలో అనభిజ్ఞులయ్యే వుంటారు. వారి వుపయోగార్థం కొంచెం వివరంగా చెప్పడం మంచిది. సాధ్యమైనంత వరకు అనభ్యస్తులగు పాఠకులు గూడా గ్రహించేవిధంగా క్లుప్తంలో స్పష్టంగా వివరించడానికి ప్రయత్నిస్తాను.

అనేక సంవత్సరాలుగా 'కార్నక్' మందిరంలో వున్న శిలాఫలకాలపై సెరాఫిస్ రాకుమారుని శ్మశానయాత్ర చెక్కబడి యుండడం నాకు తెలుసు. ఈ శాసనాలూ, వాటితో పాటు గల చిత్రలిపీ, సెరాఫిస్ ఒక థేబిస్ రాకుమారుడనిన్నీ, అపార ధనాఢ్యుడనిన్నీ, నాటి ఈజిప్టు సార్వభౌముని మిత్రుడనిన్నీ స్పష్టం చేస్తున్నయ్. అతడే రాజవంశానికైనా చెందినవాడా? కాడా? అన్న విషయం అస్పష్టం, అప్రస్తుతం గూడా. బహుశా అతడొక మతాచార్యుడో లేక ఒక వున్నత

రాజకీయోద్యోగో అయివుంటాడు. అతని అంత్యక్రియలు యే సార్వభౌముని అంత్యక్రియలకు యేమాత్రమూ తీసిపోని విధంగా జరిగినవనుట నిశ్చయము. అతనితో పాటు అమూల్యమైన సువర్ణం గూడా సమాధి చేయబడింది. అందున్న కలశాలు, పెట్టెలు, గ్లాసులు, భోజనపదార్థాలు, శస్త్రాస్త్రాలు, రాచరికపు దుస్తులు, ఆభూషణాలు, రాజదండంతో సహా పరిశుద్ధమైన బంగారంతో తయారు చేయబడినయి. అందున్న ప్రతి వస్తువుపైన అతని పేరుతో పాటు ముద్రగూడా వేయబడివుంది. ఈ వస్తువులన్నీ రాకుమారుని శవంతో పాటు సమాధికి తీసుకపోబడ్డవి. పైన చెప్పబడిన చిత్రమాలయందు 5 వ శిలాఫలకంలో గోబర్రైలా గూడా చిత్రించబడివుంది. దీనిని ఒక పురోహితుడు ఏడ్చేవారికి అగ్రగామిగా తీసుకు వెళ్తూంటాడు. ఈ దివ్యమైన గోబర్రైలా చిత్రమందున్న దానికంటె పెద్దదిగా ప్రదర్శింపబడింది.

థేబిస్‌నగరపు త్రవ్వకాలు చురుకుగా సాగుతున్న సమయంలో నేను రెండవసారి మిశ్రదేశానికి (ఈజిప్టుకు) వెళ్ళడం సంభవించింది. ఆనాడు నేను స్వయంగా 'కార్నక్ దేవాలయాన్ని సందర్శించాను. అంతేగాక సెరాఫిస్ యొక్క శవపేటికను గూర్చి లభించిన శిలాశాసనాన్ని గూడ చదివాను. నేనక్కడ చూచినదానికన్న దానికి సంబంధించిన విషయంలో ఎక్కువ ఔత్సుక్యాన్ని చూపాను. కాని అక్కడ నన్నొక విషయం ఎక్కువగా ఆకర్షించినట్లు జ్ఞాపకము. అదేమంటే జంటపర్వతాలచే సెరాఫిస్ పాడె (శవవాహిక) సూచింపబడింది. వీటిలో ఒక పర్వత శిఖరంపై ఒక

డేగయూ, రెండవ శిఖరంపై ఒక గ్రద్దయూ, పర్వతముల అడుగుభాగం దేవసర్పంతో చుట్టబడి వున్నది. ఆ సమీపం లోనే ఒక దేవమూర్తి సిరస్సుపై కమలాన్ని ధరించి కన్పిస్తూంటుంది.

గ్రీకు చరిత్రకారుడైన హెరోదోతస్-ఈతడు మిశ్ర దేశమును గూర్చి చెప్పిన విషయాలు విశ్వసనీయాలు కావం టారు - నైలునది జంట పర్వతముల మధ్య పుట్టిందని చెప్పాడు. వీటినే 'నూఫీ - క్రాఫీ' పర్వతాలంటారు. పర్వతపు టడుగు భాగంలో విగ్రహమే లేకపోతే శిలాశాసనంలో వున్న ఖించబడిన విధంగా జంట పర్వతాల మధ్య ప్రదేశమే నైలు నది వుద్గమ స్థానమని నేను ఒప్పుకోను. నిస్సందేహముగ ఆ విగ్రహం నదీ దేవతయైన 'హార్పీ' రెండు శిఖరాల మీద వున్న పక్షులు పై భాగాన - క్రింది భాగానవున్న నదులను సూచిస్తున్నయ్.

ప్రథమంలోనే, నేనీనిశ్చయానికి రానట్లు జ్ఞాపకముంచు కోండి. కాని రాబోవు ఘట్టాలు - విశేషించి చాంగ్ మహా శయుని తార్కిక అభిప్రాయాల వల్ల లాభించినప్పుడు యీ విషయం చక్కగా స్పష్టమైంది. కార్నక్ దేవాలయం, సెరా ఫిస్ రాకుమారుని సమాధి థేబిస్‌లో లేదని సూచించడమే గాక నుబియా ఎడారికి ఆవలివైపున నైలునది జన్మస్థలంలో నని విస్పష్టపరచింది.

ఈ సాక్ష్య శృంఖలకు మరోలింకు, పూర్తిగా చదవ డానికి అసాధ్యమైనా "మేనే - పేపర్సు" ద్వారా ప్రాప్తిం

చింది. అంచు ఎవరైనా యేమాత్రమైనా చదువగలిగివుంటే బహుశా నేనే అయివుంటాను. అచ్చట 12వ రాజ వంశపు కాలంలోగూడా సెరాఫిస్ రాకుమారుని పేరు తిరిగి ప్రత్యక్షమైనప్పుడు నేను అతీత ఆశ్చర్యానికి గురైనాను.

ఇంకా బాగా పరిశీలించి చూస్తే మరొక విషయం గూడా యిక్కడ సాక్ష్యమిస్తుంది. ఏమంటే, సెరాఫిస్ యిథియోపియాలోనే సమాధి చేయబడ్డాడు. కారణం? 12వ చక్రవర్తి కాలంలోనే థేబీయ ప్రభువులు దక్షిణాఫ్రికా యొక్క బృహత్తర సరస్సుల వైపునుండి దక్షిణ దిశన వున్న అరణ్య ప్రదేశాలను జయించేసుకొన్నారు. ఈ కాగితాల్లో చాలా సులభంగా చదువ దగిన అంశాల్లో, స్వయంగా మిశ్ర సామ్రాజ్యాధిపతి సెరాఫిస్‌ను ఈ దండయాత్రకు పంపినట్లుగా గూడా వర్ణించబడింది. ఈ యాత్ర 'మెరో' నుండి దక్షిణ దిశగా అంటే నదుల సంగమమున కావలివైపు – నేడు ఖర్టూమ్ నగరమున్న చోటు—జరిగినది.

సెరాఫిస్ సమాధి 'మితనీ' లో వున్నదని గూడా పేపరస్ సూచించింది. నేను మెంఫిస్‌నగర దక్షిణభాగంలోవున్న 'మితనీ' లేక 'మతానియా' ను మాత్రమే ఎరుగుదును. అక్కడ యే థేబీయ సైన్యాధిపతి సమాధి చేయబడజాలడన్న మాట నిశ్చయం. విశేషించి యితర్రా దానిపేరు – 'మితనీ హార్పీ' గా వ్యవహరించ బడడం విచిత్రం. ఈ విధంగా ఒక్కసారిగా సెరాఫీస్ సమాధి భూమికీ, నైలు దేవతకూ సంబంధం జోడించబడింది.

ఈ వృత్తాంతాన్ని గూర్చి విశేషంగా వివరించబోయే ముందు, గోబర్రైలా రహస్యాన్ని బయలుపర్చకముందు, నలందా సంగ్రహాలయంలో గోబర్రైలా ప్రవేశించకముందే నావద్దగల ఆధారాలను గూర్చి ఆలోచించడం మంచిది. థేబియా రాకుమారుడైన సెరాఫిస్ తన అపారసంపత్తితో పాటు మితనీహార్పిలో సమాధి చేయబడ్డాడు. ఈ సమాధి స్థలం ఏ శాస్త్రవేత్తకూ తెలియదు. ఏ పురాతన అధునాతన దేశపటాల్లో (మ్యాప్స్) గూడా చిత్రించబడినట్లు కన్పించదు. ఈ స్థానం ఇథియోపియా దేశంలో - దానినే నేడు సూడాన్ అంటారు - ఎక్కడనో వున్నదని అనడానికి అనేక కారణా లున్నయ్.

ఇప్పుడిక గోబర్రైలా విషయం చూద్దాం. నేను సరైన తేదీ చెప్పలేనుగాని ఆనాటి విచిత్ర ప్రాతఃకాలము నాకు బాగా జ్ఞాపకమున్నది. నేను నలందామ్యూజియంలో కొన్ని చిత్రలిపులను పోల్చుకొంటున్నాను. అప్పుడేదో పనిమీద తాళంవేయ బడివున్న ఒక గదిలో ప్రవేశించాను. దానిలో అప్రదర్శితాలైన పురాతన వస్తువుల నమూనా లెన్నో వున్నవి. జిజ్ఞాసువునైన నేను అచ్చటి నమూనాలను చూడసాగాను. అక్కడెన్నో వుపయోగకరాలైన వస్తువులు లభిస్తున్నందువల్ల నేను రెట్టించిన అభిలాషతో ప్రతి వస్తువునూ పరిశీలింపసాగాను. అదే సమయంలో తాళం వేయబడివున్న డ్రాయరు సొరుగొకటి నాకు కన్పించింది. తాళపు చెవికోసం కొద్దిసేపు వెదుకగా అదొక సీలుచేసిన కవరులో కన్పించింది. కావాలని దీనిని దాచినట్లుగా తోచింది. డ్రాయరు సొరుగు తెరచి

చూచాను. దానిలో రెండుమూడు పొడవుగా, ఆరంగుళముల వెడల్పుగల ఒక సంచి కన్పించింది. చేతికి తీసికోగానే చాలా బరువుగా వున్నట్లు తోచింది. నా కుతూహలం మరీ ఎక్కువై వెంటనే దాన్ని విప్పి చూచాను. నా చేతిలో మెరుస్తున్న రాత్రిపై "గోబర్జైలా" చిత్రింపబడి యుండడం చూచాను. అప్పుడు నా ఆశ్చర్యం హద్దుమీరి పోయింది. నా జీవితమంతటిలో ఇది అద్వితీయమైన విషయం.

దాన్ని చక్కగా పరిశీలించిన తరువాత అది సెరాఫిస్ యొక్క గోబర్జైలా అని తెల్సింది. ఎంత విచిత్రం? తిరిగి మళ్లీ ఆ సెరాఫిస్ దర్శనమా? నేను ప్రారంభంలో గోబర్జైలా మీదగల చిత్రలిపిని చదువదల్చలేదు. ఎందుకంటే, అలాంటి దుర్లభవస్తువు లభించినందున జ్ఞానపరంపరలు చెలరేగ దొడగినవి. ఈ దుర్లభవస్తువును మ్యూజియం లిస్టులో ఎందుకు చేర్చలేదో ప్రదర్శనకు వీలైన చోట ఏలవుంచలేదో నాకు చాలా ఆశ్చర్యం వేసింది. నేటివరకూ సెరాఫిస్ సమాధిస్థలం కనుగొనబడనూ లేదు. తెలియనూ తెలియదు. ఆధునిక వైజ్ఞానికజగత్తుకు సంబంధించినంతవరకూ, ఆ సమాధికి సంబంధించిన యేవస్తువూ, బాహ్యజగత్తును చూడలేదు. ప్రస్తుతం నాముందున్న గోబర్జైలా, యే ఇంద్రజాల సహాయంతో ఈ నలందా సంగ్రహాలయానికి యెగసివచ్చిందో తెలియదు. కాని ఆ గోబర్జైలాయే స్వయంగా నాముందున్నది. నేనిచ్చటి చారిత్రక, బహుమూల్య, దుర్లభవస్తువులను, సురక్షితముగావుంచు బాధ్యత కలవాడనై కూడా, ఈ విషయంలో, యేమాత్రమూ తెలిసికొనకుండా వుండడం ఎంతో శోచనీయం. యీనాటికైనా

అకస్మాత్తుగా నేనిటు రాకుంటే ఎప్పటివరకూ అది ఈ అంధ కారంలో వుండేదో ఎవరికి తెలుసు?

సరిగ్గా నేనీ ఆలోచనల్లో లీనమై వున్న తరుణంలోనే నా దృష్టి గోబర్జైలాను చుట్టివున్న కాగితంపై ప్రసరించింది. కేవలం తారీఖును నోట్ చేసి యుండడమేగాక, ఆ కాగితాన్నే జాగ్రత్త చేయడం, ఎంతో మంచిదైంది. ఆ కాగితంపై తారీఖు 26-జూన్ 1881 మాగధ అని వున్నది.

ఎంతో కాలంనుండి పడివున్న గోబర్జైలా సలిందా మ్యూజియమ్‌కు ఎలా వచ్చిందో - దాన్నిగూర్చి తెలుసుకో బోయేముందే - తెలుసుకోందామన్న కాంక్ష కలిగింది. నేను నా గుమాస్తాను పిలిచి యీ విషయంలో సంప్రదించగా సంతృప్తికరమైన సమాధానం రాలేదు. ఆఁ ఒక విషయం మాత్రం అతను చెప్పాడు - మొదట ఇచ్చట రామేశ్వర్ అనే ఒక సంరక్షకుడుండేవాడు. ఆతడు యీ సొరుగును, గదిని తనకు వుపయోగిస్తూండేవాడు. రామేశ్వర్ పని చాలించి గూడా చాలాకాలమైంది.

ఆ రోజు సాయంత్రం నేను నా యింటికి వెళ్తూ గోబర్జైలాను గూడా వెంటతీసుకెళ్ళాను. ఇంటికి చేరి నేను దానిని చాల జాగ్రత్తగా నా వ్రాతబల్ల సొరుగులోపెట్టి తాళం వేశాను. రామేశ్వర్ విహారంలో వుంటున్నాడని నా గుమాస్తా ద్వారా తెలిసింది. ఆ ద్వారానే నేను విహారాన్కి చేరుకొన్నాను. దైవవశాత్తు రామేశ్వర్ యింటి వద్దనే వున్నాడు. నేను ప్రశ్నించినప్పుడు అతడు మొదట్లో కొంచెం సంకోచించినట్లుగా

తోచింది. కాని మెల్ల మెల్లగా, ఒక్కొక్కటిగా విషయా లన్నీ రాబట్టాను. 1881 వ సం॥ వర్షాకాలంలో - తేదీ గుర్తు లేదు - ఒకరోజున రామేశ్వర్ నలందా మ్యూజియమ్‌లో మిశ్ర దేశపు విభాగంలో తన డ్యూటీలో వున్నప్పుడు భయ కంపితుడైన ఒక ప్రౌఢవ్యక్తి పరుగెత్తుకవచ్చి అతనిచేయి పట్టు కొన్నాడు. రామేశ్వర్ ఏమిటని ప్రశ్నించకముందే 2½-3 సేర్ల బరువుగలిగి గుడ్డలో చుట్టబడిన ఒక వస్తువును అతని చేతిలో పెట్టాడు. రామేశ్వర్ యిదేమిటని ప్రశ్నించాడు. సమాధా నంగా "భగవంతుని కొరకైనా దీన్ని జాగ్రత్తచేయండి. ఇది మీకో మరెవరికో యిస్తున్నాను. కాని భయంకరమైన పాపో..." అని అంటూ ఆ వ్యక్తి సంగ్రహాలయపు సోపా నాలమీదుగా శీఘ్రగతిని క్రిందకు వెళ్లి సింహద్వారంలో వున్న తన మోటారుసైకిల్ ఎక్కి వెళ్లిపోయాడు. రామేశ్వర్ ఆ వ్యక్తిని గూర్చి యిలా చెప్పాడు - అతడొక మధ్యమ వయస్కుడు. భయంకర శత్రువెవడో మృత్యువులాగ అతన్ని వెంబడిస్తున్నట్లు ఆ వ్యక్తి ప్రత్యణువునందున గోచరిస్తోంది. వర్షాకాలమైనా ఎండ తీవ్రతకు మాడిపట్లుం దతని ముఖము. ఎంతో దూరంనుండి వస్తున్నట్లున్నప్పటికీ అతనికి తలగుడ్డ గాని, టోపీగాని, కనీసం పాదరక్షలైనా లేవు; చొక్కా- ధోవతి మాత్రం ధరించి వున్నాడు. ఏదో భయంకర స్థితిలో క్షణమాత్రపు టవకాశాన్ని చేజిక్కించుకొని పారిపోయి వచ్చినట్లుగా తోస్తున్నది.

రామేశ్వర్ ఈ విషయాన్ని రహస్యంగా వుంచడంలో యేదో స్వలాభం వుంటుందని భావించాడు. ఎన్నో రకాల

ప్రశ్నలు వేసిన తర్వాతగాని ఈ విషయమైనా బయటపడలేదు. అసలు కథ యేమిటంటే, రామేశ్వర్ ఆ పొట్లాన్ని విప్పి నప్పుడు దానిలో ఒక మెరుస్తూన్న రాయి కన్పించింది. గోబ రాళ్లై విషయమై యేమీ తెలియని వాడవడంవల్ల అది ఒక అమూల్యమైన వస్తువని గ్రహించలేక పోయాడు. నలందా విశ్వ విద్యాలయంలో దాన్ని విక్రయించుదామన్న వుద్దే శ్యంతో తన యింటికి తీసుకపోయాడు. కాని అప్పటినుండే ఆపదలు అతన్ని ఆవరించడం ప్రారంభించినవి.

ఒకసారి, యింటికప్పు కూలినప్పుడు పిల్లా - జెల్లా ఎలాగో బ్రతికి బయట పడ్డారు. భార్య జబ్బుపడి ఎన్నో వారాలుగ బ్రతుకుతుందన్న ఆశగూడా లేకుండ పోయింది. ఆ రోగమేమిటో పెద్ద డాక్టర్లుగూడా చెప్పలేక పోయారని నన్ను నమ్మించడానికి రామేశ్వర్ తీవ్రంగా ప్రయత్నించాడు. ఇంతకాలంగా దాచివుంచిన ధనం, బ్యాంకు దివాలా తీసి నందున ధ్వంసమైపోయింది. చివర కొకరోజు అతడు నలందా నుండి రైలుమీద యింటికి వెళ్ళే సమయంలో బండినుండి దిగుతుండగా కాళ్ళుజారి గభాలున రైలు చక్రాలక్రింద పడి పోయాడు. అదృష్టవంతుడైనందున బండి కదల్లేదు. మాంచి దెబ్బమాత్రం తగిలింది. చావుదప్పి కన్ను లొట్టబోయి బయట బడ్డాడు. కుడిచేతి మణికట్టు తొలగిపోయినందువల్ల యెన్నో రోజులు యింట్లోనే పడివుండాల్సి వచ్చింది.

ఈ ఆపదలన్నిటికీ మూలం యీ గోబరైలాయేనని స్థిర నిర్ణయానికి వచ్చాడట. ఈ విధంగా చేసుకొన్న నిశ్చ యానికి కారణమేమిటో నేను చెప్పలేను. దుర్బల మనస్కులు

గ్రుడ్డి నమ్మకాలు గలిగినవారు యిటువంటి ఆకస్మిక ఘటనలను ఉదాహరణంగా తీసికొని రకరకాలైన కథలల్లడంలో ఆరితేరినవారై వుంటారు. ఎలాగైనా సరే యీ గోబైలా పీడను వదిలించుకోవాలని అనుకొన్నాను.

రామేశ్వర్ ఎలాగో మూడు వారాలపాటు ఆ గోబైలా పీడను తనవద్ద వుంచి సహించుకొన్నాడు. గోబైలాను చుట్టివున్న గుడ్డమీద "శివనాథ జౌహార్" అని స్పష్టంగా వ్రాసి వుండడం చూచాడట. ఇదే సమయంలో శివనాథ్, దానాపురంలోనున్న స్వగృహంలోనే హత్య చేయబడ్డాడు. హత్యావిషయం కనుగొన్న రామేశ్వర్ ఒక గంటసేపైనా దాన్ని తనవద్ద వుంచుకోవడం అనర్థదాయకమని భావించాడు అంతేగాక దీన్ని గురించి యితరులకు తెలియజేయడమంటే గూడా భయమేసింది. కోలుకొని డ్యూటీకి వచ్చినప్పుడు అతడా గోబైలాను గూడా వెంటబెట్టుక వచ్చాడు. దాన్ని నేనప్పుడు చూచిన డ్రాయరు సొరుగులో ఒక పాత కాగితంతో చుట్టిపెట్టి తాళం బిగించాడు.

రాత్రి 9 గం॥లకు గాని యీ సంభాషణ ముగిసింది గాదు. నలందా బండి అప్పటికే వెళ్ళిపోయింది. ఇక రెండు-మూడు గంటలవరకు మరే బండీ లేదు. నేను వెంటనే ఒక గుర్రపుబండిమీద చాల త్వరగా యింటికి జేరుకొన్నాను. భోజనం జేసిన తర్వాత నా డ్రాయింగురూముకు వెళ్ళాను. నేను సొరుగు లాగి చూచినప్పటి నా ఆశ్చర్యానికి అంతు లేక పోయింది. ఎందుకంటే ఆ గోబైలా అక్కడినుండి మాయ

మైంది. నేను గదంతా గాలించగా మిశ్రదేశపు ప్రాచీన కాగితాలున్న చేతి సంచిలో అది దొరికింది.

ఈ విధంగా మాయమైన విషయాన్ని గురించి నేను తగు సమాధానం పొందలేక పోయినప్పటికీ, నా జ్ఞాపకశక్తి ఈవిషయంలో దెబ్బతినే వుంటుంది. అయినా నేనా గోబ్రైలాను చేతిసంచిలో గాక సొరుగులోనే దాచినట్లు దృఢ నమ్మకము. తాళం వేయబడి వుండనందువల్ల నా నౌకరు దాన్ని మార్చి వుండవచ్చు. కాని యిదిగూడా అసంభవమే. ఎందుకంటే, అలా చెయ్యాల్సిన అవసరం లేకపోవడమేగాక యే యితర ప్రాణి నా చదువుకొనే గదిలోని యే వస్తువును గలిబిలి చేయడానికి వీలులేదు.

దీన్ని ఎక్కువగా ఆలోచించకుండానే ఆ పొట్లాన్ని తీసికొని పడక కుర్చీలో కూర్చొన్నాను. మొట్టమొదట చాల జాగ్రత్తగా ఆ పొట్లాన్ని విప్పాను. ఇదే సమయంలో "దానాపురపు రహస్య హత్య" అన్న విషయంపైకి నా దృష్టి పోయింది.

ఒక్క క్షణంలో గోబ్రైలా నా ఆలోచననుండి దూరమైంది. నేనా రహస్య హత్యను గూర్చిన వివరాలను చదవడం ప్రారంభించాను. శివనాథుడొక ధనసంపన్నుడైన వ్యక్తి అతడు చాలకాలం పట్టు వ్యాపారం చేశాడు. చావడానికి ఎన్నో సంవత్సరాలు ముందే దాన్ని వదలివేశాడు. ఆయన అవివాహితుడు. అతని ఒకే ఒక నౌకరయిన రామదయాళ్ తల్లి తద్దినం పెట్టడానికి యింటికి వెళ్ళాడు అదే రాత్రి అతడు

(3)

భయంకరంగా హత్య చేయబడ్డాడు. ఆయన గృహం ఆవ గింజంతైనా వదలకుండా హంతకులచే వెదకబడింది. సొరుగులు, పెట్టెలు, అలమరలు, వాటి తాళాలు, ఆఖరుకు దిండ్లను గూడా ధ్వంసం జేశారు. ప్రతి వస్తువును బాగా పరిశోధించి నేలపై విసరి పారవేశారు. అందమైన దిండ్లను ముక్కలు ముక్కలుగా చేసివేశారు. కుర్చీలకు వుండే కుషన్‌లను సయితం చించివేశారు. ఆ స్థలాన్ని పరీక్షించిన సి. ఐ. డి. పోలీసు గృహమంతా నిర్ణీత పద్ధతిన ఎంతో సూక్ష్మంగా వెదకబడిందన్నాడు. ఇలా చేయడానికి చాల సమయం పట్టివుండవచ్చు. ఈ పరిశోధనంతా హత్యకు ముందో - తర్వాతో జరిగి వుండవచ్చు. అన్నిటికంటే విచిత్రమైన విషయం ఏ ఒక్క వస్తువూ దొంగిలింపబడలేదు. బహుమూల్యమైన వస్తువులతో పాటు ఎంతో ధనమున్న పెట్టెలు తాళాలుమాత్రం ధ్వంసం చేయబడ్డాయి.

ఆ రహస్యహత్యకు సంబంధించిన అద్భుత వివరాలను చదివిన నా బోటి శాంతిప్రియుని విద్యావ్యసనుని హృదయంలో ఎటువంటి భావాలు జనించినయ్యో పాఠకులనే ఆలోచించమంటాను. 'హూగఫ్' పత్రిక యిచ్చిన వివరణ ఒక విచిత్ర వర్ణనతో ముగిసింది. పోలీసులకది నిరర్థకమైనప్పటికీ నాకుమాత్రం మరెంతో వుపయోగకరమైంది. అయినప్పటికీ ఆ స్థితిలో దానిని విశ్వసించడం కష్టం.

మృతపురుషుని శవముంచిన గచ్చుమీద పాలు చిలకరించబడి వున్నవి. హంతకుడు పాలకోసం క్రిందనున్న వంట

యింటికి వెళ్ళవలసి వచ్చింది. గచ్చుపై సీమసున్నంతో గుంటనక్క తలను బోలిన ఒక చిత్రం వేయబడి వుంది.

ఈ హత్య ప్రాచీన మిశ్రదేశపు ఆచారాలను, కర్మకాండలను విధిగా నెరవేర్చే వ్యక్తులే చేశారని నిర్ణయించుకోవడానికి నా కెంతోసేపు పట్టలేదు. గచ్చుమీద చిత్రించిన ఆకారం వేరెవరిదో గాదు. మిశ్రదేశపు మృత్యుదేవతైన 'అనుబిస్' అనగా యమధర్మరాజు. నా మనస్సులో రేకెత్తిన ప్రశ్నపరంపరకు నేను సమాధానం చెప్పలేని అసమర్థుణ్ణి.

పురాతన మిశ్రదేశపు సభ్యతాజ్యోతి క్రీస్తుపూర్వం 487 సం॥కి ముందే అంటే బుద్ధభగవానుని నిర్యాణంతో పాటు ప్రపంచంనుండి నిష్క్రమించింది. 12వ రాజవంశపు అంతిమ దేబీయచక్రవర్తి తర్వాత 15గురు రాజులను గూర్చిన శాసనం మాకు లభించింది. కాని మాకు తెలిసినంతవరకు ప్రాచీన మిశ్ర నాగరికత, ఆచార వ్యవహారాలు, భాష ఇరాన్ విజయానంతరమే అంతమై పోయినవి.

కొద్దిసంవత్సరాల క్రితమే పాట్నా సమీపంలో వున్న దానాపురంలో శివనాథజౌహారీ హంతకులు నైలునదీతీరపు ప్రాచీన మిశ్రదేశ ధర్మాలను, సంస్కృతిని అక్షరాలా పాటించే వ్యక్తులేనని ప్రాచీన చరిత్రాధ్యాపకుడనైన నావద్ద ప్రబల సాక్ష్యాలున్నవి.

నేనిక వార్తాపత్రికను దూరంగా వుంచి నా దృష్టిని పచ్చగా పాలిష్ చేయబడి వున్న గోబరైలా క్రిందిభాగము మీద కేంద్రీకరించాను. అది జ్యోతివలె ప్రకాశిస్తున్నది.

అప్పటి నా హృదయం ఆశ్చర్యాందోళనలతో నిండిపోయింది. ప్రాచీన మిశ్రదేశానికి సంబంధించిన అనేక అద్భుత శిలా శాసనాలను, యితర సామగ్రిని అంతకుముందే చూచాను. తర్వాతగూడా చూచాను కాని నాటి నా మానసికస్థితి నా జీవిత మంతటిలో అపూర్వం. స్పష్టంగా చూడడానికి నేను దాన్ని లైటువద్దకు తీసుకవెళ్ళినప్పటి నా స్థితి ఏమని చెప్పను. నా శరీరమంతా కంపించిపోయింది. హృదయం వణికిపోతోంది. ఎవరో నా చెవిలో "ప్యారో విషయంలో జాగ్రత్త!" అన్నట్లు స్పష్టగా ప్రతిధ్వనించింది.

## 2 గోబరైలా ప్రతిమ-వకీలు ధనదాసు జౌహరీతో నా పరిచయం

ఇప్పుడు నేను గోబరైలా విషయం చెప్పబోతున్నాను. నిస్సందేహంగా యిది ఎంతో దుర్లభమైందీ, బహుమూల్యమైందీ, మనోరంజకమైన వస్తువు. ఇది అద్వితీయమైన వస్తువని నేనుగూడ ఒప్పుకొంటాను. కాని అపరిచితులైన పాఠకులకు గోబరైలా అంటే ఏమిటో స్పష్టంచేయ సంకల్పించాను. స్పష్టంగా చెప్పాలంటే 'గోబరైలా' అందరూ చూచే ఒక నల్లని పురుగు. ఇదొక విశేషజాతికి చెందినట్టిది. వీటి క్రింది

భాగం పట్టులాంటి మెత్తని రోమాలతో కప్పబడి వుంటుంది. జంతుశాస్త్రజ్ఞులు దీనిని "సమూకీ గోబరైలా" అంటారు. వీటిలో మరొకజాతి 'శోధక గోబరైలా'. ఇది తన పాకీపని ద్వారా మానవసంఘాన్కి సేవజేస్తుంది. ఇదే మిశ్రదేశపు పవిత్ర శోధక గోబరైలా.

ప్రాచీన నైలునదీ తీరవాసులైన మిశ్రీయులలో బహు సంఖ్యాకులు గోబరైలా సేవను గూర్చి పూర్తి పరిచితు లనడం నిస్సందేహం. నాగరికతయొక్క ప్రారంభదశలో ప్రాకృతిక చేష్టలన్నీ మానవులకు వుపయోగకరమైన ప్రాణులు. వనమూలికలు పవిత్రంగా ఎంచబడేవి. వాటికే అధికంగా దేవతాకారాలు యివ్వబడినవి. ఇందువల్లనే ప్రాచీన మిశ్రదేశంలో సూర్యుడు, నైలునదే గాక వృషభం, జంబూకం, ఇబిస్ అనే పక్షి, గోబరైలా మొదలగునవన్నీ దైవశక్తితో కూడినవని నమ్మేతుండేవారు.

గోబరైలా దేవత పేరు 'ఖోపరీ.' ఇది చిత్రరూపంలో గూడ వుంటుంది. గోబరైలా ప్రతిమ ఒక చక్రంపైగాని లేక మానవ శరీరం గోబరైలా సిరస్సుగాని చిత్రించ బడుతుంది. ఉదాహరణకు జంబుక ముఖము గల్గిన అనుబిస్, ఇబిస్ పక్షి ముఖముగల థాత్, శ్యేనవదనంగల - హోరస్ - యీ ముగ్గురు పురాతన మిశ్రదేశపు దేవతలు.

ఖోపరీ తరచుగా సూర్యభగవానుని పేరుతో వ్యవహరించ బడుతుంది. కాని యిచ్చట పాఠకులను అనవసరంగా మిశ్రదేశపు పురాణాల్లోకి ఈడ్చుకు పోతల్చుకోలేదు. ఖోపరీ

కొన్ని స్వీయ దివ్యగుణాలు కలిగియున్నదనడం చాలు. ఈ విషయంలో నాదొక సిద్ధాంతం వున్నది. గోబ్రైలా క్షీణత్వానికి ప్రతిద్వందిగా వుంటుంది. అది కుళ్ళిపోవు పదార్థాలకు గూడ తన నిరంతర ప్రయత్నాలవల్ల నవజీవనం ప్రసాదిస్తుంది. సూర్యుని వంటి దీర్ఘాయువు, ఆరోగ్యాన్ని ప్రసాదించేది గాబట్టి ఖోపరీ యొక్క లోహప్రతిమగాని, రాతి ప్రతిమగానీ సర్వదా మృతకుల వెంట సమాధిలో వుంచబడుతుంది. గోబ్రైలాలు లేని మిశ్రదేశపు సమాధులు చాల తక్కువగానే లభించినవి.

ఆదిమ మిశ్రదేశపు అత్యుత్తమ శిల్పకౌశలం గోబ్రైలా మూర్తుల చక్కదాలలో కన్పిస్తూంటుంది. అతికఠోరమైన రాళ్ళపై గూడ ఎంతో అందంగానూ, స్పష్టంగానూ, అంగప్రత్యంగాలనూ చిత్రించారు. సెరాఫిస్ సమాధిలోని గోబ్రైలా ప్రతిమవంటి అందమైన దాన్ని నేనెక్కడా చూడలేను. నేను లోగడ చెప్పినట్లు యీ పట్టిక 2అం. పొడవు 6అం. వెడల్పు మధ్యభాగం 4అం. కలిగి స్వల్పమైన అంచులు కలిగి వున్నది. ఇది పైభాగంలో ఎత్తుగానూ, క్రిందివైపు చతురస్రంగానూ వున్నది. దీనిమీద వ్రాయబడివున్న సూక్ష్మ చిత్రలిపిని తెలుసుకోవడానికి మైక్రోస్కోపు అవసరమైంది. పైభాగంలో నైలునదీప్రవాహంపై నౌకారూఢుడైనదినకరుని (ఖోపరీ) ప్రతిమవున్నది. ఖోపరీదేవతకు క్రిందిభాగాన రెక్కలు విప్పి తనవెనుక రెండు కాళ్ళపై గోబ్రైలా తిన్నగా నిలబడి వుంది. ఖోపరీదేవత వారి కిరువైపులా, నావముందూ వెనుక అందమైన కమలాలతో వంగివున్నది. ఎదుట జంబుకవదను

డైన అనుబిస్ (మృత్యుదేవత) బద్ధాంజలుడై నిలబడి వున్నాడు. సూర్యదేవుడు విరాజిల్లుతూన్న సింహాసనంపై 'మితసీహార్పి' అన్న పేరు నాకు సుపరిచితమే. అయినప్పటికీ నన్ను దేవతా ప్రతిమకంటె క్రిందిభాగంలోవున్న గోబర్రైలా ప్రతిమ అధికంగా ఆకర్షించింది. చిత్రలిపి అతి సూక్ష్మంగా వున్నప్పటికీ మైక్రోస్కోపు సహాయంతో దాన్ని తెలుసుకోవడం ఏమాత్రమూ కష్టమనిపించలేదు. లిపి సురక్షితంగానే యున్నది. దాని ప్రతిపదానువాదం చేసే అవసరమూ లేదు, సంభవమూగాదు. దానిమీద వ్రాసినదాన్ని చెప్పడం సరిపోతుంది.

శాసనం సెరాఫిస్ సమాధిలోప్రవేశించు సందర్భంతో ప్రారంభమౌతుంది. అక్కడక్కడా చాల అస్పష్టంగానూ, దురూహ్యంగానూ వుంటుంది. ప్రాచీన మిశ్రదేశపు శాసనాలపై తరచు గోబర్రైలా సూర్యదేవుడైన 'రా' ముఖంమీద కూర్చునట్లు చూపించబడింది. సమాధిద్వారంమీద ఒక 'రా' విగ్రహం, ఒక రహస్యమయ చిత్రలిపిగల శిలవున్నది. అది యేదోవిధంగా గోబర్రైలా ప్రతిమకు సంబంధించివున్నది. దానిని కొన్ని రహస్య పద్ధతులతో మేళవిస్తే సమాధిద్వారం స్వయంగా తెరచుకొంటుంది.

ఇది బహుశా అలీఫ్ – లైలా లా 'ఖోలో–శీశమ్' వలె వుంటుంది. దాన్నిగూర్చి మొదట్లో నావుద్దేశ్యం గూడా ఇదే. మిశ్రదేశపు సభ్యతను గూర్చి అధ్యయనం చేసే విద్యార్థినైనందువల్ల దీన్నిగూర్చి అధికాసక్తుడనై వుడడం నిశ్చయం. కాని దీన్ని నే నేమాత్రం సంభవమని తలచలేదు. పూర్తిగా

యీ విషయం సరియైనదేనని నేను తరువాత తెల్సుకోగల్గాను. పాఠకులు గూడ ముందుముందు యీ విషయాన్ని తెల్సుకోగలరు. ఇందులో ఇంద్రజాలపు మంత్రతంత్రాలేవీ లేవు. యీనాడుగూడా కొన్ని విశేషాక్షరాలను కలిపి ఒక క్రమపద్ధతిన వుచ్చరిస్తే, తాళపుచెవి లేకుండానే, స్వయంగా బిగించుకుపోయేవీ. మళ్ళి వాటంతటవి తెరుచుకొనే తాళాలు దొరుకుతయ్.

చిత్రలిపియందు అధికభాగం గోబర్రైలా శాపాన్ని గూర్చి వున్నది. పాఠకులు ప్రాచీన మిశ్రదేశపు దేవతల వ్యక్తిత్వాన్ని గ్రహించనంతవరకు, వారి పునర్జన్మ సిద్ధాంతాన్ని ఒప్పుకోనంతవరకు, నేను దానికి ప్రతిపదానువాదం చేయడం నిష్ప్రయోజనమని భావిస్తాను. ఇక్కడొక నమూనా ఇస్తున్నాను.

—: గోబర్రైలా శాపము :—

"సెరాఫిస్ సమాధి రక్షకులు సర్వదా జాగరూకులై వుందురు: వారు అంత్యదశవరకు దేబిస్ రాకుమారుని శవ రక్షకులై వుందురు. రక్షకులు వధింపబడిననాడు దేవతలు స్వర్గలోకపు నాల్గు కొనలనుండి ఆ సమాధి రక్షణార్థమై దిగి వత్తురు."

"ప్రథమమున సమాధియందు ప్రవేశింప యత్నించు వాని కొరకై 'అనుబిస్' నిరీక్షిస్తూండును. ఆ మృత్యు దేవత ఆ వ్యక్తిని శాశ్వత నరకలోకమునకు కొనిపోవును. సమాధిలోని వస్తువులపై అధికారము గోరువాడై గోబర్రైలా

ప్రతిమను తస్కరించిన ఆతడు సూర్యదేవుని శాపమునకు గురిఅగును. సర్వనాశనకరమైన ఆపదలు వానిని అడుగడుగున ఎదుర్కొనును. గోబ్రైలా ప్రతిమ తనవద్ద నున్నంత వరకు ఆతడు విశ్రాంతిగాని, సుఖముగాని పొందజాలడు. ప్రపంచమంత దెచ్చటున్నా వాడు పట్టి వధింపబడును. రక్త వర్ణము గల నైలునది నీరు జన్మించిన స్థలమునూ, పక్షులు సయితము జీవించజాలని భయంకరమైన సూర్యదేవుని భూమిని దాట గోరువాడు తక్షణమే సర్వనాశనమై పోగలడు.

అయినప్పటికీ నేనా శాసనమంతా చదివి యేమాత్రం చలించలేదని నిశ్చయంగా చెపుతాను. ఎన్నో రోజులుగా మిశ్రదేశపు పురాణ కథలను, కల్పిత గాథలను పూర్తిగా తెలిసికొని వున్నప్పటికీ, వాటిని వైజ్ఞానికదృష్టితో గాక, మరే ఇతర దృష్టితోనూ చూడలేను. గోబ్రైలా శాపంలో వాస్తవికత వున్నదని క్షణమాత్రమైనా విశ్వసించలేను. దాని పట్ల నాకు విశ్వాసం వున్నదని ఇప్పటికీ అంగీకరించను.

నేను దానిని యేమి చేయా లనుకొంటున్నానో చెప్ప లేను. నిజానికది నా సంపదే. నిశ్చయంగా అది మ్యూజియంకు చెందినదిమాత్రం గాదు. దానికి నిజమైన యజమాని వృద్ధ రామేశ్వర్. అతడు దానితో యేమాత్రం సంబంధం పెట్టు కోవడానికి పూర్తిగా నిరాకరించాడు. దానిని ఆనాడే నలందా మ్యూజియంకు సమర్పించి వుంటే వేరే సంఘటన లేవీ జరిగి వుండేవి కావు.

నేను ఫలహారం చేసే సమయంలో నా నౌకరు ఒక భద్రపురుషుడు నన్ను కల్సుకోగోరుతున్నాడని చెప్పాడు. ఇది మాట్లాడే సమయం కాదనిపించింది. నే నచ్చటనుండి లేచి అధ్యయన గృహానికి వెళ్ళగానే అచ్చటొక అసాధారణ వ్యక్తిని చూచాను. అతడు ఆజానుబాహువు. బట్టతల అయి నప్పటికీ వున్న కాసిని వెంట్రుకలు నల్లగానే వున్నవి. గడ్డం, మీసాలూ లేవు. కాని చిబుకం, కపోలాలపై వున్న నల్లదనం ఎన్నో రోజుల క్రితం క్షౌరం చేయించినట్లు తెలుపుతోంది. అతని నేత్రాలు దీప్తులై ప్రకాశవంతంగా వెలిగిపోతున్నవి. గుండ్రని నిండుదనంగల వదనం దృఢ కాంక్షాశక్తి గలవా డని చెపుతున్నది.

ఆయనకు నమస్కారం చేస్తూ పేరు అడిగాను. "తమ దర్శనమిచ్చి నన్నిలా ఎందుకు కృతార్థుణ్ణి చేశారు?" దాని కాయన కొంచం పెద్దదయిన గంభీరస్వరంతో అన్నాడు. "నేనొక న్యాయవాదిని. నన్ను ధనదాసు జౌహారీ అంటారు."

నేను :- క్షమించాలి. మీరు శివనాథ జౌహారీ బంధు వులు కారుగదా?

ధనదాస్ :- క్షమించాల్సిందేముంది? దానాపూర్‌లో 1881 సం॥లో హత్య చేయబడిన శ్రీ శివనాథ్ జౌహారీ నా స్వంత పినతండ్రే.

నేను :- సరే, మీ యీ దర్శనానికి, ఆ భీభత్స కాండకు సంబంధమేమీ లేదుగదా?

ధన :- క్షమించాలి. వున్నది. దానితో అత్యధిక సంబంధం వున్నది.

నేను చాలాఆశ్చర్యపడ్డాను. నిజంచెప్పాలంటేనేనప్పుడు చాలా బాధపడ్డాను. అయినప్పటికీ ఒక గృహ యజమాని ప్రశాంతంగా తన అతిథిని సత్కరించినట్లుగానే నేనూ చేయా లనుకొన్నాను.

నేను:- తమరు నాలో మంచి కుతూహలం గల్గించారు. దయచేసి ఇలా కూర్చోండి.

నేను కుర్చీవైపుకు సంకేతం చెయ్యగానే అతడు దానిపై ఆశీనుడయ్యాడు. తన జేబునుండి ఎన్నో పాత నోటు పుస్తకాలు తీసి అతను టేబులుమీద పెట్టాడు. అప్పుడు తన కంఠాన్ని సవరించుకొని చెప్పడం ప్రారంభించాడు.

ధన :- ప్రొఫెసర్, యీనాటి మిశ్ర తత్వవేత్తలలో మీరే అగ్రగణ్యులని నా విశ్వాసం.

నేనీ మాటకు జవాబివ్వడం శిష్టతకూ, వినయానికీ విరుద్ధం గాబట్టి తలవంచి వూరుకొన్నాను.

ధన:- మీరు అందరికంటే ప్రామాణికులని ఎంచబడే విషయంలో నా పినతండ్రిగారికి అధికమైన అభిరుచి వుండేదని బహుశా మీకు తెలియదనుకొంటాను. ఆయ నెంతో దూర యాత్రలు చేశారు. తన పట్టు వ్యాపార సంబంధంలో ఎన్నో దేశాలు తిరిగారు. వ్యాపారం మానుకొన్న తరువాత గూడా యాత్రలు చేస్తూండేవారు. ఆయనకొక మాంచి వుత్సుకత పరిజ్ఞానం గల విషయం వున్నది. ప్రొఫెసర్‌జీ, నేనొక స్పష్ట

మైన ప్రశ్న అడుగ గోరుతున్నాను. దానికి ఒక గౌరవనీయు మైన వ్యక్తికి తగినట్లుగానే సమాధానం కోరుతున్నాను.

అతడు తన నల్లని కళ్ళలోని సూదులలాంటి చూపు లను నా ముఖంమీద చొప్పించి కొద్దిసేపు మౌనంగా కూర్చొ న్నాడు. నేను ఆత్మరక్షణగా "నేను మీ సేవలకై సిద్ధంగానే వున్నాను" అని చెప్పాను.

ధనదాసు అడిగాడు. "తమకు సెరాఫిస్ సమాధి యొక్క గోబ్లెట్లాతో పరిచయం వున్నదా ? లేదా ?"

ధనదాసు నన్నీ ప్రశ్న వేసినప్పుడు నేను విచిత్రా వస్థలో పడ్డాను. కొద్ది సేపటివరకూ నేనేమీ చెప్పలేక పోయాను. నేను స్వప్నావస్థలో వున్నానా అని నిర్ణయించు కోవడం గూడా కష్టమైపోయింది. దేవీను రాకుమారుడు సెరాఫిస్ మరణించి కొన్ని వేల సంవత్సరాలైనప్పటికీ నన్ను వెంటాడుతున్నట్లుగా అనిపించింది. ధనదాసుతో నేనేమాత్రం అబద్ధం చెప్పదల్చుకోలేదు. నేను తేరుకోగానే వాస్తవ మైన సమాధానం ఇచ్చాను.

నేను :- కొద్దిరోజుల క్రితం నన్ను మీరు యీ ప్రశ్న వేసివుంటే "లేదు" అని సమాధానం ఇవ్వవలసివచ్చేది. నేను కేవలం సెరాఫిస్ సమాధియొక్క గోబ్లెలాను గూర్చి తెల్సుకోవడమే గాక, అది యీ గదిలోనే, మీరు కూర్చున్నచోటునే వున్నదని యిప్పుడు స్పష్టం చేస్తున్నాను.

ఇది వినగానే అతనొక్కసారిగా నిలబడ్డాడు. అతని ముఖకవళిక మారిపోయింది. అతడు నా ఎదుటే నిలబడి

వున్నాడు. వ్యాకులతతో ప్రతి అంగం వణికిపోతోంది. అతని స్వరం ఏదో భయంకర అడవిమృగం గర్జించినట్లుగా వున్నది. నేనుగూడా అతని యీ స్థితిచూసి గాబరా పడ్డాను.

ప్రతిధ్వనించే విధంగా ఆయన అన్నాడు: "యీ గది లోనే! ఎక్కడుంది? కొంచెం చూపించండి—ఇప్పుడే—నేను గూడా కాస్త చూస్తాను."

నేనొక పర్యాయం ఆశ్చర్యంతో అతనిని చూశాను. లేచి సొరుగువద్దకు వెళ్ళి చూశాను. కాని ఆ ప్రతిమ అక్కడ లేదు. చేతిసంచి చూడగా అది కన్పించింది. ఇప్పుడది కాగితంలో చుట్టబడిలేదు. నేను దానిని ఆయన చేతికిచ్చాను.

పవిత్రమైన నదిలో సింహాసనస్థుడై వున్న సూర్యదేవుని జూచిన అతని మామూలు దృష్టివలన అతనికి మిశ్రదేశాన్ని గూర్చి ఏమాత్రం తెలియదని తెలుసుకొన్నాను. అతడు దానిని త్రిప్పి క్రిందిభాగాన చెక్కబడివున్న చిత్రలిపిని చూచాడు.

ధన :- తమ రిదంతా చదవ గలరా ?

నే నాతని యీ మోటు ప్రవర్తనను జూచి మనస్సులోనే కోపగించుకొన్నాను. అయినప్పటికీ నేను దానిని బాగానే చదవగలనని మాత్రం చెప్పాను. అతడు గావుకేక బెట్టినట్లుగా "యిందులో ఏమున్నది?" అని అరిచాడు.

నే నతనిని కుర్చీలో కూర్చొని ప్రశాంతంగా మాట్లాడ మన్నాను. అప్పుడతడు మళ్ళీ కుర్చీలో కూర్చొన్నాడు. కాని అతడు తన చేతులు నలచుకోవడం, త్రేళ్ళాడించడం, శరీ

రాన్ని వూగించడంవంటి శారీరక క్రియలవల్ల చాల ఆతురతగా వున్నట్లు గమనించాను.

నే నప్పుడా శాసనాన్ని చదివి ప్రతి శబ్దాన్ని అనువదించి చెప్పడం ప్రారంభించాను. మధ్య - మధ్య ప్రకరణాల్లో వచ్చిన మిశ్ర దేవతల్ని గూర్చిగూడా చెప్పుకొంటూ వెళ్లాను. ఆయన చాల జాగ్రత్తగానూ, తన్మయత్వంతోనూ మాట బీరు బోకుండా వింటున్నాడు. నే నంతా విన్పించిన తర్వాత, ఆయన చేయి చాచి మహాకమాను చూడడానికి యివ్వమని అడిగాడు. "దీని అర్థమేమిటి?" అని సింహాసనంపై వున్న శాసనం వైపు సంకేతం చేస్తూ ఆయన అడిగాడు.

నేను:- ఇచ్చట 'మితసీహార్ప్' అని వ్రాయబడి వున్నది; యిది సెరాఫిస్ సమాధి చేయబడ్డ చోటు.

ధన :- అక్షరాలా నిజం. ఈ మితసీహార్ప్ యెక్కడున్నదో మీకు తెలుసా?

నేను తెలియదన్నట్లు తల వూపాను.

ధన :- కాని, నాకు తెలుసు. నేను ఆశ్చర్యంగా అతని వైపు చూశాను. నిజంగానే అచ్చట ఆశ్చర్య పరంపరలు.

"ఐతే తమరు ప్రాచీన మిశ్ర దేశాన్ని గూర్చిన యే చరిత్రకారుడూ పోటీలు పడి సయితం తెలుసుకోని విషయాన్ని తెలుసుకొన్నారన్నమాట" అని నే నన్నాను. ఆయన పిడుగులాగా గర్జించి కుప్పగా బడివున్న నోటుపుస్తకాల మీద చేయి చరిచి అన్నాడు. "నావద్ద రేపు వుదయమే మితసీ

హోస్పీకి ప్రయాణమై పోవడానికి కావలసిన వివరణ వ్రాసి వున్నది.

నేను :- మీకు అక్కడకు వెళ్ళాలనే వుద్దేశ్యము వున్నదా ఏమిటి?

ధన :- అవును, కాని ఒక షరతుతో.

నేను :- అదేమిటి?

ధన :- మీరుగూడా నాతో ప్రయాణానికి సిద్ధమైతే.

నేనొక పర్యాయము అతనివైపు చూచాను. నాకతడు వున్మాదిలా కన్పించాడు.

నేను :- కాని యిది చాల కష్టమైన పని. ఎందుకంటే నేనిచ్చటనలందా విద్యాలయంలో ప్రొఫెసర్ క్యూరేటర్ వంటి బాధ్యతగల పదవుల్లో వున్నాను.

ధనదాసు తన కుర్చీనుండి లేచి నా వద్దకు వచ్చాడు. తన సన్నని చేతిని నా భుజంపై వేసి అన్నాడు- "ప్రొఫెసర్‌జీ, సెరాఫిస్ సమాధి వద్దకు వెళ్ళడానికి అనేక ఆశాపూరితాలైన కారణాలున్నాయి. మీరు నా వెంట రాగలరనే నా వుద్దేశ్యము. మీరు దయచేసి కూర్చోండి. విషయానంతటినీ విపులీకరిస్తాను."

అతని వ్యవహారం కటువుగానూ, ఔద్ధత్యంగానూ వున్నది. మాట్లాడే పద్ధతిగూడా వినయంగా లేదు. ఆయన నన్ను పట్టుకొని నా కుర్చీలో కూర్చోబెట్టి తన కోటుజేబు నుండి ఏదో వస్తువును బయటికి తీశాడు. దాన్ని చూడగానే నేను గుర్తించాను. అవి ప్రాచీన మిశ్ర దేశానికి సంబధించిన చిత్రలిపిలో వ్రాయబడివున్న కాగితాలు.

3

# శివనాథ జౌహరీ విచిత్ర యాత్ర; నా అనాలోచిత నిర్ణయం.

ఆయన చుట్టజుట్టిన ఆ ప్రాచీన మిశ్ర దేశానికి సంబంధించిన కాగితాలను నోటుబుక్కులమీద పెట్టి మోకాళ్ళను చేతులతో బిగించుకొని కుర్చీలో కూర్చున్నాడు. నేనప్పుడు అతని బిగించిన చేతులను చూశాను. ఆ చేతులు అతని అపారమైన శారీరక శక్తిని తెల్పుతున్నవి.

ధన:- చాల రోజులక్రితం నా పినతండ్రి 'కాహిరా' (నేను దీన్ని కైరో అంటాను) లో బజార్లలో కాగితాలమ్ముకొనే వాళ్ళవద్ద వీటిని కొన్నారు. అప్పుడాయనకు వీటి వుపయోగం లేశమాత్రంగూడా తెలియదు. ఆయన చిత్రలిపి చదవలేనప్పటికీ తనకున్న సహజ కుతూహలంకొద్దీ కొన్నారు.

'పినతండ్రిగారి మరణానంతరం నేనాయని సంపదకు వారసుణ్ణయ్యాను. స్వాధ్యాయసీలుడైనందున ఆయనవద్ద ఒక పెద్ద గ్రంథాలయం వుండేది. కాని నేనుమాత్రం న్యాయ శాస్త్ర గ్రంథాలు, వార్తాపత్రికలు తప్ప యితర పుస్తకాలు చాలా తక్కువ చదివేవాణ్ణి. కొద్ది రోజుల క్రితమే నా పిన తండ్రిగారి వస్తువుల్లో నాకీ నోటుపుస్తకాలు దొరికినవి. వారి వ్యాసాలను చదివి నేనెంతో ఆశ్చర్యపడ్డాను. నా పినతండ్రి

గారు గొప్ప పర్యాటకుడని మాత్రం నాకు బాగా తెలుసు. కాని యిలాంటి అసాధారణమైన కష్టాలను ఎదుర్కొన్నారని మాత్రం తెలియదు. ఈ నోటుబుక్కులలో ఒకటి డైరీగా వ్రాయబడ్డది. దీని ద్వారానే నేను మీకు విన్పించబోతున్న కథను తెలుసుకొన్నాను.

నేను చదవజాలని యీ కాగితాలు చాల వుపయోగ కరమైనవి. దీనిలో సెరాఫిస్ శవంతో పాటు మితనీహార్పిలో సమాధి చేయబడ్డ ఖజానా వివరం వున్నది. ఇవి ప్రాచీన వస్తువులన్న భావం వదలివేసినా యీ నాటి మార్కెట్ ధర ప్రకారం లెక్కగడితే ఆ సువర్ణ పాత్రలు, రత్నాలతో నిండి వున్న బుట్టలు మరి యితర వస్తువులు 5-6 వందల కోట్ల రూపా యలకు తక్కువ విలువగలవి కావని నా పినతండ్రిగారు అంచనా వేశారు. ప్రొఫెసర్, మీరిది వింటున్నారా ?

మిశ్రదేశపు యే సమాధిలో గూడా యింత పెద్ద ధనా గారం ప్రతిష్టమై వుండడం కష్టమని నేను జవాబుగా చెప్పాను. అయినప్పటికీ అసంభవమని చెప్పడానికి మాత్రం సిద్ధంగా లేను.

ధన :- భూగృహాలనుండీ, సమాధుల నుండీ బయట బడ్డ వస్తువులమీద అచ్చటి ప్రభుత్వానికి అధికార ముంటుం దన్న మాట నిజమేనా ?

నేను :- అవును, నిస్సందేహంగా.

ధన :- సమాధి ఎక్కడో "సోబాత్" వున్నమ స్థానంలో వున్నప్పుడుగూడా ?

నేను :- ఇది వేరే ప్రశ్న. ఏ వ్యక్తి అయినా సోబాత్ వున్నను స్థానం ఇప్పటి వరకు కనిపెట్ట గల్గాడేమో నాకు తెలియదు. అది బహుశా అబిసీనియాలోని మోంగాలా లేక కాఫా జిల్లాలో వున్నది.

ధన :- అదెచ్చట వున్నదో నాకూ తెలియదు; కాని అక్కడికెలా పోవాలో తెలుసు; నేను తప్పకుండా వెళ్ళాలన్న దృఢ నిశ్చయంతో వున్నాను.

నేను :- మీరు ఏ వుద్దేశ్యంతో వెళ్ళాలనుకుంటు న్నారో అడగొచ్చా ?

ధన :- సెరాఫిస్ సమాధిని హస్తగతంచేసి కొనడానికి.

నేను :- మీకు వెళ్ళేమార్గం తెలిసినప్పటికీ ఇలా చెప్పడం చెయ్యడంకంటే చాల తేలిక. నన్ను మీ వెంట తీసుక వెళ్ళడానికి వేరే విశేష కారణమేమైనా వున్నదా ?

ధన :- ఇక్కడకు రాకపూర్వం దీని కనేక కారణా లున్నవి. ఇప్పుడు మరొకటిగూడా. మీరు యీ గోబర్ లాకు యజమానులై వుండడమే ఆ మరొక కారణం. ఇదే ధనాగారాన్ని తెరిచే తాళపుచెవి.

నేను తలవూపి, నా అంగీకారాన్ని ప్రకటించాను. నా వుత్సుకత మరీ పెరిగి పోతోంది. నాకు ధనాకర్షణ లేనప్పటికీ పురాతత్త్వం, విజ్ఞానాలకు సంబంధించిన ఒక గొప్ప ఆవిష్కర ణలో సమర్థున్నవుతానని నాకు బాగా తెల్సు. "ఇంకా మరి తర కారణాలేమి"టని అడిగాను.

ధన:- మీరీ విషయంలో అందర్నీ మించిన విద్వాంసులు. బహుశా మీరు ప్రాచీన మిశ్రీయుల భాషను తెలిసికొననూగలరు, మాట్లాడనూ గలరనుకుంటాను.

నేను :- నిజమే. కాని నాకిలాంటి అవకాశ మెప్పుడూ లభించదు. ప్రాచీన మిశ్రదేశపు భాష మృతిచెంది శతాబ్దాలు గడిచిపోయినవి.

ధనదాసు తన వీపును కుర్చీకి మోపి చేతులను తల వెనుకగా కట్టుకొన్నాడు. యీవిధంగా మాట్లాడకుండా చాల సేపు నా వైపు చూస్తూ "మీరీ విషయంలో పూర్తిగా పొరబడుతున్నారు. ప్రాచీన మిశ్రభాష మృతి చెందలేదు. అది యీ నాటికీ వాడుకలో వుంది. మనం యీ సలంధాలో మాట్లాడుతున్న యీ తరుణంలో గూడా అది అక్కడ మాట్లాడబడుతూ నేవుంది.

నేను నమ్మలేక "ఎక్కడ" అన్నాను.

ధన :- మితనీహర్ప్లో.

నేను మాత్రం దీన్ని విశ్వసించడానికి సిద్ధంగా లేను. నాకు అనుమానం గల్గడానికి కారణమేమిటంటే ఆ వ్యక్తి చెప్పేదేదో గంభీరంగానూ, తీవ్రంగానూ చెపుతున్నాడు.

నేను :- మీకీ విషయం ఎలా తెల్సింది ?

ధన :- అయితే నేను చెప్పేది వినండి. ఏదోవిధంగా మితనీహర్ప్ ఎక్కడున్నదీ నా పినతండ్రిగారు ఆచూకీ తీశారు. కష్టాలతోనూ, ఆపదలతోనూ పరిపూర్ణమైన యాత్రలలో, ఆనందించే వారిలో ఆయనొకరు. తను వెళ్లేమార్గం దుస్తర

మైనదీ, భయంకరమైనదీ, అని ఆలోచించకుండానే ఆ పర్యటనలో పాల్గొన్నారు. యీ మ్యాపును చూడండి.

ధనదాసు యిలా చెపుతూనే ఒక మైనపు కాగితాన్ని తీసి బల్లమీద పరిచాడు. కాగితం అనేకచోట్ల చినిగివుంది. చినిగినచోటల్లా కాగితపు ముక్కలు అంటించబడి వున్నవి. మ్యాపు రంగు రంగులుగానూ, వ్యాపారస్థులు వాడే చక్కని సిరాతోనూ వేయబడివున్నది. పేరు గంటంతోనూ, చిన్న చిన్న అక్షరాలలో వ్రాయబడి వున్నప్పటికీ చదవడానికి అనుకూలంగానే వున్నది. నేను కుర్చీనుండి లేచి అతని భుజం మీదుగా వంగి చూశాను. ధనదాసు తన పినతండ్రిగారి పర్యటనా మార్గాన్ని వ్రేలుతో చూపెడుతున్నాడు.

శివనాథ్ నైలునదిని అధిగమించి, సోబాత్ లోయలో ప్రవేశించి ఎన్నో సంవత్సరాలు గతించినవి. అప్పుడాయన అజక్ పట్టణానికి పైనున్న అడవిలో తిరుగుతూ ఒక జల ప్రపాతాన్ని చేరుకొన్నారు. దానికి క్రింది భాగంలో 'సీవకుల' గ్రామం ఒకటున్నది. నైలునది వొడ్డునున్న యీ హబ్షీజాతి కాసిలిక్ జాతికీ అనేక విషయాల్లో సామ్యముంది. వారు రెల్లు కప్పు, మట్టితో అలకిన గోడలూ, వాటిచుట్టూ రెల్లు తడికలు గల్గి నలభై అడుగుల వ్యాసంగల చుట్టుగుడిసెలలో వుంటారు.

ఆ గ్రామానికి దక్షిణంగానూ, పడమరగానూ ఎడారి వుంది. పరిమాణాన్నిబట్టి పటం గీయబడివుంటే ఆ ఎడారి పొడవు 100 మైళ్ళు పొడవుంటుంది. ఆ ఎడారిలో పచ్చిక భూమిగాని, ఏదైనా గ్రామంగానీ, పట్నంగానీ, కొండగానీ,

కొండచరియగానీ ఎలాంటి చిహ్నాలూ లేవు. పటంలోని యీ ఖాళీస్థలంలో యీ వాక్యం వ్రాయబడి వుంది. "యీ ఇసుక భూమిపై సూర్యుడు నిప్పు ముద్దవలె ప్రజ్వరిల్లు చుండును."

ఈ ఎడారి దక్షిణ పశ్చిమ దిశగా ఒక పెద్ద రాతిదిన్నె వరకు వ్యాపించి వున్నది. ఎడారి చివరిభాగంలో పర్వతమే ఒక గోడగా నిలబడి వున్నది. అది వుత్తర పశ్చిమ దిశల్లో దృష్టికందనంతవరకూ వ్యాపించి వున్నది.

ఆనోటు పుస్తకాల్లో ఒకదానిలో ఆ పెద్ద రాతిదిన్నెను ఎక్కడానికి ఒక్కమార్గం మాత్రమే వున్నదని వ్రాసి వుంది. మిశ్రదేశీయుల దేవతలైన థాత్, అనుబిస్‌ల పెద్దపెద్ద విగ్రహాలు ఆ పర్వతంలో చెక్కబడి వున్నవి. యీ రెండు విగ్రహాల మధ్యగా క్రిందినుండి పైవరకు సోపానాలు చెక్కబడి వున్నవి. శతాబ్దాలుగా కురుస్తున్న వర్ష ప్రభావంవల్ల అవి అరిగి పోయినా పగటివేళ సులువుగా ఎక్కవచ్చు. శివనాథుని దృష్టి ఎంత సూక్ష్మమైనదంటే ఆయన ఆ మెట్లను లెక్కించి సంఖ్యనుగూడా వేశారు. అవి 365 మెట్లు అంటే సౌర సంవత్సరపు రోజులకు సరిపోతవి. ఇంకోవిధంగా చెప్పాలంటే ఒక్కొక్క మెట్టు ఒక్కొక్క అడుగు వున్నదనుకుంటే ఆ గోడ ఎత్తు 365 అడుగులు.

సోపానాల నధిగమించిన తర్వాత ఎదురుగా మనోహరమైన, సారవంతమైన భూమి కన్పిస్తుంది. ఇది దక్షిణ దిశగా 40 మైళ్ళ పొడవుగల్గి కొండలవద్దకు చేరుకొంటుంది.

పూర్వకాలంలో మెట్ల పైభాగంనుండి కొండవకొండ చివరి వరకూ ఒక రోడ్డు నిర్మించబడి వున్నది. కాని ఇప్పుడది సమీపస్థ ప్రదేశాలవలనే గడ్డితో కప్పుకొనిపోయింది. అయినప్పటికీ దానిని గుర్తించడం కష్టమేమీ కాదు. ఎందుకంటే గిజా మ్యూజియంలో వున్న విగ్రహాలలాంటివే ఆ కొండ కిరువైపులా కన్పిస్తాంటవి.

ఈ మార్గం యాత్రికులను దక్షిణపర్వతపు క్రింది భాగాన వున్న మితనీహార్పీ నగరానికి తీసుకుపోతుంది. థేబిస్ మందిరపు రాళ్ళపై చిత్రించినట్లుగానే సూర్యదేవుని ఆలయపు భూగర్భ గృహంలో థేబీయ రాకుమారుని శవమున్నూ, ధనాగారమున్నూ ప్రక్షిప్తం చేయబడినవి.

శివనాథుడు (నైలు) నదీలోయ వాసులగు ప్రాచీన మిశ్రీయుల రూపురేఖలను, ఆచార వ్యవహారాలను బోలిన మరొక జాతిని మితనీహార్పిలో చూశాడు. విశేషించి వారి భాష, పూజామందిరాలు, నివాస గృహాలు మొదలైనవన్నీ మిశ్రీయులను బోలివుంటవి. నోటుబుక్కులోని వ్రాతలు సరైనవైతే శివనాథుని కార్యం హర్షించదగిందే. ఆయన శరీరం అనేక శతాబ్దాలను వెనక్కునెట్టి కాలగర్భంలో దాగిపోయిన జగత్తునుండి స్వీయ నేత్రాలతో సందర్శించినట్లుగా వుంది.

ఈ విచిత్ర విషయాలన్నీ అతడొక వున్మాదుడైయుండి మానసికంగా వికృతావస్థలో వున్నప్పుడైనా జనించివుండాలి. లేక అత్యంత సౌభాగ్యవంతుడైనపుడయినా అయివుండాలి.

అయినప్పటికీ ఇందుకు సంబంధించిన వైజ్ఞానిక మహత్తు అతని కేమాత్రం తెలియదని డైరీ తెల్పుతోంది. దీన్ని ప్రచురించి సభ్య ప్రపంచంలో ఎంతటి యశస్సును పొందగలిగేవాడో ఆయనకు తెలియదు. సమాధిస్థ ధనాగారాన్ని కొల్లగొట్ట డమే ఎడారియాత్రలోని ఆయన ప్రధాన వుద్దేశ్యం.

ఆయన అనుకొన్నంత తేలిక కాదుగా! యీ విష యంలో వ్రాతపూర్వకమైన యే ఆధారాలూ లేనప్పటికీ రాత్రింబవళ్లు అతి జాగ్రత్తగా ధృఢకాయులైన పూజారులు సమాధిని రక్షిస్తూంటారని తెలుస్తుంది. నోటుబుక్కులలోని వాస్తవ విషయాలవైపుకు నన్ను ప్రేరేపించిన మరొక కారణ మిది. దీన్నిగురించి స్వయంగా గోబరైలా ప్రతిమపై నేను చదివాను — "సెరాఫిస్ రాకుమారుని సమాధి రక్షకులు సర్వదా అత్యంత జాగరూకులై వుందురు."

శివనాథుడు మితనీహార్ప్ చేరుకొని అవకాశంకొరకు వేచివున్నాడు. ఒకనాడాయన కొద్ది అవకాశాన్ని చేజిక్కించు కొని ప్రతిమను సంగ్రహించగల్గాడే గాని, సమాధిలో ప్రవే శించలేకపోయాడు. ఈ విషయం వూహాగానం మాత్రమే. తరువాత శివనాథ్ తన ప్రాణాలను గుప్పిట్లో పెట్టుకొని పారి పోయిన విషయం వర్ణించబడి వుంది. ఆయనను శత్రువులు వెంటాడగా విగ్రహాల మార్గాన పారిపోయాను. ఇది చదువు తున్న సమయంలో ఆయన భయంకర హత్యవైపుకూ, ఆ మంత్ర తంత్రాలవైపుకూ నా దృష్టి మళ్ళింది. నాగుండెపై కొండలు పడ్డట్లుగా వుంది.

'మాగధ' పత్రిక పాతప్రతి యీ సాక్ష్య శృంఖల యందు లోపించిన ఆ ఒక్క లింకును పూర్తిచేసింది. నేనీ విషయాన్ని చదివేటప్పుడు సాక్ష్యమంతా వున్నప్పటికీ దీన్ని నిరాకరించాను. ఎందుకంటే నా దృష్టిలో ప్రాచీన మిశ్ర భాషనుగాని, ఆ ధర్మాన్నిగాని స్మరించేవాళ్ళు యీ జగత్తులో నామమాత్రంగానైనా లేరు. కాని విస్మరింపజాలని సెరాఫిస్ సమాధి పూజారులో! ఆ భయంకర పూజారులు సెరాఫిస్ సమాధియొక్క తాళపుచెవి అయినటువంటి గోబరైలా ప్రతిమ తస్కరింపబడగానే శివనాథ్‌ను వెంటాడారు. అలా వెంటాడుతూ ఆ సైకత, వేష్టిత, అజ్ఞాత, భయంకర, మృత్యు సదృశమైన ఎడారిని దాటి భాగీరథీ తీరాన్ని చేరుకొన్నారు. ఆఖరుకు వారు తమ ప్రాచీన విధివిధానాలతో శివనాథుణ్ణి దానాపురంలోని అతని స్వగృహంలోనే ప్రాణాలు తీసిగాని వదలలేదు.

నేను దీన్నిగూర్చి ఆలోచించినకొద్దీ యీ విషయంలోని సత్యాన్ని తప్పనిసరిగా గుర్తించాల్సి వచ్చింది. ఇక్కడ గూడా శత్రువులు తన్ను వెంటాడుతున్నారని శివనాథ్ తెలిసికొన్నారు. ఇందువల్లనే ఆయన అంతులేని వ్యాకులంతో నలందా వచ్చి మ్యూజియంలో వున్న రామేశ్వర్ చేతిలో గోబరైలా ప్రతిమను పడవేసి వెళ్ళిపోయాడు. మిశ్రీయులు గోబరైలా కోసం ఆయన గృహాన్నంతా గాలించి, అల్లకల్లోలం చేసిగూడా సత్ఫలితాన్ని పొందలేక పోయారు. అయినప్పటికీ సెరాఫీయ పూజారులు ఎంత వికట స్వభావులో దీనివల్ల స్పష్టమవుతోంది. సముద్ర తీరానికి వేలకొలది మైళ్ళ

దూరం గలిగి, దుర్గమమైన ఇసుక ఎడారులచే పరివేష్టింపబడి యున్న స్వీయనగరాలను పరిత్యజించి, ఇంత దూరాన వున్న భారతదేశం వచ్చి, దానాపురం, అందుగల శివనాథుని గృహాన్ని తెలుసుకోవడం, ఆయనయొక్క ఒంటరితనంకోసం వేచివుండడంలో ఎన్నో రోజులు వ్యయమై పోయివుంటవి. గోబ్రైలా ప్రతిమ, సెరాఫిస్ సమాధి తాళపుచెవి. అది మాయమైతే సమాధి శాశ్వతంగా మూసుకు పోయినట్లే.

నా జీవితంలో నరనరాల్లో రక్తం వుడికి పోవడం ఇదే ప్రథమం. గోడకు వేసివున్న అద్దంలో నా ప్రతిబింబాన్ని చూసుకొన్నాను. కందిపోయిన ముఖం, మిల మిల మెరసి పోతున్న కళ్ళు, కంపించిపోయే శరీరం! నా కెదురుగా కూర్చొని తన తీక్ష్ణ దృక్కులను నాపై ప్రసరింప చేస్తున్న ధనదాసును గూడా విస్మరించాను. నే నిప్పుడు గోబర్తైలా విషయంగూడా విస్మరించాను. ఆఫ్రికా వక్షస్థలంలో థేబిస్, సాయిస్, మేంఫీస్ నగరాలను బోలిన ఒక నగరం వున్నదని, దాన్నింతవరకూ యీ నాటి సత్యజగత్తు కనుగొనలేదన్న విషయం మాత్రమే నా మనస్సులో వున్నది. నా జ్ఞాన సంస్కా రాలన్నీ క్రమంగా ఒకమారు నా కళ్ళముందు ప్రత్య మయినవి. అప్పుడు నా మనస్సులో ఒక మితనీహార్ని చిత్రి బడింది. ఆ విగ్రహం ప్రాచీన థేబిస్ను బోలి కాశీలో వుండే దుర్గంధ పూరితాలైన గ పట్నంలోని గొందులుగూడా, విలజిల్లుతూండే వ్యాపారులు వర్తకంకోసం వస్తూండేవారు. కూడ

దేశపు అత్తర్లు, విదేశ సుగంధ ద్రవ్యాలు, ఇరాన్ దేశపు అమూల్య రత్నాలు అక్కడకు చేరుతూండేవి.

తరచు ఏకాంతంగా అధ్యయన గృహంలో వున్నప్పుడు లేక మహత్తర సంగ్రహాలయపు నీరవత్వంలో నాకు ఆ సన్నాయి "పీ పీ"లు, రంహోళ్ళ ధ్వానాలు, వేల కొలది పద ధ్వనులు వినిపిస్తూండేవి. ఇవన్నీ నేను చూస్తూంటాను— నగర ద్వారం తెరుచుకుంది. ఫరహూన్ సేన యుద్ధసన్నద్ధమై బయలుదేరింది. మొదట రథాలూ, తరువాత అస్త్ర శస్త్రాలు ధరించిన రథికులూ, ప్రజలను హీనంగా చూస్తూ పురోగమిస్తున్నారు. వారి గుఱ్ఱపు గిట్టలనుండి లేచిన తెల్లని ధూళి ఆకాశంలో మేఘాల్లాగా వ్యాపిస్తోంది. పదాతిసేన బిగించిన కవచాలతో నడకా, పరుగూ కాకుండా ముందుకు సాగుతున్నట్లనిపించింది. వారి హస్తాల్లో శస్త్రాస్త్రాలూ, గదలూ వున్నవి.

ఒక భయంకర నాదంతో పాటు చక్రవర్తి అంగరక్షకులు బయటకు కదిలారు. వీరిలో ఆఫ్రికాలోని వీరులనుండి ఏరుకోబడ్డ యోధులు గలరు. నైలుతటవాసులు వీరి భుజాల
రకు మాత్రమే వస్తారు. లావైన అధరాలుగల గడ్డపు
ఘూ, విశాల వక్షస్థులు, వృషస్కంధులైన వీరులకు
ంకర యుద్ధమొక ఆటగానూ, దోపిడీ ఒక విజయ
భించింది. రెండు వైపులా పదునుగల వీరి
కాంతి పుంజంలో సౌదామినివలె మెరసి
డవు గలిగి బిగించబడిన వీరి కవచాలపై
రేఖలున్నవి. వారు జంట జంటలుగా, నిజమ

బద్ధంగా అడుగులు కదుపుతున్నారు. వీరి పేసు విస్సంత మాత్రాన అసుర దేశపు పర్వతాలనుండి సూడాన్ ఎడారుల వరకూగల ప్రతి ప్రాణీ కంపించి పోతున్నది.

అప్పుడు రథారూఢులైన మహారథులు బయలుదేరు తారు. వీరివెంట పతాకాలు పట్టిన వారూ, వుద్యోగుల సమూహమూ వుంది. అందరికన్నా వెనుక మెరసిపోతున్న కవచంలో నఖ – శిఖ పర్యంతం మునిగిపోయిన చక్రవర్తి నడుస్తున్నాడు. గాలి తాకుడువల్ల అతని దీర్ఘమైన శేర్వాణీ రెప రెప లాడుతోంది. అతడు స్వయంగా క్షీరంవలె తెల్లనైన తన గుఱ్ఱాలను వాయువేగంతో నడిపిస్తున్నాడు. కరవాలం, బల్లెం అస్త్రశస్త్రాలతో అతడలంకరింపబడి వున్నాడు. తన నెమలికన్నుల కిరీటాన్ని స్పృశించగల్గే విధంగా గుఱ్ఱములయొక్క అందమైన మూతులను బంగారు కళ్ళెంద్వారా వెనుకకు లాగి కట్టివుంది. వాటి వీపుపై జరీ అంచుల జీనులు వేయబడి వున్నవి. రథానికి ప్రక్కగా ఒక పెంపుడు సింహం నాలుకలు గోరుతూ, కుక్కవలె నడుస్తూంది. అది ఫరోవా రాజుల కులదేవతైన ఓసరిస్ సంతానం.

ఇక సైన్యంలోని మిగిలినభాగం బయలుదేరుతుంది. పీసు శతాబ్దాల తరబడి జీవిస్తూ ఎడారికి చెందిన అడవి మనుష్యులు, మూర్ఖులైన రాజభక్తులు, తర్వాత జీతాలుతినే యువన సైన్యం, చివరిభాగంలో బల్లేలతో కదిలే సైన్యాలు. ఈ సేనా వాహిని ఏ దుష్ట దేవతనో జయించుటకో, కాక బహు దూరాన సిరియా యెడారులందున్న రామ్‌సెస్ యొక్క

బ్రహ్మాండమైన శిలా స్తంభాన్ని పెకలించి వేయడానికో వెడలిపోయింది.

నా యవ్వన ప్రాయంనుండే యిలాంటి మానసిక చిత్రాలను చిత్రించుకుంటూ వుండేవాణ్ణి. నా యేకాంత అధ్యయన జీవితపు టనేక గంటలు ఈ విచిత్ర విగత జీవులతోనే గడిపాను. నేను హోరస్ మందిరంలో పూజ చేశాను. పూజారులు వేసిన గుగ్గిలపు పొగతో దేవాలయం నిండిపోవడం చూశాను. అదే సమయంలో నైలు ప్రాంతపు రాణియైన ఇసిస్ స్తుతిగానంతో మందిరమంతా ప్రతిధ్వనించసాగింది.

చక్రవర్తుల మృత్యు సమయంలో దీర్ఘ కేశధారుల శోకాన్ని నేను సందర్శించాను. నా వూహలతో ఓసరిస్ (స్వర్గదేవత) రాజ్యానికి ఆ పవిత్ర నదిలో నావపై ప్రయాణించాను. నే నక్కడకు వెళ్ళి మానవ హృదయాలను తూచే వృక్షాన్ని చూచాను. అచ్చట సత్యదేవత పాప రహితులను వుద్ఘోషించి చెప్పడం విన్నాను.

ఇవన్నీ నా స్వప్న లోకంలోని విభిన్న దృశ్యాలు. నేను నాజీవితాన్ని విగత జీవుల్లో గడిపాను. వారి సుఖ-దుఃఖాలలో, ఆశా - నిరాశల్లో పాలు పంచుకొన్నాను. వారి శిల్ప కుశలత, కళాచాతుర్యాన్ని తెలుసుకొన్నాను. నేను విజిగీషువైన, వారి ఆనందాన్ని మనసార గ్రోలాను. వారి దౌర్భాగ్య దినాల్లోని విపబిందువులను, మృత్యుసమయాల్లోని విపత్తులను జూచి కన్నీరు కార్చాను.

దైవదత్తమైన లోనేత్రాలతోనే వాళ్ళను దర్శిస్తాను. శ్రవణపేయంగా వున్న వారి సంగీతాన్నీ, స్తుతిగానాన్నీ యిప్పుడు వింటాను.

నైలునది చరిత్ర నాముందు మూర్తివంతమై కన్పిస్తోంది. ధనదాసు నాముందున్నాడని ఆయన నాభుజంపై చేయి వేయగానే అకస్మాత్తుగా స్ఫురణకు వచ్చింది. నేను వున్నామనివలె అరుస్తూ అన్నాను - నేను నీతో వస్తాను. నీవెంట నైలునది ప్రాచీన జన్మస్థలానికి రావడానికి సంసిద్ధంగా వున్నాను.

ఇది నా జీవితంలో ఆతురతతో కూడిన అనాలోచిత నిర్ణయం. నా యీ మూర్ఖత్వం, గ్రుడ్డి ఆవేశాల కారణంగా పశ్చాత్తాప పడవలసిన సమయం తర్వాత వచ్చింది.

# 4 'కమల్' కెప్టెన్ ధీరేంద్రనాథ్; గోబరైలా తస్కరణ

నేనూ - ధనదాసు ఆ రోజంతా యీ విషయం లోనే నిమగ్నమైనాం. ఇంతేకాకుండా ఒక పక్షంపాటు నే మిద్దరం విడివడకుండా ఎప్పుడూ కలసే గడిపాము. నేను శివనాథుని నోటుపుస్తకాలన్నీ బాగా చదివాను. వాటిని చదివిన కొద్దీ ప్రపంచంలో ఒక అద్వితీయ ఆవిష్కరణ చేయడానికి

వెళుతున్నానన్న భావం ధృఢపడుతోంది. మేము నైలునది పైభాగంలో వున్న దేశాలను గురించి, అచటి ఆటవిక జాతులను గురించిన భౌగోళిక గ్రంథాలెన్నో ప్రోగుజేశాము. యాత్రకు అవసరమైన ఆయుధాలతో పాటు యితర సామానులన్నీ సర్దుకున్నాం.

ధనదాసు తన కేసులను యితర న్యాయవాదులకు అప్పగించి తన పీడ వదలించుకొన్నాడు. నేనొక సంవత్సరం పాటు నా పనినుండి విముక్తి గలిగే ఏర్పాట్లు చేసుకొన్నాను. బహుశా మీరు తరచు వింటూండే ఆచార్య జోగీంద్రునికి నా భారమంతా వప్పగించాను. మా యాత్రకు సంబంధించిన వ్యక్తులం మేమిద్దరమే అయినా పని త్వరగా తేలిపోవుటకు మా మా పనులను మాలోనే పంచుకొన్నాం. యాత్రికు సంబంధించిన యితర విషయాలన్నీ చూసే బాధ్యత ధనదాసుది. అంటే అవసర సామగ్రిని ప్రోగుచేయడం, మార్గదర్శకులు, సేవకులు, బరువు మోసే జంతువులు మొదలైనవి. విజ్ఞానానికి సంబంధించిన ప్రతి బాధ్యత నాది. మందుల పెట్టె, దిక్సూచి మొదలగు యాత్రోపయోగకరములైన వస్తువులన్నింటినీ సర్దుకొన్నాను. ప్రాచీన మిశ్రదేశానికి సంబంధించిన ప్రతి విషయం, చిత్రలిపిని అనువాదం చేయడం - వీటికి గూడా నేనే బాధ్యుణ్ణి. మేమిద్దరం ఒకే యాత్రకు సంబంధించిన వాళ్ళమైనా భిన్నాభిప్రాయులమని గుర్తించుకోవాలి. ధనదాసు కేవలం ధనాగారాన్ని చేజిక్కించుకోవడం తప్ప వేరే అభిప్రాయం గలవాడు కాడు. అతడా విధంగా ఎందుకనుకుంటున్నాడో తెలియదు. బాగా సిరిసంపదలు గలవాడు

కూడా. కాని నాకుమాత్రం నా ఆరాధ్య దేవతయొక్క పుణ్యా క్షేత్రాన్ని వెళ్తున్నట్లుగానో లేక వైజ్ఞానిక అన్వేషణకు వెళ్తున్నట్లుగానో వుంది. నేను యీ విషయాన్ని సమర్ధంగా వెలువరించగల్గితే పురాతత్త్వ జగత్తులో యిది అద్వితీయ మౌతుంది.

నేను నలందాను విడచి వెళ్ళిన రోజును యేనాడూ విస్మరించలేను. మా నౌక 'కమల్' బయలుదేరడానికి ఇంకా 4 రోజులు గడువున్నదని మాకు తెలుసు. అది అప్పటికిగాని బొంబాయి రేవు వదలదు. కాని బొంబాయిలో మేము యింకా కొన్ని వస్తువులను సేకరించవలసిన అవసరం వుండ డంవల్ల రెండు-మూడు రోజులు ముందుగా జేరడం మంచి దనుకొన్నాము. నలందానుండి బిహారు, బఖ్తియారుపురం గుండా బాంకీపురం వచ్చాను. యిక్కడ ధనదాసుగూడా స్టేషన్‌లో కలిశాడు. మొదట్లోనే మా సామానంతా ఓడకు పంపడాన్ని గూడ్సుబండికి బుక్ చేశాము. మొగల్‌సరాయ్‌లో బొంబాయి మేల్ ఎక్కాలని మేము నిశ్చయించుకొన్నాము. మేము 2వ రోజున సరిగ్గా 4 గంటలకు విక్టోరియా టర్మి నస్‌లో దిగాము. అక్కడినుంచి టాక్సీపై తిన్నగా సర్దారు హోటలుకు చేరుకున్నాము. ఇలా రెండురోజులు ముందుగా రావడం మాకు ఎంతో మంచిదైంది. మేము మా పనులతో పాటు సింధీయ వడ్డీ వ్యాపారస్థుడైన చేలారామ్ మహాశయుని కలుసుకొన్నాము. ఈయనకు కాహిరాలో షాపు వుంది. ఈయన ద్వారానే మార్గదర్శకులను, కూలీలను ఏర్పాటు చేసుకొన్నాం. ఏర్పాట్లన్నీ చక్కగానే వున్నవనీ, నావ

ద్వారా మా యాత్ర చేయాల్సి వుంటుందని తన గుమస్తా తంతి యిచ్చినట్లు చేలారామ్ మాతో చెప్పాడు.

"కమల్'ను వదిలే రోజున ఒక గంట ముందుగానే 'బోరీబందర్' రేవుకు చేరుకున్నాం. మా ప్రయాణం సూయజ్ వరకు 'కమల్' మీద, అక్కడినుంచి 'కాహిరా' వరకు రైలుమీద జరగాలి. ఓడ దారిలో కేవలం అదన్ (ఏడెన్)లో మాత్రం ఆగుతుంది. అక్కడికి చేరగానే సామానంతా చూచుకోగా సరిగానే వుంది. ధనదాసు తన గదిలోకి వెళ్ళాడు. కాని నేను కొంచెంసేపు డెక్ మీద తిరుగుతూన్నాను.

నేనలా తిరుగుతూ ఓడ ముందువైపుకు వచ్చాను. నేనక్కడ నిలబడి హోరుబెడుతున్న నల్లని అరేబియా సముద్రాన్ని చూచాను. చాల దూరంలో నల్లని సముద్రపు నీటితో ఆకాశపు నీలవర్ణం కలసిపోయినట్లుంది. సముద్రపు నీరు నిశ్చలంగా వుంటే నిజంగా ఆ రెంటినీ వేరు వేరుగా గుర్తించడం కష్టమే ఔతుంది. నేను వెనక్కు తిరగ్గానే మొదటిసారిగా కెప్టెన్ ధీరేంద్రనాథ్ కన్పించాడు. ఆయన సామాన్యపు ఎత్తుగలిగిన బలిష్ఠమైన వ్యక్తి. నిండుదనం గలిగిన గుండ్రని ముఖం, గోధుమవర్ణం, నొకపోతువలె చిన్న గడ్డం వుంది. చలికాలమైనప్పటికీ వెస్ట్‌కోటుగూడా లేదు. కేవలం షై, నిక్కర్లతో వున్నాడు. తలమీద టోపీగూడా లేదు. ఆయన నోట్లో బీడీ వెలుగుతోంది. అలాగే నావద్దకు వచ్చాడు. ఆ బీడీ పొగవల్ల నా మనస్సు చెడిపోయినట్లయింది. సమీపానికి రాగానే "వందేమాతరం" అన్నాడు.

నేను :- 'వందేమాతరం'.

ధీరేం :- మిశ్రదేశానికా ?

నేను :- అవును. నేనూ, నా స్నేహితుడు సూయజ్‌కు వెళ్తున్నాం.

ధీరేం :- ప్రొఫెసర్ విద్యావ్రతులంటే మీరే నను కొంటాను ?

కెప్టెన్ మహాశయుడు నన్నెరిగున్నందుకు మనస్సు లోనే సంతోషించాను. నేను ఎంతోసేపు కెప్టెన్‌తో డెక్ మీద మాట్లాడుతూ గడిపాను. ఆ సమయంలో నే నతనిని ఒక సామాన్య వినయ - విధేయతలు గల వ్యక్తిగా భావించాను. ఆయన అన్నాడు—"మీరు 'కమల్' మీద మంచి ఆనందాన్ని పొందగల్గుతారు. అవసరమైనప్పుడల్లా మా సేవలను స్వీకరిస్తారని భావిస్తాను." తర్వాత ఆయన వ్యక్తిగతమైన తన బాధను బయటపెట్టాడు. అదేమిటంటే ఆఖరిసమయంలో సంతకాలు చేసిన యిద్దరు ప్రయాణికులు యేజాతికి చెందిన వారో తెలియదని. డెక్‌కు రెండవ వైపు అంచున కూర్చొని అటువైపుకే చూస్తున్న యిద్దరు వ్యక్తులను చూపించి "చూడండి, వాళ్ళే" నన్నాడు. వారిద్దరిలో నున్న వృద్ధుని దవడపై ఒక పొడవైన పాతగాయపు చిహ్నాన్ని చూశాను.

ధీరేం :- నేను జగత్తంతా పరిక్రమించి అనేక జాతులను దర్శించాను. కొరియన్లు, పటగోనియన్లు, అండమాన్ ద్వీపవాసులను, పెద్దపెద్ద రోమాలు గల యైన్లు - యీ జాతిని చాల తక్కువమంది చూచివుంటారు; కాని యిటువంటి వ్యక్తి

లను నే నెక్కడా చూడలేదు. వాళ్ళ యీ రంగు, పొడవైన వెంట్రుకలు లేకపోతే వీళ్ళను నేను అబిసీనియా వాళ్ళంటాను.

నేను :- వీరి దంతాలు అబిసీనియన్లకువలె తెల్లగా లేవా ?

ధీరేం :- శరీరంకూడా గాదు.

నా హృదయం కొంచెం కంపించినట్లయింది. నా కా సమయంలో శివనాధుని హత్య జ్ఞాపకం వచ్చింది.

నేను :- చిత్రలిపితో పాటు వున్న ఆకారాలను విశ్వసిస్తే వీరి రూపురేఖలు పురాతన మిశ్రీయులతో కలుస్తవి.

కెప్టెన్ ఒకసారి తన గడ్డాన్ని సవరించుకొని ఈ విషయాన్ని అలాగే వదలివేశాడు. తర్వాత అప్పుడే వచ్చిన ఒక నావికుని కలుసుకోవడాన్కి వెళ్ళాడు.

కొంచెంసేపట్లోనే మా ఓడ కదిలింది. నేను ఒకసారి తీరభూమివైపుకు తిరిగి 'వందేమాతరం' అని నా గదికి వెళ్ళిపోయాను. నా యాత్రలోని మొదటి మూడురోజులు మసుచరాని. గాలి తీవ్రంగా వీస్తోంది. తరంగాల మధ్య ఓడ అటు-యిటు వూగిసలాడసాగింది పశ్చిమ వాయువులు వీస్తున్నవి. అది పూర్తిగా మాకు ఎదురుగాలి. ఎన్నోసార్లు అలలు ఓడ ముందుభాగాన్ని ముంచేస్తున్నట్లుగా కనిపించింది. 'కమల్' సరుకుల ఓడ. దీనిమీద నే మిద్దరం మాత్రమే ప్రథమ శ్రేణికి చెందినవాళ్ళం. ఓడలో 4 గదులు మాత్రం యాత్రికులకు మినహాయించబడ్డవి. తోటి యాత్రికుల ప్రశ్న పరంపరలకు గురికాకుండా వుండడంకోసమే ధనదాసు యీ ఓడమీద ప్రయాణం జేయ సంకల్పించాడు.

ఆ 3 రోజుల్లో ఓడ యేనాడూ గంటకు 8 మైళ్ళకు మించి ప్రయాణం చేయ లేకపోయింది. మళ్ళీ గాలి కొంచెం మందగించింది. సముద్రం శాంతించినట్లుంది. ఎన్నో సముద్ర పక్షులు మమ్మల్ని వెంబడిస్తున్నవి. అప్పు డప్పుడు వాటిలో చాల పక్షులు తెరచాప కొయ్యలపై కూర్చుంటున్నవి. ప్రతి రోజు ఎన్నో మత్స్య సమూహాలు మా సమీపంలోనే కన్పిస్తూంటవి.

మొదటి 3 రోజులు ధనదాసు పరిస్థితి ఏమీ బాగా లేదు. ఆయన యెన్నో సార్లు వాంతించుకున్నాడు. తీవ్రంగా తల తిప్పింది. అతడు తరచు మంచాన్ని వదిలేవాడు కాదు. కాని మేము ఏడెన్ చేరగానే ధనదాసు పూర్తిగా కోలు కొన్నాడు. మేము 4 గంటలపాటు అదన్ (ఏడెన్)లో విహరించడానికి వెళ్ళాం. నాకీ విహారమెంతో హాయిగా వున్నప్పటికీ ధనదాసుకు మాత్రం ఏ వస్తువుమీద అభిమానం లేకుండా పోయింది. కాని నోరు నొక్కుకొని అతను ఓడనుండి నా వెంట వచ్చినట్లుంది.

ఓడ ఏడెన్ నుండి ప్రయాణం సాగించింది. మేమిద్దరం ధీరేంద్రుడూ ప్రతి సాయంకాలం డెక్ మీద కూర్చొని యెన్నో విషయాలను మాట్లాడుకొనేవాళ్ళం. అప్పుడు మా కాళ్ళకింద్ర యింజన్ గుప్పు - గుప్పు మన్నట్లుండేది.

శివనాథుని నోటుబుక్కులూ, కాగితాలూ (ప్రాచీన మిశ్ర దేశానికి సంబంధించినవి.) మ్యాపు, గోబరైలా మొదలైనవాటి నన్నిటినీ ఒక ఇనుప పెట్టెలో పెట్టి నా మంచం క్రింద వుంచుకొన్నాను. పెట్టె తాళంచెవి ఎప్పుడూ నా గడి

యారం గొలుసులోనే వుంచుకొంటూండేవాణ్ని. నిద్రించే టప్పుడు మాత్రం దాన్ని తలగడ క్రింద వుంచేవాణ్ణి. ఆ పెట్టె కున్న రెండు తాళంచెవులలో ఒకటి ధనదాసువద్ద వుంటూండేది. మేము యేనాడూ యీ యాత్రను గూర్చిన వుద్దేశ్యం ధీరేంద్రునితో చెప్పలేదు.

మేము సూయజ్ వెళ్లేనాటి రాత్రి పిడుగుపాటుగా ఒక సంఘటన జరిగింది. నేను వుదయం త్వరగా లేవడానికి రాత్రి పెందలకడనే నిద్రపోయాను. మేము వుదయం 6 గంటలకు రేవుకు చేరుకునేవాళ్ళం. అక్కడ 'కమల్'ను వదలి రైల్లో ప్రయాణం చేయాల్సివుంది.

నేను అకస్మాత్తుగా అర్థరాత్రి సమయంలో మేలుకొన్నాను. అలా ఎందుకు మేల్కొన్నానో తెలియదు. నేను నా పక్కపై కూర్చొని ఎంతో శ్రద్ధగా ఆలకించినా ఏ విధమైన సవ్వడీ వినిపించలేదు. భయపడే అవసరమేమీ లేదనుకొన్నాను. అదే సమయంలో తలగడ క్రింద చేయి పెట్టి చూశాను. అక్కడ గడియారం, తాళంచెవి లేకపోవడం చూచి ఒక్కసారిగా నా కాళ్లూ - చేతులూ చల్లబడ్డవి.

నేను వెంటనే లేచి దీపం వెలిగించాను. ఆ రోజుల్లో 'కమల్' తరగతికి జెందిన ఓడల్లో కరెంటు వుండేవి గాదు. శక్తినంతా వుపయోగించి నేను ట్రంకును మంచం క్రింది నుండి బయటకు లాగి చూస్తే కేవలం తాళంలో చెవివున్నది. తెరచి చూడగా గోబర్సైలా మాయమైంది.

# 5

# ధీరేంద్ర - చాంగు మహాశయులతో సన్నిహిత సంబంధం

నేనప్పుడే ధనదాసు గదిలో ప్రవేశించాను. ఆయన గాఢ నిద్రలో వున్నాడు. లైటు వెలుగుతున్నది. నిద్రావస్థలో వున్న అతని వైపుకు ధ్యాన పూర్వకంగా చూశాను. నేను నిద్రావస్థలో వున్న ఆ పురుషుని అసాధారణ శరీర పాటవాన్ని జూచి దిగ్భ్రాంతుడనయ్యాను. బలిష్టమైన దీర్ఘకాయం గలిగి వున్నప్పటికీ నిద్రిస్తున్నందువలన శవతుల్యంగా గోచరిస్తున్నాడు. ఆయన రంగు ఆశ్చర్యకరమైనదిగానూ, అతిలోక సౌందర్యంతోనూ ప్రకాశిస్తోంది. దీర్ఘములైన బాహువులు వుదరంపై వుంచుకొని నిద్రిస్తున్నాడు.

అయినప్పటికీ నే నాయనను మేల్కొలిపాను. ఈ విషయానంతా వివరించగానే ఒక భయంకర జంతువువలె గర్జిస్తూన్న మేఘంలాగా మారిపోయాడు. ఆ గర్జన ఓడలో ఒక వైపునుండి రెండవ వైపుకు ప్రతిధ్వనించి వుంటుంది. నేనెంతగానో ఆయన్ని శాంత పరచడానికి ప్రయత్నించాను; ప్రశాంత హృదయంతో ఆలోచించమని చెప్పాను. కాని ఆయ నేమాత్రం వినలేదు. గుడ్డలు మార్చుకొని డెక్‌పైకి వచ్చేవరకు అలాగే వున్నాడు.

రాత్రి రెండుగంటల సమయం. శరీరంమీద పూర్తిగా గుడ్డ లేనందున ఎదురుగా వీస్తున్న శీతల వాయువులు నా శరీరంలో బాణాల్లా గ్రుచ్చుకొంటున్నవి. ఆకాశంలో వేలాదిగా వున్న తారకగణాలు అందంగా మెరిసిపోతున్నవి.

రెండుగంటలపాటు డెక్ మీద పచార్లుచేస్తూ యీ విషయాన్ని గూర్చి చర్చించాను. దొంగ యిప్పటికీ ఓడపైనే వున్నాడని మేము నిశ్చయించుకొన్నాం. రూపురేఖల్లో ప్రాచీన మిశ్రీయులను బోలిన ఆ యిద్దరు వ్యక్తులను గూర్చిన నా సందేహాన్నిగూడా ఆయనతో చెప్పివేశాను. ప్రయాణీకులందర్నీ సోదా చేయాలని మేము నిశ్చయించుకొన్నాం. కాని ఓడ కెప్టెన్‌తో ఈ రహస్య వృత్తాంతం పూర్తిగా చెప్పనంతవరకు అలా చేయడం అసంభవం. నేనావిధంగా చేయడానికి సంసిద్ధుణ్ణి. ఎందుకంటే ధీరేంద్రుడిప్పటికే నాకు పూర్తిగా విశ్వాసపాత్రుడైనాడు. కాని ధనదాసుమాత్రం తన రహస్యాన్ని యితరుల ఎదుట పొక్కనివ్వ గోరడంలేదు. అయినా చేసేదేముంది? ఇది నిస్సహాయస్థితి. అలా చేయకపోతే చేసిందంతా బూడిదలో పోసిన పన్నీరౌతుంది.

4 గంటలకు చివరి కాపలా డ్యూటీ నిర్వహించడాన్కి పైకి వచ్చిన కెప్టెన్ మమ్మల్నను జూచి ఆశ్చర్యపోయ్యాడు. మేము కోరిన అవకాశాన్నిగూడా యిచ్చాడు. ఓడలో దొంగతనం జరిగిందని చెప్పాం. ధీరేంద్రుడు ఓడమార్గం చూడడానికి పైకి వెళ్ళి అక్కడినుండి కేబిన్‌కు వెళ్ళాడు. ఇంత రాత్రిలోగూడ ఆయన అదే బీడీని జేబునుండి తీస్తూండడం చూచి నాకు చిరాకు వేసింది.

మేము హెచ్చుతగ్గులు లేకుండా ఆద్యోపాంతం మా కథను వినిపించాం. ధీరేంద్రుడు చాల శ్రద్ధగా వింటున్నాడు. మధ్యమధ్య బీడీ దమ్ముతో పాటు ఆలోచనాపూర్వకంగా కను బొమలను చిట్లిస్తూ తన మేకపోతు గడ్డాన్ని సవరించుకొంటున్నాడు.

కథంతా విన్న తర్వాత ఆయన అన్నాడు - నా జీవితంలో ఎన్నో అద్భుత వస్తువులను చూశాను. కాని యీ కథ నిజమైతేమాత్రం వాటన్నిటినీ తలదన్నిందాతుంది. ఇది అసంభవమని నేను చెప్పను. నేను జూచిన ఎన్నో విచిత్ర ఘటనలను విన్నవాళ్లు అసంభవంగానే యెంచుతూంటారు. మీకు అన్నివిధాలా సాయం చేయడానికి నేను సిద్ధంగానే వున్నాను. నాల్గవ గంట కొట్టిన తర్వాత ప్రయాణీకుల నందర్నీ ఒకచోట సమావేశపరుస్తాను. ప్రతి వ్యక్తిని పూర్తిగా సోదా చేయిస్తాను.

మేము యిప్పుడు సూయజ్‌కు తూర్పుతీరాన వున్నాం. దూరంగా సూయజ్ నగర భవనాలు కన్పిస్తున్నాయి. ఇదే సమయంలో ధీరేంద్రుడు యాత్రికులందర్నీ డెక్‌పై నిలబెట్టించాడు ప్రతి వ్యక్తిని పూర్తిగా సోదా చేయించాడు. ప్రతివాని పెట్టె, సంచి, ప్రక్క - గుడ్డలతో సహా చిందర-వందర చేయబడ్డాయి. ఓడలోని కళాసులను, సేవకులను, వంటవాళ్లను క్రాసు చేశారు. ఇక్కడ ధనదాసు ప్లీడరీ బాగా పనిచేసింది. కాని గోబర్‌లైలాను గురించి యే అచూకీ దొరకలేదు. ఆ యిద్దరు మిశ్రీయులను క్రాస్ చేసినప్పుడు నైలునది పైప్రాంతపు నివాసులమని ఒప్పుకొన్నారు. వారి హిందీ జ్ఞానం

స్వల్పమైనందువల్ల యింతకంటే అధికంగా చెప్పలేక పోయాను.

మేము ఇప్పుడు సూయజ్ ఓడరేవుకు చేరుకొన్నాం. ఓడ లంగరు వేయబడింది. ఇంకా మా ఓడ ఆగనేలేదు; ఆ యిద్దరు మిశ్రీయులూ మాయమయ్యారని తెలిసింది. వాళ్లు ఓడ వీడిపోవడం ఏ ఒక్కడూ చూడలేదు. మేము ఒడ్డుకు దూరంగా లేము; అందువల్ల యీదుకు వెళ్తే వాళ్ళు అవశ్యం కనబడతారు. మా చుట్టు ప్రక్కల తిరుగుతోన్న నావలలో ఎక్కి పోవడం సంభవించి వుండవచ్చు.

కెప్టెన్ ధీరేంద్రుని సందేహం యిప్పుడు చాల వరకు తీరిపోయింది. ఇప్పటి వరకూ ఆయన మా యీ 'మితనీ హాప్'ని సందేహ దృష్టితో చూస్తున్నాడు. ఈ విషయంలో యిప్పుడాయన గూడా మావలెనే అభిరుచి గలవాడయ్యాడు. మా కర్తవ్య మేమిటో ఆయన సలహా యిచ్చాడు. ఇంతే గాకుండా, 'మా సాధ్యమైన సహాయం చెయ్యడానికి సిద్ధంగా వున్నామ'ని చెప్పాడు. మాకు మళ్లీ గోబర్రైలా లభిస్తుందని ఆయనెప్పుడూ చెప్పలేదు. నేను గూడా మీవెంట సెరాఫిస్ సమాధికి విధిగా వస్తానని ఎన్నోసార్లు అన్నాడు.

8 గంటలకు ఆయనగూడా మాతో ఒడ్డుకు వచ్చాడు; మేమంతా కలిసి ఆయన కంపెనీ ఏజంటు కార్యాలయానికి వెళ్లాం. ఏజంటు ఒక పెద్ద స్థూలకాయుడు. అతని ఆకారం ఇటలీవాళ్ళను బోలివుంది. నాతోనూ, ధనదాసుతోనూ అతను మనస్ఫూర్తిగా చేయి కలిపాడు. మీ కంపెనీ ఓడ అయిన 'శ్రావస్థి' కెప్టెను వ్రజరాజ్ ఇక్కడే వున్నాడని

అతను ధీరేంద్రునితో చెప్పాడు. వ్రజరాజ్ కెప్టెను భయం కరమైన మలేరియాకు గురిఅయి ఇక్కడే వుండిపోయాడు. మాసాలతరబడి చికిత్సపొంది ఇప్పుడతడు కోలుకొన్నాడు. అతడు తన డ్యూటీలో మళ్లీ చేరడానికి సిద్ధంగా వున్నప్పటికీ అతన్ని గూర్చిన యేవిధమైన ఆదేశం కంపెనీనుంచి నాకింత వరకూ రాలేదు. యీ విషయాలన్నీ విన్న ధీరేంద్రుడు మౌనంగా తల పంకించి వూరుకొన్నాడు. ఆ తర్వాత ఆఫీసు నుంచి బయటకు రాగానే ధీరేంద్రుడు మమ్మల్ని తీసికొని ఒక చౌకబారు హోటలువైపుకు వెళ్ళాడు.

కెప్టెను:- ఇది పూర్తిగా నిర్జనస్థలం. మన మీ తంలో యథేచ్ఛగాచర్చించవలసియున్నవిషయం మరొ తెలియగూడదు అని కాఫీలకు ఆర్డరిచ్చి, బల్లమీద వు చేయి ఆసరాతో, గొంతు తగ్గించి మాట్లాడసాగా "ప్రొఫెసర్ నేను హృదయపూర్వకంగా యీ విషయం మీకు పూర్తిగా తోడ్పడడానికి సంసిద్ధంగా వున్నాను. సముద్ర కెరటాలతోనే నా సంబంధం అధికంగా వున్నప్పటికీ క్షేత్రయాత్రలు తక్కువగా చెయ్యలేదు. నేను టిబెట్, మంగోలియా, ఆఫ్రికాలలోని చాలా భాగాలలో పర్య టించాను. సముద్ర యాత్రలలో కలిగే సంతోషానికి, యే మాత్రం తీసిపోని ఆనందమే క్షేత్ర యాత్రలలోనూ కలుగు తుంది. విశేషించి నన్ను యాత్రలలో కలిగే విపత్తులే అధికంగా ఆకర్షిస్తవి. నే నేమాత్రం నిరాశావాదిని కాను. అయినప్పటికీ ఇప్పటి మీస్థితి ఘోరంగానే వున్నదని చెప్పక

తప్పదు. మీ చేతుల్లో పురాతత్వ శాస్త్రానికి సంబంధించిన ఒక దుర్లభవస్తువుంది; లేక ఒక క్షణం క్రితంవరకూ వుంది; శివనాథ్ మహాశయుడు దానికోసమయ్యే తన ప్రాణాలు కోల్పోవలసి వచ్చిందని మీకు బాగా తెలుసు. ఏదో విధంగా యీ రహస్యం పొక్కినట్లుగా తెలుస్తూనే వున్నది. ఆఖరుకు నా వోడమీదకూడా మీకు వెంబడింపబడ్డారు. గోబ్రైలా తస్కరింప బడడంగూడా జరిగిపోయింది; మీ కళ్ళముందు వేలకొలది మైళ్ళ ప్రయాణమున్నది. యీ ప్రయాణంలో అంగుళములోనూ మిమ్మ్మ వాళ్లు వెంటాడుతూనే ను. మార్గ మధ్యంలో మీ ప్రాణాలు తీసే ప్రయత్నం నడం అసంభవమేమీ గాదనుకొంటాను.

ఇప్పుడు యీ విషయాలన్నీ నా కళ్ళముందుకు రాసా రాత్రి 12 గంటలనుండి ఆలోచించుకోవడానికి నాకు లేక చిక్కకపోయినా, నా యీ మూర్ఖత్వ ప్రమాణాన్ని గురించి పశ్చాత్తాప పడ్డాను. నేను నా అదృష్టాన్ని నిందించుకొన్నాను. నలందా విద్యాలయంలోనూ, సంగ్రహాలయంలోనూ ఆచార్య పదవినీ, క్యూరేటర్ పదవినీ వెలిగించే నేను యిక్కడ ఒక చౌకబారు హోటలువరకు గెంటివేయబడటం నా దురదృష్టం. ఇకముందు యేమేమి జరుగుతవో, అది వేరే విషయం. నేను ధనదాసును ఏమాత్రం నమ్మలేను. ఆయనను పట్టుకొని పీడిస్తున్న ఆ ధనాశా పిశాచం తనకోసం ప్రాణాలను సయితం బలితీయగలదు. అటువంటి ధనకాంక్షా పరుడు ఎంతటి సంకట పరిస్థితుల్లోనైనా బుద్ధి నుపయోగించి

ఆలోచించ గల్గుతాడనుకోవడం వాళ్ళ భ్రమ. ఆ తరుణంలో ధీరేంద్రుని సలహాలను స్వీకరించడానికి పూర్తిగా సిద్ధపడ్డాను.

ధీరేం :- ఈవిషయంలో నాకెంతో ఆసక్తివుంది. నేను గూడా ఆ దేశాన్ని చూడాలనుకొంటున్నాను. మీరు అనుమతిస్తే మీవెంట రావడానికి సిద్ధంగా వున్నాను. మీకేదైనా మేలు చేయగల్గుతానని నా హృదయం చెప్తోంది.

ధనదాసు అభిప్రాయం ధీరేంద్రుని అభ్యర్థనకు వ్యతిరేకంగా వున్నదని తెలుసుకోగానే నేనెంతో ఆశ్చర్యపడ్డాను. అయ్యో, ఎంత స్వార్థాంధత! ఔరా, ఎంత మూర్ఖత్వం!! కెప్టెన్ విపత్తులను అతిశయంగా చెప్తున్నాడని ధనదాసు అన్నాడు; మూడోవ్యక్తి ఎవరూ తమవెంట రారాదన్న భావమే ఆయనచే ఆ విధంగా చెప్పించింది.

ఐనప్పటికీ నేనప్పుడు మనస్సులో నిశ్చయించుకొన్న విషయమై నిశ్చలంగానే వున్నాను. నేను కెప్టెన్‌ను నావెంట రమ్మని వత్తిడి చేశాను; ఆయనకగు ఖర్చు నంతటినీ నేనే యిస్తాననిగూడా చెప్పాను. ధీరేంద్రుడు రానట్లయితే నేను భారత దేశానికి తిరిగి వెళ్తానని చెప్పుటకు గూడా తయారయ్యాను.

అనేక వాద - వివాదాలు జరిగిన తర్వాత ధనదాసు మాటను ఒప్పుకోవలసి వచ్చింది. ఆ కాఫీహోటల్లోనే ...ని మార్గ మధ్యంలో వచ్చే సంకటాల నన్నిటినీ తోడు ...రుదుర్కోడానికి ప్రతిన తీసుకొన్నాం. ఇక ధనదాసు ...ను తన ప్రతినను నిర్వహించుకొంటాడో చూడాలి.

ధీరేంద్రమును పజాంటువద్దకు వెళ్ళి తనకు కొన్ని అవసరమైన పనులున్నందువల్ల కొంత కాలంపాటు విశ్రాంతి తీసుకొంటున్నానని కంపెనీ ప్రధాన కార్యాలయానికి తంతి యిచ్చాడు. ఆ తంతిలో "ఇచ్చటే వున్న వ్రజరాజ్‌కు కంపెనీ అనుమతిస్తే వెంటనే కెప్టెన్‌గా అధికారాన్ని అప్పగిస్తాను" అని వుంది. తర్వాత మేము పోలీసు స్టేషన్‌కు చేరుకొన్నాం. అక్కడ మేమొక మిశ్రదేశపు పోలీసు సూపరింటెండెంటును కలుసుకొని గోబర్నైలా బహుమూల్య పదార్థమని ఆయనకు తెలియ జెప్పడానికెంతో ప్రయత్నించాము.

ఆ రాత్రి సూయజ్ నగరం హైరోడ్డులో వున్న హోటల్లో బస చేశాము. ఈ పరిస్థితిలో మాకు కాహిరా వెళ్ళడం యేమంత యిష్టంలేదు. గోబర్నైలాను యేదో విధంగా తిరిగి సంపాదించాలని మా యత్నం. కాని మా ముగ్గురిలో ఏ ఒక్కరూ దీనికి తగిన వుపాయం చెప్పలేక పోయాము.

భోజనశాలలో ధీరేంద్రుని చేతిలో ఒక ఇంగ్లీషు పత్రిక వుండడం చూచాను. అందులో ఒక యింగ్లీషు బాలుడు దొంగిలింపబడుట, తిరిగి పరిశోధింపబడి కనుగొనబడ్డ వివరణ వుంది. ఆ బాలుణ్ణి ఎవరో ఒక చైనీయుడు దొంగిలించాడు. అతని తల్లి - దండ్రులు అన్నివిధాలా ప్రయత్నించి విఫలైనప్పుడు చైనాదేశపు ప్రసిద్ధ అపరాధ పరిశోధ చాంగ్ మహాశయుని సంగతి వారికి తెలిసింది. వారు యీ పనిని అప్పగించగా, యెన్నో కష్టాలను ఎదుర్కొ

ధారణమైన తన బుద్ధినుపయోగించి ఆ బాలుని తల్లి-దండ్రులకప్పగించాడు.

ధీరేంద్రు డన్నాడు - ఈయనే మనకు పూర్తిగా వుపకరించే వ్యక్తి, ఆయన ఫీజు ఎంతో అధికమైనప్పటికీ యిప్పుడాయన యిక్కడ వుండి, యీ పనిని వప్పగించగల్గితే తప్పక సఫలురమౌతాం. నేను ఆ వ్యక్తి నెప్పుడూ చూడలేదు గాని అతన్ని గూర్చి యెంతో చదివాను. అత డీనాటివరకు ఒక్క కేసులో గూడా విఫలుడు కాలేదని విన్నాను.

అదృష్టవశాత్తు కలసివచ్చే సంఘటనల అర్థాలు విచిత్రంగా వుంటాయి. నేనా సాయంకాలం ధనదాసు రాకకై నిరీక్షిస్తూ అలాగే కూర్చొని, అక్కడవున్న విజిటర్స్ బుక్ చూస్తున్నాను. దానిలోని ముగ్గురు వ్యక్తుల విచిత్ర సంతకాల వైపుకు నా దృష్టి ఆకర్షించబడింది.

రాజా మోహనలాల్ — లావుగా, వంకరగా వున్న అక్షరాల్లో.

బేగం హబీబ్ — స్పష్టంగా వున్నప్పటికీ ఎడమ వైపుకు వంగివున్న అక్షరాల్లో

తాచాంగ్ — కొంగ కాళ్ళవలె విచిత్ర దీర్ఘ అక్షరాల్లో.

ఎంతటి విచిత్ర సంయోగం! ఒకవైపు గోబ్రైలా అద్భుతకీర్తిగా తస్కరింపబడుట, మేము కర్తవ్య మూఢులమై వుండుట, రెండవవైపు ధీరేంద్రుడు వార్తా పత్రికలో చాంగ్ మహాశయుణ్ణి గూర్చి చదవడం, అటుపైన చాంగ్ మహా

శయుడు అదేరోజున, అదే స్థితిలో హాజరుగా వుంటటం; ధీరేంద్రుడు చదువుచున్న వార్తా పత్రిక చాల పాతప్రతి. చాంగ్ మహాశయుడు సుప్రసిద్ధ వ్యక్తి. ఆ నాడే అక్కడకు వచ్చిన చాంగ్ తనకు గది ఒకటి కావలయునని ఒక చీటీ బంట్రోతు ద్వారా హోటల్ యజమానికి పంపాడు. అది చూచిన యజమాని పొరపాటున దానిని విశ్రాంతి గదిలో వదలిపెట్టి వెళ్ళాడు. అక్కడనే ఆయన పేరు చూచాను. ఇటువంటి ఆకస్మిక సంఘటనలను మానసిక బలహీనులు దైవిక మని అనడానికి గూడా వెనకాడరు. ఇదే విధంగా గోబ్రైలాను గూర్చి గూడ జరిగిందనుకోవచ్చు.

చాంగ్ మహాశయుడు ఈ హోటల్లోనే మకాం చేశాడని నేను వెంటనే వెళ్లి ధీరేంద్రునితో చెప్పాను. ధనదాసు గోబ్రైలాను పొందుటకు మా యిద్దరికంటే ఎక్కువ వుత్సాహంగా వున్నాడు. అప్పుడే, అక్కడే చాంగ్ మహాశయుని సహాయం పొందాలని నిశ్చయించుకొన్నాము.

సరిగ్గా మా భోజనం పూర్తి అయ్యేప్పటికి పేరెన్నికగన్న అపరాధ పరిశోధకుడు చాంగ్ స్వయంగా ఆ గలోకే వచ్చేశాడు. మా ముగ్గురిలో యెవ్వరునూ ఆయన్ను యింతకు పూర్వం చూచి వుండనప్పటికీ గుర్తించడంలో యేమాత్రం కష్టంగా లేదు. ఇంగ్లీషు వారివలె దుస్తులు వేసుకున్నప్పటికీ చైనీయ ముఖం, పొడవైన పిలక మరువరానివి. ఆయన యూరప్‌లో తన పని చూచుకొని యిప్పుడు చైనాకు తిరిగి వెళ్తున్నాడు. నేను విన్నంత లావుగా ఆయన కన్పించలేదు.

గుండ్రముగా యున్న చట్టిముక్కుపై బంగారు వర్ణముగల లావైన కళ్ళజోడు వుంది. వెనకవైపుగా రెండు చేతులను కట్టుకొని గదిలో పచారు చేస్తున్నాడు. వ్రేలి కొక వజ్రాంగు ళీయముంది. ధనదాసు అన్నట్లు ధీరేంద్రుడు అపరాధ పరి శోధకుని సమీపించాడు. ఆయన అప్పుడు శాల్యూట్ చేసిన పద్ధతి, యితర సమయాల్లో చూస్తే నవ్వకుండా వుండలేం.

కెప్టెన్:- మీ పేరే చాంగ్ మహాశయులని అనుకొంటాను.

చాంగ్ :- అవును మహాశయా, నా మహద్భాగ్యమేమో...

కెప్టెన్:- నన్ను 'కెప్టెన్ ధీరేంద్రనాథ్' అంటారు.

చాంగ్:- బుద్ధభగవానుని దేశవాసులా? నా మహాభాగ్యం.

ఇది విలక్షణ సంపన్నులైన యిరువురి పురుషుల కలయిక.

## 6 చాంగు మహాశయునికి నివేదించుట.

చాంగ్ మహాశయునితో అవసరమైనంతవరకే చెప్పాలని ధనదాసు అభిప్రాయం; అంటే గోబర్రైలా ఓడపై నాగది నుండి దొంగిలింపబడిందని, బహుశా యిద్దరు మిశ్రీయులు దానిని కాజేసి వుంటారని, తర్వాత కొద్దిసేపట్లోనే వాళ్ళు

ఓడనుండి పారిపోయారని. అపరాధ పరిశోధకుని వద్ద యేమాత్రం దాచలేమని మీకు తెలుసు. ఆయన అడిగిన తర్కబద్ధమైనవట్టిన్నీ, సూక్ష్మాతి సూక్ష్మమైన ప్రశ్నలన్నిటికీ సమాధాన మివ్వడంకంటె ఆద్యోపాంతం కథను చెప్పివేయు డమే మంచిదనిపించింది.

శివనాథుని హత్య మొదలు సూయజ్ వచ్చినంతవరకు జరిగిన కథనంతా పొల్లుబోకుండా చెప్పాం. ఈ నాటికీ నా యాత్రనుగురించిన స్మృతులు వచ్చినప్పుడల్లా చాంగ్ మహా శయునితో వున్నదున్నట్లుగా జెప్పి చాల మంచిపని చేశామని పిస్తోంది. మేము అలాచెప్పి వుండకపోతే మాలో యేఒక్కడూ ప్రాణాలతో తిరిగి రాగలిగేవాడు కాడు. నేనొక పెద్ద తప దలో పడిపోయినట్లు ప్రథమంలోనే చెప్పాను. చాంగ్ మహా శయుని ముఖలక్షణాలు గూడా దీన్నే వ్యక్తపరుస్తున్నవి. ఆయన యీ భయంకరస్థితి గ్రహించి యెంతో గంభీరు డైనాడు. ఆయన భోజనం చేస్తూనే నేం చెప్పిందంతా వింటు న్నాడు. చేయి కడుక్కొంటూనే "యిక్కడ ఒక్క క్షణం గూడా వ్యర్థం చేయగూడదు; మీరు హోటల్లో నాకై నిరీక్షి స్తూండమని" చెప్పి జాడ తీయడాన్కి వెళ్ళిపోయాడు.

ఆయన తన పిలకను కప్పిపుచ్చగల ఒక విచిత్రమైన టోపీ ధరించి మరీ వెళ్లిపోయాడు. గంటన్నర తర్వాత తిరిగి వచ్చి మమ్మల్నందర్నీ ఒక గదిమూలకు తీసుకవెళ్ళాడు. అక్కడ ఒక చిన్న మేజాబల్లచుట్టు ఒకరితల ఒకరికి ఆనుకొనే టంత దగ్గరగా కూర్చొన్నాము.

చాంగ్ :- నాకిప్పుడే చిన్న ఆధారమైనా దొరికిందని మీరు ఆశించగూడదు. ఇది యింత త్వరలో అయ్యేపని కాదు. నేనిప్పుడే ఓడరేవుకెళ్ళి కొంత సమాచారం సేకరించాను. ఏడు వారాలుగా ఒక అరబ్ నావ తరచు యీ ఓడరేవుకు వస్తున్నదని నేను తెలుసుకున్నాను. నైలునది ముఖద్వారాన వున్న రోసెట్టానుండి అది వస్తున్నట్లు విన్నాను. ఇంతదూరంనుండి నావ రావడమే అనుమానాస్పదం. నావలో వస్తున్న వ్యక్తులు అరేబియన్లు కాదన్నది సందేహానికి మరో కారణం. ఆ నావికుల రూపురేఖలవల్ల వారా పారిపోయిన యిద్దరు మిశ్రీయుల స్వజాతీయులని తోస్తుంది.

'మీరు చెప్పినట్లుగా మితనీనగరం యిప్పటికీ వున్నదనే అనుకొందాం. అచ్చటి ప్రజలు సిరి, సంపదలతో తులదూగుతున్నందువల్ల గోబర్రైలాను తిరిగి పొందడానికి వారు యెంత ధనమైనా సరే వెచ్చించడానికి వెనుకాడరు. ఈ నావ ఆ పారిపోయినవాళ్లకే సంబంధించినదై వుండవచ్చు మీరు ఆలోచిస్తే మీకుగూడా యిదే సబబుగా కన్పిస్తుంది. వాళ్లేదో విధంగా ఓడనుండి బయటబడి ఒడ్డుకు చేరుకున్నారు. అన్నిటికంటే వాళ్ళ అపూర్వ నైపుణ్యం నా కాశ్చర్యం కల్గిస్తోంది. ఎంత చాకచక్యంగానూ, నైపుణ్యంగానూ ఆ యేర్పాట్లు చేయబడ్డాయ్! నన్ను నానా బాధలు బెట్టిన చైనాదేశపు దొంగల ముఠా ఒకటి జ్ఞాపకమొస్తున్నది.

ధన:- అయితే, నావ యింకా ఓడరేవులోనే వుందా?

చాంగ్:- అది కేవలం దూరంగా తిరుగుతోంది; యిక్కడనే మనకు పెద్ద ఆపద. పారిపోయినవాళ్లు ఆ నావ మీదనే సూయజ్‌ను దాటబోతున్నారు; ఎందుకంటే రైలు మార్గాన పట్టుబడతామన్న భయం వుంది.

అప్పుడు నా భయం తీరిపోయింది. నా అభిలాష యింకా పెరిగిపోయింది. నీ కంట్ర చాంగ్ లాంటి పురుషులముందు నేను పిరికిపందనవడం బాగుండదనుకొన్నాను. నేనడిగాను – "మీ రిప్పు డేమి జేయ సంకల్పిస్తున్నారు?

చాంగ్:- నేను చేసేదేదో అకస్మాత్తుగా చేయదలచుకొన్నాను. సూయజ్ నగరం, కాల్వలను పూర్తిగా వెదకడం అసంభవం. ఆ యిద్దరు మిత్రులు యిప్పుడు కూడా సూయజ్ నగరంలోనే వున్నారని నా అభిప్రాయం. నగరాన్ని విడిచిపోయేంతవరకే వాళ్లను పట్టుకొనే అవకాశముందని భావించాలి. నా మనస్సులో మెదిలిన భావాన్ని పరీక్షించడానికి వెళ్తున్నాను.

ధన:- సూయజ్ చిన్నదేమీ గాదు.

చాంగ్:- ఇక్కడవున్న ఒక చిన్న పేటను వెదకడానికి వెళుతున్నాను. నగరమంతటికీ 3-4 ముఖ్యమైన రోడ్లు మాత్రమే వున్నవి. మిగిలినవన్నీ అంధకారమయంగానూ, యిరుకుగానూ, మురికితోనూ నిండివున్నవి. చిన్న సందుల్లోనూ, వీధుల్లోనూ సాధారణ ప్రజలుంటారు. ఇక్కడి ప్రజలధికభాగం అరేబియనులు; కాని పెద్ద పెద్ద బజార్లలోవున్న దుకాణాల్లో అనేకభాగం విదేశ వ్యాపారులవే. పారిపోయిన యే వ్యక్తీ యీ రోడ్లమీద దాగివుండడానికి ప్రయత్నించదు;

ఎందుకంటే అక్కడ పగలు - ఎన్నోరకాలైన ఆకారాల మధ్య - గుర్తించబడే అవకాశముంది. గ్రామాలు చాల దూరాన, అవికూడా చాల కొద్దిగానే వున్నవి. అక్కడ కూడా వాళ్లు దాగటానికి ప్రయత్నించరు. ఎందుకంటే, గ్రామాల్లో నూతన వ్యక్తుల్ని దాచివుంచగల శక్తిలేదు.

'నేను:- అయితే వాళ్లెక్కడ దాగివుంటారు?

చాంగ్:- సూయజ్ ఓడ రేవుకు యీవలివైపున ఆఫ్రికాలోనేగాక భూమండలంలో కల్లా అద్వితీయమైన ఒక చిన్న పేటవుంది. ఇంతపల్లంలో నిర్మించబడ్డ పేట ప్రపంచంలో మరెక్కడా లేదు. ఇక్కడవున్న మానవులందరూ కటిక దరిద్రులు, హీనులు, హంతకులు, మోసగాండ్రు. ఇది సముద్ర మట్టాని కెంతో పల్లంగావుంది.'

'అన్నివిధాలా, ఈ స్థళం పాతాళాన్ని బోలివుంటుంది. నాలుగు సోపానాలు దిగిచూస్తే రాత్రింబవల్లు తపనపుట్టించే వేడిని చూడగల్గుతాం. వేసవికాలంలో యిక చెప్పేపనేలేదు. రోళ్లు, యిళ్లు అన్నీ భూగర్భగృహాల్లాగా త్రవ్వి నిర్మించ బడ్డాయి. ఆ స్థళంలో అన్ని జాతుల మనుష్యులు కన్పిస్తారు. ఆసియా, ఆఫ్రికా, యూరపుల్లోవున్న ముసుగంతా అక్కడ గడ్డకట్టినట్లుగా కన్పిస్తుంది. సైనికుడుగానీ, నావికుడుగానీ, పెద్దమనిషిగానీ అక్కడకు పోవడానికి సాహసించరు. అపరాధాలు చేయడాన్కి మాత్రమే వాళ్లు బయటకు వస్తారు. మీ దొంగలు అక్కడే దాగివున్నారని నిశ్చయంగా అనుకోండి. అక్కడనే వాళ్ళను పట్టుకోడానికి బయలుదేరుతున్నాను.

నేను:- ఎప్పుడు?

చాంగ్ మహాశయుడు తన గడియారంచూసి ఒక్క అరగంటలో అన్నాడు.

ఆ తర్వాత ఆయన అక్కడినుండి తనగదిలోకి వెళ్లిపోయాడు. ఇది నిద్రించే వేళ అయినప్పటికీ మాలో యెవ్వరూ శయ్యా జేర సిద్ధంగాలేరు. మే మక్కడనుండి లేచి హోటలు పైభాగానికి వెళ్లాం. అక్కడ కుర్చీలూ, పూలకుండీలు వున్నవి. ఇక్కడ కూర్చొని మేము చర్చించడం ప్రారంభించాం. మాకెదురుగా హార్బరులోని లైట్లు మెరుస్తున్నాయి. ఆకాశంలో మెరుస్తున్న నక్షత్రాల్లా ఉన్నవి. ఇదియెంతో అందమైన రాత్రి. నల్లని నీలాకాశంలో చంద్రుడు పూర్ణకళలతో విరాజిల్లుతున్నాడు. గల్లీలగుండా సంగీత స్వరాలు కర్ణపేయంగా విన వస్తున్నాయి.

నేనొక కాలంజెల్లిన వాడిని. అయినా ప్రపంచాన్ని ప్రేమిస్తూనే వున్నాను. దీన్ని చూచినకొద్దీ ఎంతో అద్భుతంగానూ, అందంగానూ, మనోహరంగానూ వున్నట్లుంటుంది. ఇటువంటి సౌందర్యంతో వెలిగిపోయే రాత్రిళ్లను చూస్తున్నప్పుడు రాత్రిళ్లకు రాత్రిళ్లు నూనెదీపాలముందు, శిథిలమైపోయి, దుర్గంధపూరితాలైన పుస్తకాలను త్రిప్పివేయడంలోనే యిన్ని సంవత్సరాలు నాశనం జేశానని అనిపిస్తోంది. ప్రపంచంలో ఎండతో మండిపోయే విశాలమైన ఎడారులున్నాయి. ఇక్కడే పర్వతచరణాల్లో మనోహరమైన పచ్చికబయళ్లున్నవి. ఇలాంటి స్థలాలే మానవుడు నివసించడానికి నిర్మించబడ్డాయి.

ఈవిషయం మీదనే సూయజ్ హోటలు పై భాగంలో ధనదాసు - ధీరేంద్రులతో చర్చిస్తున్నట్లు నాకు జ్ఞాపకం. అదే

సమయంలో మా కెదురుగా దరిద్రింతోనూ, క్షుద్బాధ తోనూ పీడింపబడి దుర్దశగ్రస్తమైన ఒక మానవమూర్తి ప్రత్యక్షమైంది. వెన్నెలలో మాయెదురుగా నిలబడ్డ ఆవ్యక్తిని మేము చూడగల్గుతున్నాం. వాడు సంకర అరేబియా జాతికి చెందివున్నప్పటికీ కట్టుకొన్న గుడ్డలవల్ల ఈనాటి ఈజిప్షియన్ లను పోలి వున్నాడు. వాడు ధరించిన గుడ్డలు ఎంత మురికిగా వున్నయ్యంటే వాడు మావద్దకురాగానే దూరంగాతొలిగాం. దీర్ఘంగావున్న ఆ వెంట్రుకలు దుమ్ముతో నిండి ముఖంమీద కే గాక ప్రక్కలకుగూడా జారి వున్నాయి. వాడి కనుబొమలు నల్లగా, దట్టంగా వున్నవి. ఒకకాలికి ఒకబూటు, రెండవ కాలికి అరబ్బులవలె చెప్పు. వాడు కట్టుకొన్న నల్లపైజామా మోకాళ్ల క్రిందిభాగంలో పేలికలైపోయింది. అతడు మధ్య మధ్య భయంకరమైన దగ్గుతో బాధపడుతున్నాడు. ఆ బాధను జూచిన ఏ మానవునికైనా హృదయం ద్రవించకపోదు.

ఆ రకపు వ్యక్తులపై తీక్షస్వరా నుపయోగించి బాధ పెట్టడంలో యేమీా సందేహించని కోవకు జెందినవాడు దాసు. దౌర్భాగ్యంతోనూ; దుఃఖాలతోనూ క్షీణించుకపోయిన ఆ వ్యక్తిమీాద ఆయన ఒక్కసారిగా విరుచుకపడ్డాడు.

ఆయన నిర్దాక్షిణ్యామైన గొంతుతో బెదరిస్తూ అన్నాడు - ఎవరు నీవు? వెళ్ళిపో యిక్కడినుంచి !

దానికి సమాధాన మిచ్చినస్వరం చాంగ్ మహాశయు నిది - "నేను తిరిగి రానంతవరకు మీారందరూ యీా హోట

ల్లోనే వుండాలి. అవసరమనుకొంటే నిద్రించండి. అంతేగాని ఏది యేమైనప్పటికీ యిక్కడనుంచి కదలవద్దు. ఒక్క గంట లోపుగానే తిరిగి రాగలనని నేను ఆశిస్తున్నాను.

# 7 చాంగు మహాశయుని మొదటి దెబ్బ.

ఆ భయంకరమైన ఇంద్రజాలపు కాళరాత్రి చాంగ్ యెట యెలాపరిణమించిందో తర్వాత స్వయంగా ఆయన నోటి వెంట విన్నాను. ఈ వర్ణనంతా సాధ్యమైనంతవరకు ఆయన మాటల్లోనె చెప్తాను. చాంగ్‌వంటి వృత్తమవ్యక్తి కఠోరమూ, అత్యంత భయంకరమూనైన తన పనులను అతిశయోక్తిగా చెప్పడని నా విశ్వాసం.

ఆయన ఓడరేవుకువెళ్లి అక్కడినుండి ఆ పాతాళ లోకంలోకి దిగాడు. అది అర్ధరాత్రి సమయమైనా అక్కడి వాళ్లుమాత్రం మేల్కొనే వున్నారు. అక్కడ నేలలో మలచ బడ్డ రెండు - మూడు రోడ్లున్నాయి. వాటిపై చిన్నరకపు గ్యాస్‌లైట్లు వెలుగుతున్నాయి. చాంగ్ చైనాలోని అన్ని నగరాలను సందర్శించి వున్నప్పటికీ కాంటన్‌వంటి నికృష్ట నీచ స్థలాలను గూడా యింత అసహ్యంగా వుండవని చెప్పాడు.

మురిగిపోయి దుర్గంధభూయిష్టమైన మురికితో రోడ్లన్నీ నిండివున్నవి. ఇంతరాత్రి సమయంలో గూడా దీపాల వెలు

గులో పిల్లలు ఆడుకొంటున్నారు. ఎన్నో కష్టాలు సహించిన ముసలివాళ్ల ముఖాలలాగవున్న వాళ్ళ మోములు ఎప్పుడూ ఎండముఖం చూచివుండవు. అక్కడ యెందరో త్రాగుబోతులు ఒళ్లు తెలియకుండా పడివున్నారు. సారాయి త్రాగి-త్రాగి దొర్లాడుతున్నారు యింకా కొంతమంది.

చాంగ్ మెట్లన్నీ దిగినతర్వాత వూపిరిపీల్చుకోవడానికి ఒకసారి నిల్చున్నాడు; ఆయన ఆ హృదయవిదారకమైన దౌర్భాగ్యవాయువును కొంచెం అలవాటు చేసుకొందామని అలా నిలబడ్డాడు. తర్వాత ముందున్న పెద్ద గొందిలోకి వెళ్లాడు. ఆయన తన తల వంచుకొని వెళ్తూగూడా చుట్టు ప్రక్కల జాగ్రత్తగా పరిశీలిస్తూనే సాగిపోతున్నాడు. ఆయన జేబులో పన్నెండుగుళ్ల పిస్తోలు సిద్ధంగావుంది.

ఆయన ఒక యింటివాకిట్లో ఒక అరేబియా ముసలి వాడు కూర్చొనివుండటం చూచాడు. అతని దంతాలన్నీ వూడిపోయినవి. తల ముగ్గుబుట్టలాగుంది. చాంగ్, అరేబియన్లు, కుట్టీలవంటి మోసగాళ్లను గూడా తలదన్నినవాడు. తనను తుర్కీదేశపు వాడిలాగా ప్రదర్శించాలని అనుకొన్నాడు. ఇది చాల సులభం గూడా. ఎలాగంటే యూక్‌కంద్ (చైనాలోని తురుష్క ప్రాంతం) తాలూకాలో ఎంతోకాలంపాటు అధికారి హోదాలో వున్నాడు. అందువల్ల ఆయనకు బాగా తుర్కీభాష తెలుసు. టుర్కీభాషలో మాట్లాడటం ప్రారంభించగానే ఆ అరేబియావాడు తనకది తెలియదని తల దిప్పాడు.

అప్పుడు చాంగ్ మహాశయుడు యింగ్లీషులో మాట్లాడడానికి ప్రయత్నించాడు. వాడీభాషను కొంచెం తెలుసుకొం

టున్నాడు. ఆయన తను కొంతకాలం ట్యూనీసియాలో వున్న ట్లుగా చెప్పాడు. ఆ అరేబియను బైజరతా ప్రాంతంనుండి వచ్చాడు. చాలారోజుల క్రితం వాడు కుర్రతనంలో వున్నప్పుడు దొంగతనాలు చేస్తూండేవాడు. అతలస్‌పర్వత ప్రాంతంలోని పశువుల కాపర్లవద్ద ఎన్నోసార్లుగా వాడు పశువులను దొంగి లించాడు. కాని యిప్పుడు నిర్బలుడు, వృద్ధుడు, కటికబీదవాడైనందువల్ల అల్లాయిప్పుడు గుర్తుకొచ్చాడు. చాంగ్ మొత్తానికి తనకు పనికివచ్చే మనిషినే ఎంచుకొన్నాడు. ముసలివాళ్లు చాల తక్కువగా నిద్రపోతారని, సహజంగా అటు-ఇటు చూడడంలో నిమగ్నులై వుంటారని చాంగ్‌కు తెలుసు. పాతాళపురంలో ప్రవేశించిన ప్రతివాడు యీ రోడ్డుమీదుగానే రావాలి. ఆ యిద్దరు మిశ్రీయులు ఇక్కడే ఆశ్రితులైవుంటే ఈ అరేబియన్ వాళ్లను తప్పక చూచివుంటాడు.

చాంగ్ మహాశయుడు ఎక్కువగా పరామర్శించే అవసరం లేకపోయింది. ఒకటి, రెండుమాటలు చెప్పగానే ముసలివాడు అంబీత్ గ్లాసు పట్టాడు. తన జీవితంలో ఎన్నో దొంగతనాలు చేసినా తాను ధర్మాన్ని ఎన్నడూ తప్పలేదట. మహమ్మదు ప్రవక్త సారాయి త్రాగవద్దని చెప్పినా అంబీత్‌ను మాత్రం నిషేధించలేదట. ఇదీ ఆ అరేబియన్ కథనం.

వాడు ఆ గ్లాసును ఒక్క గుక్కలో పూర్తిచేసిన తర్వాత చాంగ్ అవసరమైన విషయాలన్నీ రాబట్టుకొన్నాడు. ఆ మిశ్రీయులిద్దరూ పాతళంలోనే వున్నారు. గ్రీకు ఆర్మీనియం జాతికి బుట్టిన ఒక సంకరజాతివాడి యింట్లో వాళ్లు మకాం

వేశారు. వాడు సూయజ్‌కంతకూ ప్రసిద్ధికెక్కిన గూండా. ఒక రౌడీగుంపుకు నాయకుడు. యీ రౌడీలు ఓడ రేవులో వున్నప్పుడు, ప్రయాణీకులను, నావికులనూ కొల్లకొడుతూ వుంటారు. తస్కరించిన నాణేలను ఏలాగో అక్కడే మార్చుకొంటారు. గడియారాలు, ఉంగరాలూ మొదలైన విలువగల వస్తువులను పండ్లనావల్లో అవాబాకు తీసుకువెళ్తుంటారు. అక్కడ వాళ్ళకు మంచిధర గిట్టేది. ముసలి అరబ్బీవాడు యే విషయం దాచకుండా చెప్పాడు. ఆ పాతాళ లోకంలోని ప్రతివాడూ పక్కాదొంగ. నిస్సందేహంగా ముసలివాడు చాంగ్‌నుగూడా ఆ దొంగల్లో లెక్కకట్టాడు.

చాంగ్ ఏదో నెపంతో ఆ అరేబియావాణ్ణి అక్కణ్ణే వదలి ముందుకు సాగాడు. ఆ సంకరజాతి వాడుండే ఇల్లు కష్టమేమీ లేకుండానే చిక్కింది. వాడింట్లో నేలత్రవ్వి నిర్మించబడిన మూడు చిన్నచిన్న గదులున్నాయి. వాకిట్లో గంటా, గొలుసూ ఏమీ లేవు. చాంగ్ ఇంటి తలుపు తట్టాడు.

కొంచెంసేపటిలో ఒక వ్యక్తి బయటకొచ్చాడు. వాడి రూపమే బద్మాష్‌వలె వున్నది. వాడు చాంగ్‌తో ఒక అజ్ఞాత భాషలో మాట్లాడాడు. వాడి కఠోరమైన కంఠస్వరంలోనూ, మెరసిపోతున్న నల్లని కళ్ళలోనూ బెదరించే భావం వుట్టిపడుతోంది. చాంగ్ వచ్చీరాని ఇంగ్లీషులో మాట్లాడాడు — "పోలీసులు నన్ను వెంటాడుతున్నారు." దీనికి వాడు ఇంగ్లీషులోనే జవాబిచ్చాడు — "అయితే దానితో నాకేం సంబంధం?" చాంగ్ "ఆశ్రయం!" వాడు శంకాచిత్తంతో "నీవద్ద సొమ్మెంత

వుంది?" అన్నాడు. చాంగ్ — "దానికీ నీకూ సంబంధ మేముంది? నా వద్దవున్న సొమ్మును నే నెట్లా సంపాయించుకొన్నానో నీ కనవసరం. నీవు నాకీరాత్రి ఆశ్రయమిస్తే అయిదు రూపాయ లిస్తాను."

వాడు మొదట్లో తప్పించుకో చూచాడు. అప్పుడతనికి గాఢ నిద్రలోవున్న తన అతిథులిద్దరూ జ్ఞాపకం వచ్చారు. తాముున్నంత వరకూ మరెవ్వరినీ లోనికి రానివ్వరాదని వాళ్ళడిగిన విషయం జ్ఞాపకం వచ్చింది. అయినప్పటికీ ఒక్క రాత్రికి రు. 5/ లు సామాన్యంకాదు. అదీకాక అతిథులు యీ విషయాన్ని తెలుసుకోనూ లేరు. అతడు వాకిలి తెరచి చాంగును లోనికి రమ్మన్నాడు. చాంగ్ లోనికిరాగానే తాళం వేసి చెవిని ప్యాంటు జేబులో పెట్టుకొన్నాడు. చాంగ్ ఈ తతం గాన్నంతా చూస్తూనే వున్నాడు. ప్రతి విషయం సూక్ష్మంగా పరిశీలించడం మీదనే తన జీవితం ఆధారపడి వుందని బాగా తెల్సు.

మొదటి గదిలో ఒక మేజా వుంది. దానిమీద వున్న పాత్రలో మైనపువత్తి వెల్గుతోంది. అది కాలికాలి చివర కొచ్చింది. ఒకమూల మంచి మంచం, రెండు—మూడు కుర్చీలూ, ఒక వంకెపై కోటూ వ్రేలాడుతున్నాయి. సామానంతా చాలా మురికిగా వుంది.

వాడా వత్తితోసహా చాంగును ప్రక్కగదికి తీసుకుపోయాడు. అది $2\frac{1}{2} \times 2$ గజముల కంటె ఎక్కువ వుండదు. అక్కడొక చాపతప్ప మరేమీ లేదు. వాడన్నాడు — ఇదే నీవు

పండుకొనే చోటు. కాని దయచేసి అర్ధమాత్రం ముందు చెల్లించు.

చాంగ్ తన ప్యాంటుజేబులో చేతులు పెట్టాడు. చేతితోపాటు ఒక పెద్ద చాకు గూడా వెలికివచ్చింది. ఆ వ్యక్తి చాకూ, చాంగులకేసి చూచి, చిరునవ్వు నవ్వాడు. ఈ రూపంతో అతడు తన అయిష్టతనో, ఆమోదాన్నో తెలియపరు స్తున్నాడు. చాంగ్ రు. 5/లు తీసి యిచ్చాడు. వాటిని మోగించి చూసుకొని గదినుండి బయటకు వెళ్ళి తలుపులు వేశాడు. చాంగ్ ఎప్పుడూ తనవద్ద చాకును వుంచుకొంటాడు. ఆత్మ రక్షణకుగాను ఆయనవద్ద వుండే మరికొన్ని సాధనాలను ముందు చూస్తాం.

ఇప్పుడిక చాంగుగది చీకటి మయమై పోయింది. తలుపు సందుల్లోంచి ఒకటి - రెండు వెలుగు కిరణాలు లోనికి వస్తున్నవి. అతడు వ్రేళ్ళమీద నడచి ద్వారంవద్దకు వచ్చాడు. మూడవ గదికి సంబంధమున్న తలుపువద్ద చెవిబెట్టి విన్నారు. గాఢ నిద్రనుండి వచ్చే శ్వాస-ప్రశ్వాసాలను గూడా విన్నాడు. తను నిరుపయోగమైన చోటుకు రాలేదని నిశ్చయించుకొన్నాడు. ఇప్పుడాయన తిరిగి తన చాపను జేరుకొన్నాడు. కొద్దిసేపటిలోనే గురకలుపెట్టి నిద్రిస్తున్నట్లు నటించాడు. ఇప్పుడతని ముక్కు ఎడతెగకుండా మ్రోగుతోంది. చాలాసేపు కళ్ళు మూసుకొని పడివున్నాడు. కొద్దిసేపటి తర్వాత కళ్ళు తెరచి చూడగా మొదటి గదిలోని దీపం ఆరిపోయినట్లు గమనించాడు. ఇంటి యజమాని నిశ్చింతగా నిద్రించాడని,

నిశ్చయించుకొన్నాడు. ఇంటినిండా చీకటి అలుముకుంది. ఆ ముసుగు గాలిలో శ్వాస పీల్చుకోవడమే దుర్భరమై పోయింది.

మెల్లగా లేచి అతడు మొదటి గదివైపునున్న తలుపు తెరచి చూశాడు; ఇంటి యజమాని గుర్రకలు పెడుతూండడం గమనించాడు. ఆయన తన గదిలోకి వెళ్ళి టార్చిలైటు తీసుకొని లోపలున్న మూడవ గదిద్వారాన్ని పరీక్షించాడు. మొదట్లో అనుకొన్నట్లుగానే దానికి తాళం వేయబడింది.

చాంగ్ వ్రేళ్ళు యింద్రజాలపువాడి వ్రేళ్లవలె చాల నేర్పుతో పనిచేస్తున్నాయి. ఆయన ఇంటివాడిని నిద్రలోనే మోసగించాడు. ఎంత నేర్పుతో ఆయన వాడి జేబునుండి తాళం చెవి తీశాడంటే అతని కేమాత్రం యీ విషయం తెలియలేదు. అప్పుడాయన చప్పుడు లేకుండా లోపలవున్న గది వద్దకు వచ్చి మెల్లగా తాళం తీశాడు. తలుపు తీయడానికి 10 ని।లు పట్టింది. ఆయన యేమాత్రం ధ్వని గాకుండా మెల్లగా ద్వారాన్ని తెరుస్తున్నాడు. యేమంటే అందరూ మేల్కొంటారు. చేసిన ప్రయత్నమంతా వ్యర్థమవడమేగాక ప్రాణాలు గూడా సంకట స్థితిలో పడిపోతవి.

బ్యాటరీలైటు సహాయంతో గదంతా పరికించి చూచాడు. అనుకున్న వ్యక్తులు వీళ్లే ననడంలో ఆయన కేమాత్రం సందేహం లేకుండా పోయింది. ఇద్దరూ గదిలో నేలమీదబడి నిద్రపోతున్నారు. వాళ్ల శరీరంమీద గుడ్డలు గూడా సరిగా లేవు. వాళ్ల ముఖాలు కుష్ఠురోగుల ముఖాలవలె

వున్నవి. వాళ్లలో ఒకడు చెవులవరకు కత్తిరించబడిన పెద్ద వెంట్రుకలు కలిగి వున్నాడు. రెండవవాడు పూర్తిగా బట్ట తలగల ముసలివాడు. వాళ్ళ పెదిమలు సన్నగానూ, దవడ యెముకలు ఎత్తుగానూ, ముక్కు యూదుల ముక్కువలె కొన గలిగియూ, ముక్కుగోళ్ళు పెద్దవిగానూ వున్నాయి. ముసలి వాని ముఖంపై చెవివద్ద నుంచీ కంఠివరకు ఎర్రని గీతలాంటి వాత వున్నది.

కాలాన్ని వృధా జేయడం చాంగ్ పనిగాదు. తీవ్ర మైన ఆయన నేత్రాలు యెంతో శీఘ్రంగా సూక్ష్మమైన వస్తువులను సయితం పరిశీలించ గలుగుతాయి. పరిశీలనలో ఆయన బుద్ధి అసాధారణమైనది. టార్చిని కొన్ని సెకన్లకంటె ఎక్కువ వెలగనివ్వలేదు. ఆ కొద్ది సమయంలోనే వాతవున్న వాడి తలక్రింద ఒక దిండు వుండడం, రెండవ వాడికి అది గూడా లేకపోవడం గమనించాడు.

చాంగ్ మోకాళ్ళపై వంగి దిండును పరిశీలించాడు. అదే సమయంలో ఆ ఎర్రని వాతనుగూడా దగ్గరలో చూశాడు. అది చేతి కత్తిదెబ్బని తెలుస్తోంది. దిండు ఒక మురికి గుడ్డలో చుట్టబడి వుంది. టార్చిలైటు వెలుగులో ఏదో రాయిగాని, లోహపు వస్తువుగాని, దానిలో చుట్టబడి వున్నట్లు గ్రహించాడు. ఆయన చివరి కెలాగో గోబర్లైలా అంతు కనుక్కొన్నాడు.

తర్వాత తాను నిద్రించిన గదికి వెళ్లాడు. అక్కడి నుంచి యింటి బయటి వాకిలివద్దకు చేరాడు. ఆయన నడక

పిల్లినిగూడా తలదన్నినట్లుంది. చీమ చిటుక్కుమన్నంత ధ్వని గూడా కాలేదు. ఆయన మెల్లగా బయటివాకిలి తాళం గూడా తీశాడు. ఇప్పుడాయన వెళ్ళడాని కేమీ ఆటంకం లేకుండా చేసుకొన్నాడు.

ఇదే సమయంలో ఒక పెద్ద విఘ్నం వచ్చిపడింది. ఇంట్లో గాలికంటె బయటిగాలి కొంచెం పరిశుభ్రంగా వుంటుంది. ఆయన వాకిలి తెరువగానే ఆ మంచిగాలి కాస్త యింటివాడి వంటికి తగిలింది. వెంటనే వాడు లేచి నిలబడ్డాడు. వెంటనే పెట్టెలోనుండి కత్తి తీసుకొన్నాడు. గాఢాంధకారంలో తీవ్రమైన వెలుగు చేసేపని చాంగ్‌కు బాగా తెలుసు. ఆయన వెంటనే టార్చిబటన్ నొక్కి వాడి ముఖంమీదకు త్రిప్పాడు. వెంటనే ఆయన తనపిస్తోలును వాడికి బాగా కన్పించేటట్లుగా పట్టుకొన్నాడు. ఆపైన తీవ్రంగా మెల్లగా అన్నాడు — అరిచావా చచ్చావే; మాట బయటికి రావడమే ఆలస్యం నీ గుండెల్లో తుపాకిగుండు వుంటుంది.

వాడు తన జేబులను వెదుక్కొని అన్నాడు — "నీవు నా తాళం చెవులను కాజేశావు."

చాంగ్:- ఇక నోరుముయ్యి. నేను చెప్పినట్లు చేయి. నీవు భయపడాల్సిన అవసరమేమీ లేదు. నీ తాళంచెవులు నీకు తిరిగి ఇచ్చేస్తాను. కాని ఏమాత్రం గోలచేసినా ప్రాణాలు దక్కవు.

మామూలు రౌడీలు పిరికివాళ్లు. ఆ వ్యక్తి అంగ ప్రత్యంగంనుండి భయం వ్యక్తమౌతోంది. వాడు తెరచిన నోరును మూసుకోవడం గూడా మరచి పోయాడు.

వాడు:- నీవు పోలీసు వాడివా?

చాంగ్:- కాదు, నేనూ మీ అందరిలాంటి దొంగనే. కాని నాకు మాట్లాడడానికి సమయంకాదు. చెప్పినట్లు చేయి. నీ రెండు చేతులూ ఎత్తుకొని లోపలవున్న గదిలోకి నడువు. ఇటు చూడు, పిస్తోలు నా చేతిలోనే వుంది.

వాడికి వేరే మార్గం లేకపోయింది. చాంగ్‌కు ముందు ముందుగా వాళ్లు పడుకున్న గదికి వెళ్లాడు. మిగిలిన రెండు గదులకంటె యీ గది పెద్దది. చాంగ్ టార్చిలైటు వెలిగించి ఒక ఎత్తైనచోట పెట్టాడు. ఆయన వాడిని గదిలో ఎదురుగా వున్న గోడకు ఆనుకొని, నిలబడ మన్నాడు. వాడు నిలబడిన తర్వాత ముఖంమీద బాగా లైటు పడేటట్లుగా వుంచాడు. చాంగ్ – "ఏమాత్రం కదలినా కాల్చివేస్తా. నావద్ద ఎత్తులు వేయకపోవడమే మంచిదని హెచ్చరిస్తున్నాను.

అలా చేయడానికి కారణం వుంది. చాంగ్ ఎంత ప్రతిభా సంపన్నుడైనా చేతులు మాత్రం రెండే వున్నవి. ఆ నిద్రపోయేవాడి తలఎత్తి దిండు తీయాలి; గోబరైలాను తీసుకో వాలి; ఇదంతా చేస్తూనే ఇంటివాడిని జాగ్రత్తగా చూస్తూ వుండాలి. ఏమాత్రం అలికిడైనా పిస్తోలు కాల్చడానికి సిద్ధంగా వుండాలి. వెలుగులోవున్న వ్యక్తి ఏమాత్రం జరిగినా వాడిని కాల్చడం అసంభవం. ఇంతపని చాంగ్ మహాశయునివంటి వ్యక్తికి గూడా మించిన పనే. ఆయన ఇందులో సఫలుడు కాలేక పోయినందుకు ఆశ్చర్యపడే అవసరం లేదు. మన మా వ్యక్తి యొక్క సాహస, నిపుణత్వాలకు మాత్రం ఆశ్చర్య పడతాం.

చాంగ్ గోబ్రైలాను ముట్టుకోగానే నిద్రబోతున్న వ్యక్తి ఒక్కసారిగా లేచి అరచాడు. ఈ కేకవల్ల గదిలో రెండో మూల నిద్రపోతున్న వాడుగూడా లేచాడు.

చాంగ్ మహాశయుడు గోబ్రైలాను చేతికి తీసుకొని నిలబడ్డాడు. ఆ చోటంతా అంధకార బంధురంగా వుంది. టార్చి వెలుగు వున్నంతవరకు మాత్రం ఒక ప్రకాశవంతమైన కత్తివలె కన్పిస్తోంది. టార్చి దగ్గరనుండి ద్వార మెంతదూరాన వున్నదో చాంగ్ వూహించగలడు. ఒక చేతిలో పిస్తోలు, రెండో చేతిలో గోబ్రైలాను తీసుకొని వాకిలివైపుకు రాసాగాడు.

ఇదే సమయంలో మిగిలిన వాళ్ళిద్దరూ మేల్కొని వుండడం చూసి ఇంటివాడు చేతులుచాచి టార్చిని తీసుకొందామని ముందడుగు వేశాడు. ఒక్క క్షణంగూడా వెనకా ముందాడకుండా చాంగ్ గుండును బారుచేశాడు. ఆ గురి అద్భుతమైనది. వాడు వెలుగులో వున్నందువల్ల తలుచుకుంటే చంపగలడుగూడా. అలా అనుకుంటే చీకటిలోవున్న ఆ మిత్రీయులను గూడా అంతం చేయ గలుగుతాడు. కాని ఆయనలా చేయలేదు. పిస్తోలుతో కేవలం టార్చి అద్దాన్ని ముక్కలు ముక్కలుగా జేశాడు. వెంటనే ఆ గదంతా చీకటి మయ మైంది.

కాని చాంగ్ వాకిలికి దగ్గరలో వున్నాడు. ఆయన ఒక క్షణంలో బయటికి వచ్చాడు. గోబ్రైలాను క్రిందబెట్టి కాసేపటిలో యింటికి తాళం వేశాడు. ఇప్పుడు ముగ్గురూ

గదిలో బంధింప బడ్డారు. వాకిలి వేయడానికి ఆయన రెండు చేతులూ వుపయోగించాల్సి వచ్చినందున చీకటిలో గోబర్తై లాను మళ్ళీ వెదుక్కొని తీసుకోవాల్సి వచ్చింది. ఇంటివాడు లోపలనుంచి తలుపు బాదుతున్నాడు. వాడికి విన్పించేట్లుగా చాంగ్ చెప్పాడు — "బయట గదిలో వున్న బల్లమీద నీ తాళం చెవులుంటాయి." అప్పుడాయన రోడ్డు మీదకు వచ్చాడు. ముందు ఒకసారి తన చేతిగుడ్డతో చెమట తుడుచుకున్నాడు. "ఎంతో జాగ్రత్తగా చేయవలసిన కఠోర కార్యమని" ఆయన తర్వాత మాతో చెప్పాడు.

ముసలి అరబ్బీవాడు యిప్పుడుగూడా తన యింటి గడప మీదనే కూర్చొని వున్నాడు. చాంగ్ అటునుండి వస్తూ సలాంచేసి "సూర్యోదయానికి యింకెంత ఆలస్యముంద" ని అడిగాడు.

ముస:- నాకు తెలియదు. పాతాళలోకంలో సూర్యోదయ మేమిటి? సూర్యుడిక్కడ వుదయించడమూ లేదూ, అస్తమించడమూ లేదు. లా ఇలాహా యిల్లల్లాహా ముహమ్మద్ రసూ దల్లల్లాహా."

చాంగ్ మహాశయుడు ఓడ రేవుకు రాగానే శుభ్రమైన గాలిని తృప్తిదీర ఎన్నోసార్లు పీల్చాడు. తూర్పుదిక్కున కెంపు రేఖలు కన్పిస్తున్నాయి. తెల్లవారడాని కింకొక గంట సమయ ముంది.

గుడ్డలు మార్చుకున్న తర్వాత చాంగ్ మహాశయుడు నా గదిలోకి వచ్చాడు. ఆయన యిప్పుడు తన సాధారణ

దుస్తుల్లో వున్నాడు. అదే వున్నికోటు, ప్యాంటు, అదే విచిత్ర మైన టోపీ.

రాత్రంతా నిద్రపోకుండా, కనీసం గుడ్లలైనా విడవ కుండా వున్న ధనదాసు యిప్పుడు నోరు విప్పాడు—"గోబ రైలా మీ చేతికి చిక్కిందా?"

ఐంద్రజాలికురాలు భానుమతి పిటారి * నుండి చిట్టెలు కను తీసి చూపెట్టినట్లుగా చాంగ్ మహాశయుడు పచ్చని చెకు ముకు (వెలుగుతో నిండిన) గోబరైలాను తన కోటు జేబు నుండి బయటికి తీశాడు.

## 8 చాంగు మహాశయుడు గూఢా కాహిరాకు

కెప్టెన్ ధీరేంద్రుకు కంపెనీనుండి తంతి వచ్చింది. మే మింకా నిద్ర లేవకముందే ఆయన ఓడమీదకు వెళ్లిపోయాడు. స్నానం గీనంచేసి అల్పాహార మయినతర్వాత చాంగ్‌తో సహా నేమూ "కమల్" మీదకు వెళ్లాం. అప్పుడు ధీరేంద్రుడు కెప్టెన్ వ్రజరాజ్‌కు ఛార్జీ ఇస్తున్నాడు. కొంచెం సేపట్లోనే చాంగ్ వెళ్లిపోయినా నేము మాత్రం ఎంతో సేపు ఓడమీద

---

* భానుమతి గొప్ప ఐంద్రజాలికురాలు. ఆమెవద్ద నుండు పెట్టెనే "పిటారీ" అంటారు. దీనిలో అత్యద్భుతమైన వస్తువులుండునని అంటూంటారు.

వున్నాం. ఒంటిగంట బండికి కాహిరా వెళ్లాలని మొదట్లోనే నిశ్చయించుకొన్నాం. కొద్దిసేపు ఓడమీద వుండి తర్వాత సామానంతా బిగించి కాహిరాకు రైల్వే రసీదును తయారు చేయించసాగాం. మేము పనంతా ముగించుకొని 11 గంటలకు హోటలుకు చేరుకోగానే ధీరేంద్రుడు గూడా వచ్చాడు.

భోజనం చేసినతర్వాత గూడా కొంచెంసేపు హోటల్లోనే వున్నాం. మేము సూయజ్‌కు చేరగానే కాహిరాలో వున్న చేలారామ్ గుమాస్తాకు తంతి పంపానన్న విషయం మరచాను. సామాను పార్సిలు చేయకముందే మేము ఒంటి గంట బండికి వస్తున్నామని తెలియజేశాం.

స్టేషన్‌వద్ద చాంగ్‌గూడా కాహిరా రావడానికి సన్నద్ధమై వుండడం చూచి మేము ఆశ్చర్యపడ్డాం. "మీరు గూడా మాతో వస్తారా" అని అడిగాను. ఆయన తన సహజమైన నవ్వుతో సమాధానం చెప్పాడు. "కాహిరాలో అవసరమైన పని వుంది."

కనీసం కాహిరా వరకైనా యీ అద్భుతవ్యక్తి సాహచర్యం లభించినందుకు నేనెంతో సంతోషించాను. మేము నల్గురం ఒకే పెట్టెలో కూర్చున్నాం. ఇంకా బండి బయలు దేరడానికి ఆలస్య మున్నందువల్ల ప్లాట్‌ఫారంమీద పచారు చేస్తున్నాం. ఇదే సమయంలో నా భుజంమీద ఎవరో చేయి వేశారు. నేను తిరిగిచూస్తే ఆయన చాంగ్ మహాశయుడే. ఆయన అన్నాడు — ప్రొఫెసర్, వాళ్లు మిమ్ము కాహిరాదాకా వెంబడిస్తారు. ఆపైన నైలునది వరకూ వెంటాడుతారు. అంతే

గాను, భూమండలం వున్నంత వరకూ వదలిపెట్టరు. వాళ్లైన రన్న విషయం మీకంటె నాకు ఎక్కువ తెలియదు. కాని యీ పచ్చని గోబర్రైలా కోసం వాళ్లు తమ ప్రాణాలను సయితం తృణప్రాయంగా యెంచుతారని నా దృఢనిశ్చయం.

నేను:- ఎందువల్ల?

చాంగ్:- మీరు చూడలేదా? అయితే, ఆ వెయిటింగు రూములోనుంచి తొంగిచూచే వాళ్లెవరో చూడండి.

నేను చూశాను. బొంబాయి ఓడరేవులో చూసిన ముసలివాడే అక్కడా కన్పించాడు. నేను జన్మలోనే మానసిక బలహీనుణ్ని. నా హృదయం భయంతో కంపించసాగింది. నేను చాంగ్ చేయి పట్టకొని విధేయత వుట్టిపడేలాగ అడిగాను – "చాంగ్ మహాశయూ, మీరు మాతో రావడానికి వీలులేదా? మీరు తప్పక మీ సాంగత్యంతో మమ్ము అనుగ్రహించండి. మీరూ, ధీరేంద్రుడూ వెంట వుంటే నేను సర్వదా క్షేమంగా వున్నట్లే భావిస్తాను. చెప్పండి, వస్తారా!"

నేను ప్రసిద్ధిగాంచిన ఆ అపరాధ పరిశోధకుని వదనం మీద ఒక హాసరేఖను చూశాను. గంభీరమైన మధుర స్వరంతో ఆయన అన్నాడు – ప్రొఫెసర్, నేనూ యీ అవకాశం కోసమే నిరీక్షిస్తున్నాను.

నేను చాంగును కూడా తోడు చేసుకొన్న సంగతి మరునాటి వుదయంవరకూ ధనదాసుతో చెప్పలేదు. ఈమాట వినగానే ఆయన అగ్నిగోళం అయ్యాడు ఆయన అప్పుడు

కూసిన కూతలుగూడా గుర్తులేవు. త్రిట్టితిట్టి విసిగిపోయి ఇక వాదం చెయ్యడానికి తయారయ్యాడు. ఆయన వాదంలోని సారాంశమిది. "యీ యాత్రకు అసలు మన మిద్దరమే చాలు; కాని నీవు పట్టుబట్టి ధీరేంద్రుణ్ణి గూడా కలిపావు. ఇప్పుడు మరో వ్యక్తిని నన్ను అడక్కుండానే చేర్చావు".

నాకా కష్టాలు బాగా తెల్సు. సెరాఫిస్ సమాధిలోని వజ్ర వైఢూర్యాల వెలుగు నా నేత్రాలను మిరిమిట్లు గొల్ప లేదు. వారికయ్యే ఖర్చంతా నేనే భరిద్దామనుకున్నాను. ఇంత అద్భుత ప్రతిభాసంపన్నులూ, తార్కికులూ, మా వెంట రావడానికి సిద్ధపడడం మా మహాభాగ్యం. ఎంతో కష్టం మీద ధనదాసు యీ విషయాన్నంగీకరించాడు. అతనికిది సహించరాని విషయమైనప్పటికీ మరేమీ చేయలేక పోయాడు. నేనతని ప్రవర్తనను గూర్చి యేమీ నొచ్చుకో లేదు. ధీరేంద్రుడు దీనికి హృదయపూర్వకంగా స్వాగత మిచ్చినందుకు నే నెంతో సంతసించాను.

ధీరేంద్రుడు, ధనదాసు మూర్ఖత్వాన్ని, ధనకాంక్షను గూర్చి యెప్పుడూ విరగబడి నవ్వుతూండేవాడు. ఆయన యెంతో సేపు ధనదాసును నిర్నిమేషుడై చూస్తూండేవాడు. ధనదాసు తనవైపు చూచినప్పుడు సంగీతం ప్రారంభించేవాడు. నేను మొదట్లో దీన్ని అర్థం చేసుకోలేదు. ఆ సమయంలో అట్టి మూర్ఖు డెవ్వడూ వుండడు. పాఠకులు యిప్పటికి చది న్నిబట్టి నాలో వ్యవహారదక్షత యేమాత్రం లేదని చే వుంటారు. చాంగ్ వుద్దేశ్యమేమో నేను యిప్పటికీ చలేక పోయాను.

రాత్రి ఎక్కువసేపు మేల్కొన్నందువల్ల నిద్ర ముంచుకొస్తోంది. బండి బయలుదేరిన రెండు గంటల్లోనే నేను నిద్రకు లోనై పోయాను. నేనా నాటి యాత్రలో చాంగ్ - ధీరేంద్రుల మధ్య జరిగిన సంభాషణాంశాన్ని తర్వాత తెలుసుకొన్నాడు.

చాంగ్ మహాశయుడు ధీరేంద్రునివద్ద బీడీ తీసికొని ముట్టించి పొగవదుల్తూ అన్నాడు — మీరీ యాత్రనూ, గోబరైలానూ, సమాధిస్థ ధనాగారాన్ని గూర్చిన నా అభిప్రాయాలనూ, ప్రొఫెసరూ, అతని అనుచరుణ్ణీ గూర్చిన నా వుద్దేశ్యాన్నీ తెలుసుకో గోరుతుండవచ్చు. అలాగైతే మీకు స్పష్టంగా వివరిస్తాను. చాలవరకు మీ అభిప్రాయంతో నే నేకీభవిస్తాను.

ధీరే:- అవును. నేను తెలుసుకోగోరుతున్న మాట నిజం. పాపం, ప్రొఫెసర్ ఒక అమాయకుడని నా భావం. అతడు ప్రాచీన మానవులనూ, వారి ఆచార వ్యవహారాలనూ, వారి ధర్మ-కర్మలనూ గూర్చి తెలుసుకోవడంలో పెద్ద పండితుడయ్యే వుండవచ్చు. అంతేగాని యీ ఆధునిక యుగపు విషయాల్లో కొరగాని వాడే. ఈ జొహారీ వెంట ఆఫ్రికా మధ్యభాగానికి వెళ్ళి ప్రాణాలతో బయటపడడన్నదే నిజమైన విషయం.

చాంగ్ తల పంకిస్తూ నవ్వి అన్నాడు—మీరు చెప్పి[illegible] అక్షరాలా నిజం. యాత్రనుగూర్చి చెప్పాలంటే [illegible] అసంభవంగా కన్పించినా అందు ప్రతి మాటా పరిపూర్[illegible] మన్నది ఖండింపరానిది.

ధీరేం:- అక్కడ మితనీ నగర మున్నదని మీరు నమ్ముతున్నారా?

చాంగ్:- అవును. పూర్తిగా.

ధీరేం:- మరి ధనదాసును విశ్వసిస్తున్నారా?

చాంగ్:- అవును అతడొక మోసగాడు. అతని వుద్దేశా లన్నీ పూర్తిగా తెలుసుకోక పోయినప్పటికీ పెద్దమనిషి కాడని మాత్రం నా నమ్మకం.

ధీరేం:- ఆ విషయాలన్నీ నిజమే అయితే మితనీ నగ రమే మన లక్ష్యం. అక్కడకు చేరడమే నా లక్ష్యం.

చాంగ్:- అన్నిటికీ మించిన పెద్ద కోర్కె ధనదాసు చేతులకు బేడీలు తగిలించడం. ఇదే నా అభిలాష. ధీరేం ద్రుడు తన చేతిని కరస్పర్శకై అందిచ్చారు. ఆ తర్వాత చెప్పసాగాడు — చాంగ్ భాయీ, మీ విషయంలో నే నెంత గానో విన్నాను. మిమ్ము గురించిన అనేక అద్భుత విషయా లను చదివాను గూడా. నేను నేడొక విచిత్ర యాత్రా సంద ర్భంలో — లోగడ యీ ఆశ లేకపోయినా — మీతో కలిసి వస్తున్నాను. బాల్యంలో శంభుతో చెప్తూండినట్లుగానే ఈనా డొక అజ్ఞాత దిశకు వెళ్తున్నాను; నా జీవితంలో అన్నింటినీ మించిన అద్భుతానుభవములను పొందడానికి వెళ్తున్నాను.

ఈ సమయంలో చాంగ్ నేత్రాల్లో ఆనంద భాష్పాలు ప్రవహించినాయి. చేతిగుడ్డతో వాటిని తుడుచుకొంటూ అన్నాడు — మనం వాళ్లను అవసరమైనప్పుడు హెచ్చరిస్తూ వుండాం; ప్రోత్సహిస్తూ వుండాం.

కాహిరా స్టేషన్‌లోనే చేలారామ్ గుమస్తా 'భల్లా' మమ్మల్ని కలుసుకొన్నాడు. అక్కడనుండి నలుగురం వారి గదికి వెళ్లాం.

# 9 కాహిరానుండి సూచీ పర్వతం వరకు.

మేము యాత్రకు సంబంధించిన యేర్పాట్లలో మూడు వారాలపాటు కాహిరాలోనే వుండిపోయాం. హృదయనాథ్ మా కొరకు సూడానీలను, అరేబియనులను, మాట్లాడి వుంచారు. ఒక రోజున అడుగుభాగం వెడల్పుగల నావపై నైలునదిలో ప్రయాణం సాగించాం. అసవన్ మీదుగా ఖర్తూమ్ వెళ్ళాలని మేము నిశ్చయించుకొన్నాం.

యీ మిశ్రదేశం యొక్క గంగా సౌందర్యాన్ని వర్ణించడానికి ఒక ప్రత్యేక గ్రంథం కావాలి. పవిత్రమైన సరస్వతి నది ఒడ్డున వేదకాలపు ఋషులు, మునులు తమ యొక్క అనేక రకాలైన ధర్మానుష్ఠాలను నెరవేరుస్తున్నట్లు గానే, పవిత్రమైన నైలునది ఒడ్డున చిరకాలంగా, ప్రాచీన మిశ్ర దేశీయుల ధార్మిక, సాంఘిక కార్యాలన్నీ జరుగుతూం డేవి. ఎంత సౌందర్యం! ఎంత విచిత్ర దృశ్యం!! నైలునదీ తీరాన్నుండి ఆ ఎడారి దృశ్యాన్ని చూడనివారు ప్రపంచంలో ఒక సాటిలేని దృశ్యాన్ని సందర్శించలేక పోయారన్నట్లు

తోస్తుంది. నీటి తీరాలపై వంగివున్న ఖర్జూరపు చెట్లు, నదీ దేవత శోభోద్యానపు జలధారలకువలె వుంటాయి. అచెట్లు తమ ఆహ్లాదకరమైన ఛాయలను మండిపోతున్న ఇసుకమీద ప్రసరింపజేసి తమ నిస్వార్థ పరహితైషితను ప్రదర్శించుకొంటున్నాయి. దారిద్ర్య దేవతచే పీడింపబడు గ్రామ బాలురు — తరచు దిశ మొలలతోనే తిరుగుతూంటారు — నావ వస్తూండడం చూచి డబ్బులడుక్కోడానికి తీరానికి పరుగెత్తుకొస్తారు. మార్గ మధ్యంలో ప్రాచీన సభ్యతను ప్రస్ఫుటింపజేసే సిథిలావశేషమైన దేవాలయాలూ, త్రవ్వి తీయబడిన పురాతన నగరాల గోడలూ, భయంకరమైన స్త్రీ ముఖాకృతిగల సింహాలూ, పిరమిడ్లూ, నలువైపులా అంతులేని ఇసుక పర్రలూ, వాటి మధ్యలో దూరాన ఏదో సస్యశ్యామలంగా వుండే భూమి మొదలైన ఎన్నో అద్భుత దృశ్యాలు ఎదురు వస్తున్నట్లుగా వుంటాయి. ఒక్కొక్క చోట దూరప్రయాణాలు చేసే ఒంటెల గుంపులు వసర వసలుగ పోతున్నట్లు కన్పిస్తుంటాయి. సూర్యాస్తమయ సమయపు ఆ రక్తిమ ప్రకాశించి పోతున్న నక్షత్రాలతో తళతళ మెరసే ఆ నీలిమరాత్రి, సాయంసమయంలో ఆ ఎడారిలో కన్పించే ఆకాశపు ఐంద్రజాలిక దృశ్యం మొదలైనవన్నీ అద్వితీయంగా వున్నాయి. ఆ భయంకరమైన నగ్నపర్వతాలు రెండువైపులనుండి దగ్గరకు వస్తున్నట్లుగానూ, మమ్మల్ని సర్వనాశనం చేసే ప్రయత్నంలోనే వున్నట్లుగానూ తోస్తుంది. మేమప్పుడు గర్జించుతున్న నీటిలో పడిపోయేవాళ్లం. మేమెన్నో జలపాతాలను దాటుతూ, మండిపోతున్న ఆ దక్షిణాదిశకు — ఆఫ్రికా గర్భం

లోనికి వెళ్తున్నాం. ఇలాంటి విచిత్రయాత్ర చేసే మహాభాగ్యం చాలా తక్కువ మందికే లభిస్తుంది.

ఖాస్తామ్ చేరుకుని ధీరేంద్రుడు రెండు చిన్న నావలను తయారు చేశాడు. వీటిమీద మేము సోబాత్‌ను నిర్గమించ దల్చుకొన్నాం. మేము యాత్రా సందర్భంలో మొదట్లోనే ఆలోచించుకొన్నాం. మా మార్గం అజక్ గ్రామం వరకు సుగమంగా వుంటుంది. నేటివరకూ ఏ ఇతర ప్రాణీ అక్కడనుండి ముందుకు అడుగు వేయలేక పోయాడు. అటుపైన మేము అజ్ఞాత ప్రదేశంలోకి చొచ్చుకు పోతాం. శివనాథుని చిత్రపటంలో వున్న ఒక గ్రామానికి ముందు భాగంలో ఒక జలపాతం వుంటుంది. దాని తర్వాత పేరులేని ఒక వుపనది దక్షిణ పశ్చిమాలనుండి వచ్చి సోబాత్ లో కలిసిపోతుంది. ఇరవై క్రోసులు ముందుకు వెళ్లి సమకోణంగా తిరుగుతుంది. అక్కణ్ణించి అది తూర్పు దక్షిణాలవైపుకు ప్రవహిస్తుంది.

ఈ వుపనది మలుపులోనే సంకేత పర్వతాలున్నాయి. దీన్నిగూర్చి శివనాథ్ తన నోటుబుక్కులో ఎంతో వ్రాశాడు. ఇక్కడనే ధీరేంద్రుడు ఏకగ్రీవంగా మా నాయకుడుగా ఎన్నుకోబడ్డాడు. ఎడారిని దాటడానికి ఇక్కడినుండే ఏర్పాట్లు చేసుకోబడ్డాయి.

నదీ ప్రయాణాన్ని పూర్తిగా వ్రాయడం విసుగు పుట్టించే పని. సోబాత్ నదిలో ప్రవేశించకముందే నాకీ యాత్ర చాల బాధకరమైనదని అనిపించింది. శారీరక బలానికి ధీరేంద్రుడు ప్రతి స్వరూపం. అతడే, దేరాలకు స్థలాలను

ఎన్నుకొంటాడు; భోజనపు యేర్పాట్లు ఆయనే చేస్తుంటాడు. వుదయం అందరికంటే ముందు మేల్కొనడం, రాత్రిళ్లు అందరికంటె ఎక్కువసేపు నిద్రపోకుండా వుండడం ఎప్పుడూ జరుగుతుండేది.

ధనదాసు గూడా చాల శ్రమపడేవాడు. ఎదురు ప్రవాహంలో అవసరమైనప్పుడల్లా నావ త్రాడు బట్టుకొని తీరం వెంట లాక్కుపోవడానికి గూడా సంకోచించేవాడు కాడు. నే నెందుకూ వుపయోగపడేవాణ్ణి కాదని నా శారీరక దుర్బలత్వం సాక్ష్య మిస్తున్నప్పటికీ నేనుగూడా యేదో ఒక పనిని చేయడానికి సిద్ధంగా వుండేవాణ్ణి. ఇక చాంగ్ మహాశయుడో! ఆయన ఆ మండిపోయే ఎండలోగూడా నిశ్చింతగా పగలంతా నిద్రపోయేవాడు. ఆ అద్భుతవ్యక్తి సంకేతంమీదనే నిద్రాదేవి సంచరించడం నే నెరుగుదును. ఒకొక్కప్పుడు నిద్రబోవడం తప్ప మరోపని చేసేవాడు కాడు; మరొక్కప్పుడు రాత్రింబవళ్లు నిద్రలేకుండా యేదో ఒక పనిలో నిమగ్నుడై వుండేవాడు. అయినా ఒక్కసారి గూడా ఆవలించక పోవడం ఎంత విచిత్రం! ఆయనంటూ వుంటాడు — "పని వున్నప్పుడు నిద్రించడ మెందుకు? పని లేనప్పుడు మేల్కొని వుండడ మెందుకు?" ఇది సిద్ధాంతరూపంలో మంచిదైనా మామూలు వ్యక్తులు ఆచరించడం అసంభవం. చాంగ్ యిలా వుండడానికి [కా]రణం, ఆయన మంచి ఆరోగ్యం, బలం కలిగి వుండడమే.

సోబాత్ నదిలో ప్రయాణం సాగించి ఇంతా మూడు [రోజు]లైనా కాలేదు; నాకు చలిజ్వరం వచ్చేసింది. నేను [మం]చ[ం] ఎక్కక తప్పలేదు. మేమిప్పుడు కాషింరాకు 2000

మైళ్ళ దూరాన వున్నాం. నదీ ప్రవాహం మాంచి వేగంగా వుంది. ఇప్పుడు మేము భూమధ్య రేఖకు సమీపంలో వున్నాం; అంటే అత్యుష్ణ ప్రదేశంలో వున్నాం. అక్కడ చెట్లూ-చేమ చాల తక్కువగా కన్పిస్తుంది. మిట్టమధ్యాహ్నపు సూర్యుడు పెనంలాగ కాలిపోతూంటాడు. మా కాళ్లక్రింద యిసుక స్పృశించడానికి గూడా వీలులేకుండా వుండేది. చీకటిబడ్డ తర్వాతగూడా చాలసేపు అలాగే వుండేది. సూర్యాస్తమయం మొదలు సూర్యోదయం వరకు దోమలు, పురుగులూ యేడ్పిస్తూంటాయి. అవి కుట్టడంవల్ల మాముఖాలు పాడైపోయాయి. మేము ముగ్గురం వాటితో బాధ పడుతున్నా చాంగ్ మాత్రం నావ ముందుభాగంలో కూర్చొని హాయిగా నవ్వుతూండేవాడు.

ముందుకు పోయి - పోయి అనేక రకాల జంతువులతో నిండివున్న ఒక అరణ్యానికి జేసుకున్నాం. నా జీవితంలో యెప్పుడూ అన్ని పక్షులను చూడలేదు. కాస్త తడినేల కన్పడ్డ చోట్లల్లా యీ పక్షులు లక్షలకొలదిగా దిగుతూండేవి. నేను ప్రకృతి శాస్త్రజ్ఞుణ్ణి కానప్పటికీ, జాంఛిల్, చూడాధర్, పవిత్రమైన ఇబిస్ పక్షులను గుర్తించగల్గుతాను. అక్కడ గుంటనక్కలు గుంపులు, గుంపులుగా తిరుగుతుంటాయి. నేనొకసారి యీ గుంపులమధ్య ఒక అడవిపందిని జూశాను. అది తిన ముళ్లదెబ్బతో ఆ సమూహాన్ని చిందర - వందర చేసింది. సింహగర్జనలు విన్పించిన ఆనాటి రాత్రిని, నేను మరచిపోలేను. మాకు చాలసమీపంలోనే ఆశబ్దమొస్తున్నట్లు తోంచి. ఆ శబ్దం చెవుల్లో బడగానే నేను కంపించసాగా

వెంటనే చాంగ్‌ను లేపాను. ఆయన నా సమీపంలోనే నిద్ర పోతున్నాడు.

ఆయన లేచి కూర్చొని ఆలకించసాగాడు. నేను ఆయన గుండ్రని ముఖాన్ని చూశాను. కంటిపాపలు ప్రక్కకు చేసుకొన్నాయి. నోరు తెరచుకొని వున్నాడు. ఆయన తల వూపుతూ "అనేక రకమైన సింహం లే" యని మళ్ళీ పడుకొని నిద్రబోయాడు.

నా శరీరం చల్లబడి పోయిందనిపించింది. నేను భయంతో స్పృహ తప్పినట్లు వున్నాను. నా శరీరం కంపించ సాగింది. నావైపుగా ఒక నల్లనినీడ రావడం చూశాను. నేను కదలనూ లేదు, అరవనూ లేదు.

వెన్నెల్లోకి రాగానే ఆయన ధీరేంద్రుడని గుర్తించాను. నేనాయన మేకపోతు గడ్డాన్ని, చిలుక ముక్కును చూశాను. ఆయన కాళ్ళ - చేతుల సాయంతో జరిగిపోతు న్నాడు. చేతిలో తుపాకి వుంది.

అతను నిశ్శబ్దంగా అడవిలోకి వెళ్ళాడు. ఇంకొంచెం సేపట్లోనే ఆ నిస్తబ్ధ నిశీథంలో ఒక తుపాకశబ్దం వినిపించింది.

అకస్మాత్తుగా ప్రక్కనున్న పొదలనుండి పక్షులు లేచి పోవడం నేను చూశాను. అప్పుడు నాకు మేఘాలు గర్జించినంత ధ్వని విన్పించింది. భూమి అంతా వూగిపోతున్నట్లయింది. గాలి ధ్వనితో ప్రతిధ్వనించింది. ఇది ఆ మృగరాజు అంత్య లక్షణం.

ఒక్క నిమిషంలో డేరాలన్నీ గోలతో నిండిపోయి నాయి. అరేబియనులు ఓపిక వున్నంతవరకూ అరిచారు. సూడానీలు అటూ ఇటూ పరుగెత్తారు. అప్పుడు ధీరేంద్రుడు చంకలో తుపాకితోనూ, నోట్లో బీడీతోనూ ప్రత్యక్ష మయ్యాడు.

ధీరేంద్రుడు ఒకప్పుడు వేటగాడు. తన జీవితంలో అద్వితీయమైన వేటను యీ రాత్రి సాధించాడు. పర్యటకుల యొక్క క్లబ్‌లో సింహంతలను వుంచాలని తన గాఢవాంఛ అయినప్పటికీ ఇది అసంభవమే అయిందని మర్నాడు నాతో అన్నాడు.

తర్వాత 4-5 రోజులకు అజక్ గ్రామానికి చేరు కున్నాం. అక్కడివాళ్లు యెంతో ప్రేమగా స్వాగతమిచ్చి "ఇక్కడినుండి దక్షిణానికి వెళ్ళడం మంచిదికాద"ని అన్నారు. ఎడారికి ఆవైపున ఒక పెద్ద శక్తివంతమైన జాతి నివసిస్తున్నట్లు వాళ్లు చెప్పారు. ఇంతకంటే అధికంగా మాకా గ్రామంలో యేమీ తెలియలేదు. అజక్‌నుండి అరణ్య ప్రదేశం గుండా బయలుదేరాం. ముందుకు బోయినకొద్దీ నదీ ప్రవాహం సన్నంగా వుండి వేగంగా ప్రవహిస్తోంది. మే మిప్పుడు ప్రతి ఒక్కళ్లం నావను లాగవలసి వచ్చింది.

నేనా రోజులు యేనాడూ మరువలేను. పాదాలు బొబ్బ లెక్కినాయి. సగం చచ్చి నడుస్తున్నాం. నా చేతులు బొబ్బలతో నిండిపోయినవి. భుజాలు త్రాళ్లు లాగడంవల్ల పేలిపోయినవి. నాలో యేమాత్రం బలం లేకపోయినా బలవం

తంగా నైనా పనిలో పాల్గొంటూండే వాణ్ణి. నాయీ సాహ సానికి నా మిత్రులెంతో కృతజ్ఞులై వుండేవారని నాకు గుర్తు.

ఇప్పుడు మేము చాంగ్ యొక్క నూతన విధానం చూశాం. ఆయన రాత్రింబవళ్లు కఠోరంగా శ్రమిస్తున్నాడు; అయినా ఎప్పుడూ హాసవదనంతో కన్పిస్తూండేవాడు. "అదిగో ఇక త్వరలోనే శివనాథుడు నోటుబుక్‌లో వర్ణించిన నీవక్ గ్రామాన్ని చేరుకోబోతున్నామ" ని మాటి మాటికి మాకు ప్రోత్సాహ మిస్తూండేవాడు.

మే మిప్పుడు సోబాత్ నదిని దాటి దాని వుపనదిలో ప్రయాణిస్తున్నామని మీరు తెలుసుకోవాలి. అచ్చు పటాల్లో ఎక్కడా దాని చిహ్నం లేదు. దేశం యెగుడు-దిగుడుగానూ, పర్వతమయంగానూ వుంటుంది. నామ మాత్రంగానైనా పచ్చ దనం కన్పించడంలేదు. ఆ గ్రామానికి ముందు భాగాన్నే జలపాతం వుందని మాకు తెలుసు. ఒకనాటి రాత్రి మేము సాగిపోతున్న సమయంలో మాకు దూరంగా ఆ శబ్దం వినిపిం చింది. ఆ చల్లని వెన్నెలరాత్రి ఆనందాన్ని యేమని వర్ణించను.

మేము మా నావలను లాక్కొంటూ జలపాతానికి సమీపంలో చేరాం. నావలోనుండి సామాన్లు వడ్డుకు చేర్చాం. అప్పుడు నేనూ-కెప్టెన్ కొద్దిసేపట్లో నీవక్ గ్రామానికి వెళ్లాం. కాని అక్కడి వాళ్లకు మా అభి ప్రాయాన్ని తెలియజేయడానికి చాల యిబ్బందిపడ్డాం. వాళ్లు పూర్తిగా జ్ఞానసూన్యులైన ఆటవికులు. వాళ్లు నగ్నంగా పుట్టినప్పుడున్నట్లే వున్నారు. మమ్మల్ని చూచి భయపడ్డా, నేను వాళ్లను జూచి భయపడినంతగా భయపడలేదు.

ధీరేంద్రుడు నిస్సంకోచంగా, నిర్భయంగా వాళ్ల దగ్గరకు వెళ్ళాడు. కాని నాకు తెలిసిన అరబ్బీ మొదలైన భాషలేవీ వాళ్లకు తెలియవని ఆయన అర్థం చేసుకున్నాడు. అప్పుడాయన సంకేత భాషలో మాట్లాడసాగాడు. ఈ విషయంలో ఆయన పెద్ద పండితుడు.

అచ్చటి ప్రజలేనాడూ, యే విదేశీయుణ్ణి చూడలేదనడం స్పష్టం. మేము వాళ్లకు ఆరు నకలీ ముత్యాల హారాలను యిచ్చాం. వాళ్లు యిందుకు యెంతో సంతోషించారు. తర్వాత వాళ్ళల్లో యెంతోమందిని తీసికొని మేమూ నావ వద్దకు చేరుకొన్నాం. వారు మా నావనూ, సామగ్రినీ, జలపాతాన్ని దాటించి సురక్షితమైన చోటుకు చేర్చడంలో ఎంతో సాయపడ్డారు.

భయానకమైన ఆ రోజులను గూర్చి ఆలోచించినకొద్దీ నామీద నాకే ఆశ్చర్య మేస్తుంటుంది. మేము ఆ గ్రామంలో గుండా వెళ్తున్నప్పుడు మా ప్రాణాలు ఒక్క దెబ్బతో ఎగిరిపోయే అవకాశముందని మాకు బాగా తెలుసు. కాని ధీరేంద్రునికి ఆఫ్రికా ఆటవికులను గూర్చిన మాంచి అనుభవం వుంది "వాళ్ళకు భయపడడం ఆపదను కొని తెచ్చుకోవడమే అవుతుందని" ఆయన అన్నాడు. "మీరు నిర్భయంగా, ఠీవిగా, గుండె నిబ్బరంతో వాళ్లతో మాట్లాడితే కుక్కలవలె తోకలు ముడుచుకొని మీకు సేవకులై పోతారు."

మేము సామానంతటినీ సురక్షిత స్థలానికి చేర్చడానికి చాలాసేపు పట్టింది. రెండోరోజు గూడా మే మక్కడే విశ్రమించి ఆ గ్రామవాసుల్లో కొందర్ని మిత్రులుగా చేసు

కొన్నాం. ఆనాడా గ్రామంలోనే స్త్రీలు, పురుషులు అందరూ మమల్ని చూడడానికి వచ్చారు. బంగారు పనితనంగల నా కళ్లజోడు వాళ్లకు మరీ ఆకర్షణ వంతమైంది.

నే మిప్పుడు నదీ యాత్రలో చివరకు చేరుకొన్నాం. ఇక్కడ ప్రవాహం వేగంగా వుండడమేగాక, నది గట్టు మెత్తగా వున్నందున నావలను లాగడం మరీ కష్టంగావుంది. మా లక్ష్యం సంకేత పర్వతం. అక్కడకు చేరడానికి అందరి కంటే నేనే అలవిమాలిన వుత్సాహంతో వున్నాను. ఎందు కంటే ఎక్కువ కాలంపాటు నేనీ నావను లాగలేను; అదీగాక సంకేత పర్వతం ప్రాచీన మిశ్రదేశీయ సభ్యతకొక చిహ్నం.

ఒకరోజు వుదయం మేము అకస్మాత్తుగా ఆ పర్వత లోయ గుండా బయటకు వెళ్లాం. అక్కడ మా కెదురుగా సంకేత పర్వతం కన్పించింది. అప్పుడు నా ఆనందానికి హద్దులేక పోయింది.

అక్కడ మాకు అన్ని విషయాలు శివనాథుని నోటు బుక్కులో వున్నట్లుగానే లభించినవి. అజిక్, అజ్ఞాత వుపనది, జలపాతం, నీవక్ గ్రామం-ప్రతి ఒక్కదానినీ మేము క్రమంగా చూశాం. నా వుద్దేశ్య ప్రకారం సెరాఫిస్ సమాధి, మితనీ నగరాలు విలసిల్లుతూన్న వనడానికి అన్నిటికంటె పెద్ద నిద ర్శనం యీ సూచీపర్వతమే శివనాథుని కథానానుసారం గానే యీ పర్వతం ముల్లంగిదుంప ఆకారంలో మలచబడి వుంది. మేమా రాత్రికి పర్వతపు టడుగుభాగానికి చేరు కొన్నాం. రెండోరోజు 7 గంటలకే నేను ధనదాసుతో పాటు

రెండవ వైపుకు చేరుకొని పర్వతం యెక్కాను. అక్కడ యేదైనా శిలాశాసనం వుంటుందని నేను ఆశించాను; కాని ఆ ఎడారి తుఫాను అక్కడేమీ మిగల్చలేదు. మార్గ సూచన చెక్కబడివున్న రాయి యెంతో మెత్తటిదైవున్నా యిన్ని శతాబ్దాల తర్వాతకూడా సురక్షితంగా వుండడం మాకు చాల ఆశ్చర్యాన్ని కలిగించింది. ఇక్కడినుంచి మా ప్రయాణం, దక్షిణ పశ్చిమాలవైపు సాగించాల్సి వుంది. ఎడారికి చేరుకోబోయేముందు పొదలతో నిండిన పర్వతప్రాంతాన్ని దాటవలసి వుంటుందని మా వద్దనున్న నోటుబుక్కు, మ్యాప్‌ల వల్ల తెలిసింది. ఆ మ్యాప్‌మీద శివనాథుని శబ్దాలున్నవి — "అక్కడ, యీ సైకతభూమిపై సూర్యుడు బట్టీవలె భగభగ మండుచుండును."

ఇక యిక్కడినుండి మేము నదీ తీరాన్ని వదిలిపెట్ట వలసివుంది. ఇప్పుడు మాకెదురుగానే పురాతన నాగరికతను, పునఃస్మృతి కలిగించే మితనీనగరం, బ్రహ్మాండంగా వర్ణించబడిన సెరాఫిస్ ధనాగారం వున్నవని మాకు రూఢి అయింది. అయినప్పటికీ మాకూ, మా గమ్యానికీ మధ్య భయంకరమై, నిష్ప్రముద్ర రూపంగావున్న దుస్తరమైన ఎడారి వున్నది. ఏ ప్రదేశంనుండి యీ ఎడారిని, నిర్గమించాలో తెలుసుకోడానికి మావద్ద ఆధారమేమీ లేదు. పర్వాత భాగాన్ని దాటి ఆ ఎడారిలో అడుగు పెట్టడమంటే మృత్యుముఖంలో ప్రవేశించడమే. మా కవసరమైన గుడ్డలు-గట్రా, సామాను-అన్నీ మా వీపుల మీద వేసుకొని మరీ వెళ్లాలి. ఎడారిలో ఏమూలన్నా నీటి చుక్క దొరుకుతుందేమోనని నోటుబుక్కంతా వెదకాం;

కాని వృధాప్రయాసని తేలింది. ఆ ఎడారిలో ఎక్కడా తడి నేలగానీ, పచ్చని భూమిగానీ శూన్యం. మేము దాన్ని గూర్చి ఆలోచించినకొద్దీ యింకా ఎక్కువ దుస్తరంగా కన్పించసాగింది. మాలో ధీరేంద్రునిలాంటి బలిష్ఠులెవరూ లేరు. మేమందరం ఆయన ఆజ్ఞలకోసం కాచుకొని వున్నాం. మేము సూచీ పర్వతాలవద్ద వున్న రెండువారాల్లో ఆయన చాల మితంగా మాట్లాడేవాడు. ఎప్పుడూ ముందున్న యాత్రను గురించిన ఆలోచనల్లోనే మునిగి వుండేవాడు.

అప్పుడు మా సూడానీ, అరబ్బీ సేవకులు ఇకపైన మా వెంట రావడానికి నిరాకరించారు. నీవక్ లోనే వారందరూ అనేక గాలివార్తలను విన్నారు. ఇప్పుడిక్కడ తామంతా ఒక భయంకరస్థితిలో పడిపోయినట్లనుకొన్నారు. ఇక తిరిగి వెళ్లే ఆదుర్దాలో వున్నారు. "మిమ్మల్ని యెడారి ఆవలి వైపుకు యేమాత్రం తీసుకవెళ్లం; కాని మీరు వెళ్లకముందే మాకు కొన్నిపనులు చేసిపెట్టాలి. ఆ తర్వాత మీరొక నావ తీసుకొని సంతోషంగా యిళ్లకు తిరిగిపోవచ్చు" అని ధీరేంద్రుడు వాళ్ళతో చెప్పాడు.

ధీరేంద్రుడు రెండు రోజులపాటు దగ్గరగావున్న పర్వతప్రాంతంలో వేటలో నిమగ్నమయ్యాడు. వేటకు పనికివచ్చే జంతువులచ్చట పూర్తిగా వున్నవి. ఆయన సాయంకాల మయ్యేసరికి ఎన్నో చిన్నరకపు లేళ్లను చంపి తీసుకొచ్చే వాడు. వాటి చర్మం వొలిచి ఎండబెట్టి, దానితో చిన్నచిన్న సంచులు చాల తయారు చేశాడు. నేను ధీరేంద్రునియొక్క శీఘ్రచలనగతిని చూస్తూ ఆశ్చర్య పోతుండే వాణ్ని.

ఈ సాదా తోలు సంచుల్లో నదినీరు నింపబడింది. తర్వాత ధీరేంద్రుడు, ధనదాసు, మరి నలుగురు సూడానీలు ఎడారిదిశగా వెళ్లారు.

వాళ్లు 3 రోజులపాటు మాయమయ్యారు. నేనూ – చాంగ్ మాత్రమే డేరాలలో వున్నాం. నేను నా డైరీ వ్రాస్తున్నాను. పర్వతంమీది "సూచిక"ను గూడా పరీక్షిస్తున్నాను. దాని విషయంలో నాకు కొన్ని వుపయోగకరమైన విషయాలు తెలిసినవి. నేను వాటిని నోట్ చేసుకొన్నాను గూడా. చాంగ్ మహాశయుడు మాత్రం నదిఒడ్డున కాళ్ళు ఆరజాపుకొని చేతులు పొట్టమీద పెట్టుకొని ఎప్పుడూ నిద్రపోతూండేవాడు. మేమిప్పుడు చాల సురక్షిత ప్రదేశంలో వున్నట్లు ఆయన భావిస్తున్నాడేమోనని అనిపిస్తోంది. కాని నా అభిప్రాయ మదికాదు.

ధీరేంద్రుడు తిరిగి వచ్చినప్పుడు తన ప్రథమ యెడారి పోరాటాన్ని గురించిన సంతోషంతో వున్నట్లున్నాడు. వాళ్లు ఎడారి ప్రారంభంలో కొండలవద్ద ఒక నీటి తోలుసంచిని పూడ్చి పెట్టారు. రెండవ సంచిలోని నీళ్ళు త్రాగి విశ్రమించారు. రెండవరోజు సూర్యోదయానికి ముందే అందరూ కలసి దక్షిణ వాయంతో మిగిలిన నాలుగు తోలు నీటిసంచులను తీసికొని ఎడారిపై దండెత్తారు. మధ్యాహ్నానికి వాళ్ళొక సంచిని యిసుకలో పూడ్చిపెట్టి గుర్తుగా పెద్ద యిసుకదిప్ప పోశారు.

ఆరోజున వాళ్ళు 5 వ సంచిని ఖాళీచేశారు. ఇంకో సంచి వుంచుకొని తిరిగి వచ్చారు. వాళ్ళు నదీ తీరానికొచ్చి

నప్పుడు అలవిమాలిన దప్పిక గొన్నారు. వారు నదిఒడ్డును చేరి చేతులూ— కాళ్లూ ఆనించి జంతువుల్లాగా నీరు త్రాగారు.

ధీరేంద్రుని రెండవయాత్ర మొదటి దానికంటె కఠోరమైంది. ఈసారి ఆయన ధనదాసుతో సహా 4 రోజులపాటు కన్పించకుండా పోయాడు. వారు మధ్యాహ్నే వుదయాన్నే విడచి వెళ్ళారు. ఈ సారి వారి నడక చాల తీవ్రగతివంతమైనది. అందువల్ల అస్తమయానికి ముందే వాళ్ళు పర్వతాన్ని చేరుకొన్నారు. అక్కడ యే మాత్రం బద్ధకించకుండా రాత్రంతా ఎడారిలో ప్రయాణం చేశారు. మరునటిరోజు వుదయం 8 గంటలకు మొదటి క్యాంపుకు చేరుకొన్నారు. ఈ విధంగా ఒక్క నీటిబొట్టైనా త్రాగకుండా 26 గంటలు మండిపోయే ఎండలో ప్రయాణం చేశారు. అప్పుడు వాళ్ళొక సంచిలో నీరు త్రాగి ఆ మండే యిసుక మీదనే పండుకొన్నారు. తీవ్రమైన సూర్యకిరణాలు నిరంతరం వాళ్ళమీద పడుతూనే వున్నాయి. ధీరేంద్ర - ధనదాసు లిద్దరూ కాకుల రూపమెత్తారు. సూడానీలు గూడా ఎండకు చాల బాధపడ్డారు. అస్తమానం గాక ముందే మళ్ళీ ముందుకు సాగారు; కాని మార్గం మరచిపోయారు. రెండో మజిలీని ఎంతో ప్రొద్దెక్కిన తర్వాత గాని తెలుసుకోలేక పోయారు.

దప్పికతో వాళ్ళెంతో బాధపడ్డారు. వాళ్లు రెండు సంచుల నీళ్లు త్రాగేశారు. సూడానీలు రాత్రికి యిక ముందుకు సాగడానికి తిరస్కరించారు. అప్పుడు ధీరేంద్రుడు ఒంటరిగా ఒక సంచిని తీసుకొని ముందుకు బయలుదేరాడు.

అర్ధరాత్రికి దాని నొకచోట పాతిపెట్టి వుదయం 8 గంటలకు తిరిగి అనుచరులను కలుసుకొన్నాడు. ఆయన తన పద చిహ్నాలను చూసుకొంటూ ఆ తీవ్రమైన ఎండలోనే తిరిగి వచ్చాడు. ఇక యిప్పుడు వారివద్ద రెండు సంచుల నీరు మాత్రమే నిల్వ వుంది. వాటిలో ఒక దానిని ఎడారి మొదటి మజిలీవద్ద త్రాగారు; రెండవ దానిని కొండలవద్ద. వాళ్లు సంకేత పర్వతం చేసుకొన్నప్పుడు నరకాన్నుండి యిప్పుడే దిగి వస్తున్న భయంకర కింకరులా అనిపించింది. ముఖం నల్లబడి, పెదిమలు పగిలి, కళ్లు పీక్కుపోయి చాలా భయంకరంగా వున్నారు.

రెండవరోజు నౌకర్లు ధీరేంద్రుణ్ణి తమ కూలి యివ్వమని అడిగారు. ఒకనావ ఖాళీచేసి కూలి యిచ్చి వాళ్లను పంపివేశాం. వాళ్లెంతో సంతోషంగా నదియొక్క వాలు ప్రవాహంలో తిరిగి వెళ్లిపోయారు.

## 10 "అక్కడ, ఇసుకభూమిపై సూర్యుడు బట్టీవలె భగభగమండుచుండును"

ఇప్పటి పరిస్థితి నాకెంతో భీతావహంగావుంది. మేము ఆఫ్రికా మధ్యలో వున్నాం. సభ్య ప్రపంచం యిక్కడకు యెన్నోవేల మైళ్ళ దూరాన వుంది. ఏదైనా ఆపదవస్తే సహాయం చేసేవాడెవడూ లేడు. మేము మా సమాచా

రాన్ని సభ్య జగత్తుకు తెలియజేసే సాధనమేమీ లేదు. తరచు రాత్రి యెంతో ప్రొద్దుబోయేవరకు నిద్రాశూన్య హృదయంతో, ఆ జనశూన్య ప్రదేశంలో, యెన్నో సంకల్ప – వికల్పాలలో నిమగ్నమై వుండేవాణ్ణి. కాని ధీరేంద్ర, చాంగ్, ధనదాసుల్లో యే ఒక్కరూ ఒక్క క్షణమాత్రమైనా యీ ఆపదలను లెక్క-జేసేవాళ్ళు కాదు.

మేము మా వెంట యెన్నో సంచులు తెచ్చాం. ఆ సంచుల్లో తుపాకిగుళ్ళు, మందుల పెట్టె, కొన్ని పాత్రలు, కొద్దిగా తినుబండారాలు, కెప్టెన్ కళ్ళద్దాల పెట్టె, చాంగ్ యొక్క "భానుమతీ పిటారీ" ఇంకా ఎన్నెన్నో వస్తువులు ధీరేంద్రుడు పయోగకరమనుకొన్నవన్నీ దుర్భిణీ, దిక్సూచీ మొదలైనవిగూడా పెట్టాం. ధనదాసు చేతిలో తన పినతండ్రి నోటు బుక్కులు వున్నవి. మాకు సారథ్యం చేసి నడిపించే కెప్టెన్ చేతిలో మ్యాప్ వుంది. నా చేతిలో "గోబరైలా" వుంది. అప్పటి మా ఆకారాలు మానవ స్వరూపాలకంటే బరువులు మోసే జంతువుల్లాగా వున్నవనడం మంచిది. ఒక నాటిరాత్రి ప్రొద్దుబోయిన తర్వాత మేమందరం ధీరేంద్రుని వెంట ఆ భయంకర యాత్రకై బయలుదేరాం.

సూర్యోదయ సమయానికి మేం కొండల్లోనే వున్నాం. యుక్తిగల ధీరేంద్రుడు ఇక యెండలో సాగనివ్వలేదు. మే మచ్చట వేడి-వేడి కూర - అన్నం తిన్నాం. కేవలం గొంతు తడుపుకోవడానికి మాత్రం తోలు సంచిలోని నీరు వాడుకోవడానికి అనుమతి వుంది. మా వెంట మూడు తోలు సంచులున్నాయి. ఒక్కటైనా నన్ను తీసుకరమ్మనక పోవడం నాకు

ఖేదం కల్గిస్తూంది. చీకటి పడగానే మళ్లీ ముందుకు సాగాం. సూర్యోదయానికి రెండు గంటలు ముందుగానే కొండ క్రింది భాగానికి చేరుకొన్నాం. ఇక్కడ నుండే ఆ మృత్యు సదృశమైన యెడారి ప్రారంభ మౌతుంది.

నేనా రాత్రి కొండ చివరిభాగం - ఎడారి ప్రారంభం-లోవుండి ఎదురుగా వున్న దృశ్యాన్ని చూశాను. అది మరపు రాని దృశ్యం. పశ్చిమదిశన అస్తమిస్తున్న పూర్ణిమా చంద్రుని కిరణాలవల్ల యెడారి మొత్తం పాల సంద్రంలాగా కన్పిస్తోంది. అదే సమయంలో మా వెనుకవైపుగా వుషాదేవి వాహనం వచ్చింది; కొద్ది సేపట్లోనే ఒక కాంతిపుంజం ఆ సమతల ప్రదేశంలో వ్యాపించిపోయింది.

సహజంగా వుషస్సు ఎప్పుడో తనవెంట ఆశలను, ఆనందాలనూ తీసుకవస్తుంది. కాని ఆనాటి ప్రభాతం నా హృదయం మీద యెంతో బరువైన నిరాశను ప్రసరింప జేసింది. తూర్పు - దక్షిణ దిశగా దృష్టి కందినంత వరకు యిసుకే యిసుక. పర్వతంగాని, చెట్టుగాని, నీరుగాని, యేమీ లేని సువర్ణ ఛాయతో వెలుగుతున్న మండిపోయే యిసుక.

నేను యెడారికి అటువైపున వున్న పర్వతాలను చూద్దామని వృథాగా నా దృష్టిని సారించాను. నాకా భయంకరమైన యెడారిని చూడడంకంటే మితసీహస్పే నగర మార్గాన్ని సూచించే విగ్రహాల మార్గమే మంచిదనిపించింది. కాని అక్కడెక్కడా పర్వతాలూ లేవు; వాటిపై చెక్కబడ్డ పెద్ద దేవతా విగ్రహాలూ లేవు; ఊహించడానికి వీలు

లేనంతగా వ్యాపించివున్న ఒక సైకత సముద్రం తప్ప అక్కడ మరేమీ లేదు. అది ఒక మృత్యుదేశమో! నిరాశపు ఆల వాలమో!!

పాతిపెట్టిన సంచులు చీకట్లో కనబడవన్న కారణంగా సూర్యోదయం వరకూ మేము అక్కడనే వున్నాం. అది దొరికగానే దగ్గరగా వున్న కాల్వ వద్దకు వెళ్ళాం. అక్కడ ఎండ తగలకుండా రక్షణ వుంది. నీరు చల్లగా లేనప్పటికీ అప్పటి కదే నయమని పించింది.

అదే సాయంత్రం 6 గంటలకు మొట్ట మొదటిసారిగా మేమూ ఎడారిలో కాలు పెట్టాం. మా కెప్టెన్ పద చిహ్నలను చూసి ముందుకు సాగడం తేలికగా వుంది. వెన్నెల్లో పద చిహ్నలు మాకు బాగా కన్పిస్తున్నాయి.

ఈ యాత్ర చాల కష్టంగా వుంది. గిలకల వరకూ మా కాళ్లు యిసుకలో కూరుకు పోతున్నాయి. మధ్యలో శ్వాస పీల్చుకోడానికి, సంచిని మార్చుకోడానికి మాత్రమే నిలబడతాం. కాని నీరు త్రాగడం కఠినంగా నిషేధించ బడింది. అర్ధరాత్రి సమయంలో గూడా యిసుక తాకడానికి సయితం వీలులేనంత వేడిగా వుంది.

మాకు తేలిగ్గా మొదటి మజిలీ చోటు దొరికింది. ఇసుక కప్పులో వుంచబడ్డ నీటి సంచిని బయటకు తీసి కొద్ది నీరు మాత్రమే త్రాగి నిద్రపోవడానికి యిసుక మీద పడు కొన్నాం. తీవ్రమైన దినకరుని కిరణాలు మమ్మల్ని నేలు కొల్పినవి. అక్కడెక్కడా నీడ లేదు. అది యెడారి కాదు,

మంచుతోన్న బట్టే. అలసి సొలసి అక్కడ నిర్జీవంగా పడి వున్నానే గాని, ఆ సహించరాని ఎండలో నిద్రించేదెలా?

అక్కడ యిసుకలో యెన్నో కీటకాలున్నాయి; ఎన్నో పురుగులు కన్పించకుండా కదులుతున్నాయి. కళ్లు మూసుకొని నేను నెల్లికలా పడుకొన్నానే గాని తప్తలోహంలా వున్న సూర్యుని కిరణాలు నాలుకలు కోరుతూ నా చెక్కిళ్ల మీద పడుతున్నాయి.

ధీరేంద్రుడు మమ్మల్ని నీరు త్రాగనివ్వలేదు. మేము చివరి నీటి సంచి వద్దకు వెళ్ళేవరకూ యీ మూడు సంచుల్లో నీటిని వాడనే రాదని ఆయన అన్నాడు. అది ఎంత దూరాన వుందో ఆయన చెప్పలేక పోయాడు. మేము కేవలం విధిని నమ్ముకోవాల్సిందే గాని, జీవితాశ మాత్రం లేదు. ఈ భయంకరమైన నిర్జన ఎడారిలో మా నొసట ప్రాణాలు వదలాలని వ్రాసివుందో, లేక కష్టాలను అనుభవిస్తూ ప్రాణాలతో ఆ భయంకర ఆసీస దేవతా విగ్రహాల వరకు చేరుకోవాలని వుందో.

ప్రొద్దుగూకే వేళకు మిగిలిన నీటిని త్రాగడానికి అనుమతి వచ్చింది. నీళ్లు వేడిగా వున్నప్పటికీ మా దప్పిక తీరింది. అప్పుడు ధీరేంద్రుడు "మనమిప్పుడొక పరుగు పట్టాలని" అన్నాడు ఈ రాత్రికి మా శక్తినంతా వడ్డి ముందుకు వేగంగా సాగిపోవాలి.

సాయంత్రం 7 గంటలకు చల్లగా వున్నప్పుడు మేము బయలుదేరాం. మేము ఒకే పంక్తిగా నడుస్తున్నాం. అందరి కంటె ముందు ధీరేంద్రుడూ, తర్వాత ధనదాసు, నేనూ,

చాంగ్ మహాశయుడు. ధీరేంద్రుని అడుగు చాలా పెద్దది. ఆయన అడుగుల గుర్తులు చూసుకొంటూ పెద్ద పెద్ద అంగలు వేస్తున్నాడు. 2-3 మార్లు ఆయన మధ్యలో పాడటం గూడ ప్రారంభించాడు. కాని నాకు పాటలెందుకు? పాడడమెవరికి పట్టింది? పాట వినడంగూడా విషతుల్యంగా వుంది. నేనిప్పుడు పడతానా, యిప్పుడే పడిపోతానా అనిపిస్తుంది. నా రోమ రోమం భయంకరమైన వ్యథతో నిండిపోయింది.

కాని నేనేమాత్రం తగ్గినట్లు కన్పించగూడదని గట్టిగా నిశ్చయించుకొన్నాను. శారీరక బలానికి వున్నంత విలువే స్థిరనిశ్చయానికి గూడా వుంటుందని నాకు తెలుసు. 11 గంటలౌతుండగా మేము 2వ మజిలీకి చేరుకొన్నాం. మాకక్కడ మూడో నీటి సంచి దొరికింది. "ఆగకుండానే ముందుకు సాగలి" అన్న కెప్టెన్ ఆదేశం విని నా హృదయం కలతజెందింది.

మేము యీ నీటి సంచిని గూడా వెంట తీసుకెళ్ళాలి. ఎడారి చివరకు చేరేసరికి మావద్ద 4 నీటి సంచులుంటాయి. నేను దుర్బలుణ్ణి, దమ్ము బట్టలేని వాణ్ణయినప్పటికీ ధీరేంద్రుని మీద యీ బరువుగూడా వేయడానికి మనసొప్పలేదు. నేనా సంచిని తీసుకొన్నాను.

ఏమైనా నా శరీరంకంటే గుండె బలమైనది. అయినా ఒక అరగంట ప్రయాణం చెయ్యగానే సారాయి త్రాగిన వాడివలె తూగడం ప్రారంభించాను. నా పైన నక్షత్రాలు నృత్యం చేస్తున్నట్లు కన్పిస్తున్నాయి. ధీరేంద్రుని శరీరం అస్పష్టంగా వుంది.

నేను "మీ యాత్ర సఫలమగుగాక, నన్నిక్కడనే మృత్యుదేవత ఒడిలో వదలి వేయండి, మీరు ముందుకు సాగి వెళ్ళండి" అని చెప్పే స్థితికి వచ్చాను. ఇంతలోనే నా భుజం మీదనుంచి నీటిసంచి దించి వేయబడింది.

చాంగ్ :- దీన్ని నేను తీసుకొస్తాను. మీరు ముందుకు సాగుతూ యాత్రాంతాన్ని గూర్చి ఆలోచించండి. అప్పుడు మనం తేలికగా చేరుకోగలం.

నా వద్ద వాద వివాదాలకు శక్తి లేదు. నేను నా బరువును ఆయనకు వదలివేశాను. వాస్తవంగా, ఆయనలా చేసి రక్షిస్తున్నాడు. ఈ విషయం నాలాగానే ఆయనా భావిస్తున్నాడు.

సూర్యోదయమైనప్పటికీ మేమింకా ముందుకు సాగి పోతూనే వున్నాం. ఇప్పుడు మా ముందు ధీరేంద్రుని (లోగడి) పద చిహ్నాలు మాత్రమున్నాయి. అదృష్టవశాత్తు ఈ మధ్య గాలేమీ కొట్టలేదు; లేకుంటే యీ పదచిహ్నాలు కూడా వుండేవిగాదు.

నడచి నడచి మేము చివరిదైన 4వ నీటిసంచి వద్దకు చేరుకొన్నాం. సూర్యుడు నెత్తిపైకి వచ్చాడు. ఎండ దారుణంగా వుంది. ధీరేంద్రుడు ఆదేశం యివ్వగానే మేము ఆకలిగొన్న తోడేళ్ళలాగ నీరు త్రాగాం.

పగలంతా క్రితం రోజువలె గడచిపోయింది. పురుగులు, దప్పిక, నిద్రంటే విరక్తి, సహించరాని యెండా యెంతో బాధపెడుతున్నవి. కళ్ళపై చేతులు పెట్టుకొని దక్షిణ పశ్చిమదిశగా చూశాం. కాని పర్వతచిహ్నమక్కడ ఎక్కడ?

రేపటి యాత్ర మమ్మల్ని నిరాశాపరులను చేస్తోంది; అక్కడ మృత్యువే అనుమానాస్పదం.

శివనాథుని మ్యాపును నమ్మితే మే మిప్పటికి సగం ఎడారి దాటాం. మ్యాపులో దీన్ని గుర్తించి వుండకపోతే— యీ విషయం దానిలో వేయబడ్డ రంగువల్ల తెలుస్తోంది. మృత్యువు మాకై నిరీక్షిస్తున్న దనుకోవాలి. అక్కడ మృత్యువే వున్నదో లేక వేలకొలది అడుగుల యెత్తున ఆకాశంలో తిరుగుతూన్న గ్రద్దలు - అక్కడ యివిమాత్రమే జీవిత చిహ్నాలుగా కన్పిస్తున్నవి - మాకై ప్రతీక్షిస్తున్నవో!

ఆ రాత్రి చివరి ఝామములో మమ్మల్ని నిద్రించడానికి అనుమతిచ్చి ధీరేంద్రు డెంతో తెలివైన పని జేశాడు. విశ్రాంతి తీసుకోకుండా నేను యిక ఒక్క అడుగుగూడా ముందుకు వేయలేను. ఆ మండుతూన్న ఎండలో నిద్రపోవడ మెలా సంభవం! నేను సంచిలోని మిగిలిన నీరు త్రాగి రాత్రి ఒంటిగంటకు మళ్ళీ ప్రయాణం సాగించాం.

నా బరువును చాంగ్‌ను మోయనిచ్చాను. నేను మోయడానికి ప్రయత్నించడం తెలివితక్కువే ఔతుంది. మావద్ద యిప్పుడు నీళ్ళు 4 సంచులున్నవి. కాని ఎదురుగా ఎడారి ఇంకెంత దూరం వుందో యేమాత్రం తెలియదు. ఇది మృత్యుదేవతతో ఆడే ఒక జూదం. నేను ధీరేంద్రుని ముఖంవైపుకు చూశాను. ఇందులో ఆయనకు ఆనందం కలుగుతున్నట్లు ఆయన కళ్లు చెప్తున్నవి. ఇంద్రజాలికుడు కత్తులు-కటారులతో ఆడుకొన్నట్లుగానే విపత్తులతోనూ, మృత్యువుతోనూ ఖేలనం చేసే వ్యక్తి ధీరేంద్రుడు.

సూర్యోదయ సమయంలో మాకు విశ్రాంతి తీసుకో మని ఆదేశమొచ్చింది. కొంచెం నీళ్లు తాగి కొన్ని గంటల పాటు విశ్రమించాం. తర్వాత పగలంతా అదే సహించరాని ఎండ, అదే భయంకరమైన వేడిజ్వాలలు.

సాయంకాలం మళ్ళీ ప్రయాణం సాగించాం. నేమూ రాత్రంతా కొన్ని క్రోసులు నడిచాం. ఎండ రాకముందే కొంత విశ్రాంతి, నిద్ర పోదామనీ తెల్లవారుఝామున 3 గంటలకే ప్రయాణం విరమించాం. ఆ రోజు వుదయం చాంగ్ తెస్తున్న నా సంచిని ఖాళీచేశాం. ఆయనవైపుకు జూచి ఎంతో కష్టపడ్డాడని నేను గ్రహించా. ఈ కొద్ది రోజుల్లోనే ఆయనెంతో తగ్గిపోయాడు. కళ్ళల్లో ఆ మెరుపు లేక పోగా, వాటి చుట్టూ నల్లని ఆకార మేర్పడింది.

తర్వాత మూడు రోజులూ పూర్వం వలెనే మా యాత్రను కొనసాగించాం. రాత్రుళ్ళందు, వుదయం కొన్ని గంటలు మాత్రం ప్రయాణం చేస్తూనే వున్నాం. ధీరేంద్రుని ఆజ్ఞానుసారం మేము కొద్దికొద్దిగా మాత్రమే నీళ్ళు తాగు తున్నాం. ఆ రోజుల్లో నా నాలుకమీద ముళ్లులాగా గుచ్చు కోవడం, ఏవో ముక్కలు నోట్లో పెట్టినట్లుగానూ వుండేది. నాలుక సర్వదా అంగిలికి అంటుకొనే వుండేది.

మేము యెడారిలో ముందుకు సాగి పోతున్నకొద్దీ, యెండ సహించరానంత తీక్షణంగా వుంది. తోలుసంచులలో నీరు ఖాళీ అవుతోంది; మేము వాటిని పారవేస్తూ బోతున్నాం. మొదట చాంగ్ సంచి, తర్వాత ధనదాసు సంచిన్నీ. ఈ

విధంగా 6వ రోజుకు ఒక ధనదాసు సంచిమాత్రమే మిగిలి వుంది.

మా పని యిప్పుడు జీవన్మరణ సమస్యగా వుంది. మేమప్పుడు ప్రాణాలకు తెగించి అంతిమ ప్రయత్నం చేయా లని దృఢంగా నిశ్చయించుకొన్నాం. మేమా రోజు పగలు 3 గంటలకే బయలుదేరాం. సూర్యకిరణాలు అలాగే తీక్ష ణంగా వున్నవి. శ్రమబిందువులు ప్రవహిస్తున్నా ఒకరి వెనుక ఒకరం, ఎవరికి వాళ్ళనే శరీరాన్ని యీడ్చుకొంటూ వెళ్తున్నాం,

సూర్యాస్తమయ సమయంలో ధీరేంద్రుడు తలొక గ్లాసు నీళ్ళు యిచ్చాడు. అవి వేడిగా సలసలా కాగిపో తున్నవి. మా కఠోర సేనాపతి మమ్మల్ని విశ్రాంతి తీసుకోవ డానికి అనుమతించలేదు. "ముందుకు సాగి పోతూండకపోతే యిక్కడే మరణించవలసి వుంటుంద"ని ఆయన అన్నాడు.

ఆ రాత్రి, వేడిగా వున్నప్పటికీ తడివాయు వొకటి వచ్చింది. దక్షిణంనుండి వచ్చిన ఆ వాయువు యిసుక నొక్కసారిగా లేపేసింది. మా కళ్లూ, ముక్కులూ యిసు కతో నిండిపోయినవి. నోరు తెఱచివుంటే అదిగూడా నిండి పోయేదే.

ఎన్నో గంటలు గడచినాయి. ఇదొక భయానకమైన మహా ప్రయాణం. సగం పిచ్చివాడుగా నేను ముందుకు దొర్లుకు పోతున్నాను. నా అంగ ప్రత్యంగాలు శిథిలమైపోయి నవి నా తలలో ఆలోచించే శక్తి యే మాత్రం లేదు. నేనొక

యంత్ర తుల్యంగా ముందుకు అడుగులు వేస్తున్నా. వెనుక నుండి నన్నెవరో నెట్టుకు పోతున్నట్లుంది.

అప్పుడు తూర్పు దిశన, (క్షితిజంలో) వుషస్సు ప్రథమ దర్శన మిచ్చింది. ధీరేంద్రుని నోటివెంట మాట రావడమే ఆలస్యం మేము మా సంచులనూ, తుపాకులనూ, అలసి యున్న మా శరీరాలనూ ఆ యిసుకమీద విసరివేశాం.

ఆ హృదయ విదారక ప్రాతఃకాల సూర్యోదయాన్ని నేనెప్పుడూ మరువలేను. వెలుగు వ్యాపించగానే వృక్ష హీనమూ, ప్రాణిచిహ్న శూన్యమూలైన అదే దిగంతమైన యిసుక సముద్రం మాకు గోచరించింది. ఇప్పటికీ దక్షిణ వాయువే వీస్తున్నది. ఇప్పటికీ నాలుగు బారల ఎత్తుగా గాలిలో పొగమంచువలె యిసుక గోడలు తెల్లగా నలు వైపులా వ్యాపించి వున్నవి. అయినప్పటికీ పొగమంచుకు పై భాగాన వున్న వాయువు స్వచ్ఛమైన దవడంవల్ల మేమెంతో దూరం చూడగల్గుతున్నాం. ఎన్నో క్రోసుల దూరాన దక్షిణ-పశ్చిమ దిశగా గోడవలె వున్న ఒక కొండను తప్ప మేమేమీ చూడలేక పోతున్నాం. ఇదే ఆ ఎడారి అంత్యభాగం. ఇదే మా మహాతపోఫలం. మేము నిర్బలం గానూ, జీవన్మృతుల వలెనూ వున్నప్పటికీ ఒక్కసారి ఆనం దంతో చప్పట్లు కొట్టకుండా వుండలేకపోయాం.

అయినా మేమింకా ఆపదల నన్నింటినీ అధిగమించి గట్టెక్కలేదు; ఎందుకంటే మేము పర్వతాల వైపుగా చూస్తున్నప్పుడే గాలివేగం హెచ్చినట్లుంది; దక్షిణ దిశ కేసి

చూసినప్పుడు యెడారికి పైభాగంలో యేవో మేఘాల వలె కన్పించింది.

ధీరేంద్రుడు త్రాగడానికి కొద్దిగా నీరు యిచ్చాడు. తర్వాత కొద్దిసేపట్లోనే ప్రొద్దుగ్రుంకింది. అటుపైన మే మొక యిసుక తుఫానులో పడిపోయాం.

కళ్ళు తెరచి చూస్తే అంధులమైపోతాం. నోరు తెరస్తే గొంతువరకు యిసుక క్రుక్కుకపోతుంది. మేం గ్రుడ్డివాళ్ళం, మూగివాళ్ళం అయ్యాం. మేమందరం ఒకళ్ళమీద ఒకళ్ళం కప్పుకొన్నట్లు పండుకొన్నాం. ఆ భయంకర స్థితిలో ఆ రోజంతా అలాగే అక్కడే పడివున్నాం; మాకు లేచే శక్తి గూడా లేదు.

ఈ తుఫాను 36 గంటలు నిరాటంకంగా సాగింది. ఇంత సేపట్లో మా వద్దనున్న నీళ్ళలో చాలభాగం త్రాగివేశాం. రాత్రిపూట మేము బయలుదేరినప్పుడు మా మూటల బరువు పెరిగినట్లనిపించింది. వాటి చిన్న - చిన్న రంధ్రాల ద్వారా ఎంతో యిసుక లోపలకు పోయింది.

సూర్యోదయానికి పర్వత భిత్తిమాకు దగ్గరలో వున్నట్లు కన్పించింది. అయినా యింకా కొన్ని మైళ్ళదూరంలో వుంది. మా అందరి శక్తీ అంత్య దశకు చేరుకుంది. నా వంటి శవప్రాయుల్లో సయితం తన పురుషత్వంతో ప్రాణాలను నింప గల శక్తివంతుడైన ధీరేంద్రుడు గూడా కంకాళప్రాయు డైనాడు. చాంగ్ తన మొదటి రూపానికి చిహ్నంగానైనా లేడు. ఇక ధనదాసు యీ చరమ దశలో వున్నాడుని గానో

కాక సన్నిపాత రోగగ్రస్తుడుగానో వున్నట్లున్నాడు. బయటికి వచ్చిన అతని కళ్ళు ఎంతో బీభత్సంగా ముందువైపుకు చూస్తున్నట్లున్నాయి. సన్నగావున్న అతని అధరాలు పూర్తిగా మూసుకు పోయినవి. అతను యెవరి వైపూ చూడకుండా, కేవలం ఎదురుగా కన్పిస్తున్న కొండవైపుకు, పరుగెత్తుతున్న డేగవలె వేగంగా పురోగమిస్తున్నాడు

వాస్తవంగా యిదొక పరుగు. మృత్యువు – అన్నిటి కంటె క్రూరమైన మృత్యు దేవతయొక్క పరుగు. మేము మాత్రం భరింపరాని దప్పికతో పరిణామంకోసం ఎదురు చూస్తున్నాం. ఏ సమయంలోనైనా మా శక్తి సమాధానం చెప్పగలదని మాకు తెలుసు; మా అంతిమ లక్ష్యాన్ని ఎదురుగా చూస్తూ - చూస్తూ యీ శూన్యమైన అజ్ఞేయభూమిలో శాశ్వతంగా కన్ను మూయగల్గుతాం.

ధీరేంద్రుడు మిగిలిన జలాన్ని మాలో పంచేశాడు. ఆయన మహోదారత స్ఫురణ కొచ్చినప్పుడల్లా నా కళ్ళవెంట అశ్రుధారలు ప్రవహిస్తూంటాయి. ఆయన ఎప్పుడూ తక్కువ జలం వాడుకొని, మాకందరకూ ఎక్కువగా యిస్తూండేవాడు. కష్టాలు గూడా మాకందరి కంటే ఆయనే ఎక్కువ అనుభవిస్తూండేవాడు. ఆయన స్వభావ సిద్ధంగానే, సహజంగానే నాయకుడు. అప్పుడు మాలో శక్తి సంతటినీ ఆఖరిసారిగా కేంద్రీకరించుకొని, ఆ నాలుకలు కోరుతున్న జ్వాలల్లో వెనకా - ముందూ ఆలోచించకుండా దూకాం. కాని యేమి చేయగలం? నడవడం యిసుకలోనాయె. మొదటి అడుగు

ముందుకు వేసినా, రెండవ అడుగు సగం దూరం వెనుకకు జారిపోతోంది.

మేము మెల్లగా ముందుకు సాగిపోతున్నాం. నేనూ—చాంగూ వెనకపడిపోయాం. ధనదాసు, ధీరేంద్రుని కంటె గూడా ముందు వెళ్తున్నాడు. ఆయన్నేదో మాయాభూతం ఆవేశించినట్లుంది. ఆయన దొర్లుతూ-పొర్లుతూ యిసుకను వెనక్కు నెట్టి వెళ్తూనే వున్నాడు. మేము వస్తున్నామో లేదో ఒకసారైనా వెనక్కు దిరిగి చూడకుండానే వెళ్తున్నాడు.

రెండు ఝాముల ప్రొద్దెక్కేవరకు నేను మూర్ఛపోయాను. ఎండతీవ్రత, బలహీనతలు నాపై విజయం సాధించినవి. నేనక్కడే భూమిపై పడిపోయాను.

నాకు స్పృహవచ్చి చూడగా చాంగ్ నన్ను లేవదీసే ప్రయత్నంలో వున్నాడు. ఈ విషయంలో ఆయనెంతో పరాక్రమం చూపాడు; కాని నన్ను తీసుకొని 20 అడుగులైనా వెళ్ళకముందే నాతోపాటు ఆయన గూడా భూమిమీద కుప్పగా కూలాడు.

మేమిద్దరం దగ్గరగానే కళ్ళు మూసుకొని పడివున్నాం. మాపై సూర్యుని అగ్ని కిరణాలు నిత్యం పడుతూనే వున్నవి. ఒక విధంగా మేము మృతతుల్యులం. అంతులేని దప్పిక వల్ల నా గొంతులో ముళ్ళమండ పెట్టినట్లుంది. నాలుక నిప్పులో పడినట్లుంది. ఇసుక దెబ్బకు కళ్ళలోని రక్తం బయటకొచ్చినట్లుగావుంది. నా చేతులు ఎంతగా మండిపోతున్నాయంటే స్పృశించినంత మాత్రానే విపరీతమైన బాధ కల్గుతోంది. నా తుపాకీగొట్టం నిప్పులో కాల్చి బయటికి తీసినట్లుంది.

నేను లేవడాని కేమాత్రం ప్రయత్నించలేదు. అలాంటి ప్రయత్నం వృధా అని నాకు తెలుసు. నేనలాగే మృత్యు క్షణాల్ని లెక్కిస్తూ పడివున్నాను. ఆ సమయంలో నన్నెవరో లేవదీశారు. వెనుదిరిగి చూడగా ధీరేంద్రుడు. ఆయన తిరిగి వచ్చి నన్ను తీసుకుపోతున్నాడు. అప్పుడు నాకు మాట్లాడే శక్తి లేకపోయినా కన్నీరుమాత్రం ఏకధారగా కారుతోంది. జీవితమంతా యీ స్వర్గదేవతకు కృతజ్ఞుడనై వుండాలని నేను అనుకొన్నాను.

నేను వెనక్కు చూచాను. చాంగ్ వస్తున్నాడు. ముందుభాగాన పిచ్చివాడివలె దొర్లిపోతున్న ధనదాసును చూచాను. ఇప్పుడాయన దృష్టి కొండమీద 150 గజాల ఎత్తున ఎడారివైపు చూస్తున్నట్లుగా చెక్కబడివున్న దేవ మూర్తులమీద కేంద్రీకరించబడి వున్నది. నాలో ఆశ్చర్యాన్ని వ్యక్తపరిచే శక్తి లేదు. ధీరేంద్ర, చాంగ్‌లలో ఎవరూ నోరెత్తలేదు. వారిద్దరి దృష్టిగూడా దేవమూర్తులవైపే వుంది. యీవిధంగా మేమందరం మెల్లగా పురోగమిస్తున్నాం.

ఈ ప్రాచీన విగ్రహాలను నేను ఎరుగుదును. ఎడమ వైపుగా పవిత్రమైన ఇబిస్ పక్షిముఖం గల విగ్రహం థాత్, కుడివైపుగా వున్న శృంగాల వదనుడు మృత్యుదేవత అయిన అనుబిస్. ఈ అద్భుత విగ్రహాలను స్వచ్ఛమైన వాతావర ణంలో సుస్పష్టంగా చూడగలుగుతున్నప్పటికీ పర్వతం మరొక మైలు దూరంకంటె ఎక్కువగానే వున్నది. రెండు విగ్రహాలూ సమీపంగా వుండి తమ హస్తాలతో మా గమ్యమైన సోపానా లను చూపుతున్నట్లున్నవి.

అప్పుడు ధీరేంద్రుడు నా చేతిని వదలకుండానే పడి పోయాడు. వెంటనే చాంగ్ వెనుకగా వచ్చి ధీరేంద్రుని లేవ దీయడానికి సహాయపడ్డాడు. వున్న శక్తినంతా కూడదీసుకొని స్వయంగా నేను ముందుకు రాకపోతే చాంగ్ ధీరేంద్రు లిద్దరూ నన్నొక అడుగైనా ముందుకు తీసుకు పోలేరనీ, చివ రకు ముగ్గురం ఇక్కడే అంతమై పోతామనీ నేను గ్రహిం చాను. విగ్రహాలకు సమీపంగా చేరుకొన్న ధనదాసు విషయం మేము మరచిపోయ్యాం. నేనొక్కసారిగా లేచి నిల బడ్డాను. ముగ్గురం చేతులు పట్టుకొని ఆ కాలిపోతున్న ఇసుక మీద ముందుకు సాగాం.

అదే సమయంలో మాకొక పెద్ద ధ్వని వినిపించింది. మేము పైకి చూడగా అక్కడ ధనదాసు రెండు చేతులు పైకెత్తి కూలిపోయాడు.

మేమాయన సమీపంలోకి పోకముందే మళ్ళీ లేచాడు. తన సంచీ, తుపాకీలను, ఇసుకపై విసిరిపారేసి త్రాగుబోతు లాగా మళ్ళీ పరుగెత్తాడు.

అతను మరొకమారు పర్వతపు టడుగుభాగంలో పడి పోయాడు. కాని యీపర్యాయం లేవలేకపోయాడు. అయినా కాళ్ళు చేతుల సహాయంతో ప్రాకడం మొదలుపెట్టాడు. ధనదాసు సంచీ, తుపాకీని పారేసిన చోటుకు వచ్చి మేమూ పడిపోయ్యాం. భయగ్రస్తులైన పసిబిడ్డలవలె మేము ముగ్గురం పోగుబడ్డాం. ధనదాసు అదే విధంగా పాకుతూ పర్వత పైభాగానికి వెళ్ళడానికి చెక్కబడ్డ సోపానాల మలుపు మెట్టు మీదకు పోవడం గూడా చూశాం. కొండకొనకు వెళ్ళి

ఆయన మాయమయ్యాడు. ఒక గంటసేపు ఆయనకోసం నిరీక్షిస్తున్నాం. పూర్తిగా 48 గంటల తర్వాత మేము మనుష్య శబ్దాన్ని విన్నాం. ధనదాసు పెద్దగా కేకపెట్టి అన్నాడు —నీళ్ళు! నీళ్ళు!! ఇక్కడ నీళ్ళున్నవి, మనం బ్రతికిపోయాం!!!

పడ్డచోటునుంచి లేచి ధీరేంద్రుడు మెట్లు మీంద కెక్కాడు. నేనూ, చాంగ్ గూడా ఆయన్ననుసరించాం. మేము పూర్తిగా అలసిపోయి, బలహీనులమై వున్నందువల్ల ఆ పెద్ద పెద్ద మెట్లు ఎక్కలేకపోయాం. మేమక్కడే కూల బడ్డాం. కొద్దిసేపట్లో ధీరేంద్రుడు ఒక డబ్బాతో నీళ్లు తీసి కొని మా వద్దకు వచ్చాడు.

ఆ శీతలజలం సరిగ్గా స్వర్గలోకపు అమృతంవలె వున్నది. అంతేగాక అదే మా బ్రతుకు, శక్తి, సాహసం, ఆశ. మేము భయంకరమైన ఇసుక ఎడారిని నిర్గమించాం. ఆపదలు, బాధలు, మున్ముందు ఇంకెన్నో రావచ్చు. కాని అటువంటి యమయాతనలు అనుభవించే పనిలేదు.

## 11. దేవమూర్తుల మార్గం.

పర్వతంమీద నీళ్లుండటం, క్రింది భాగంలో లేకపోవ డానికి గల కారణం తెలుసుకోవడం కష్టమైన పనేమీగాదు. ఎడారి యిసుక ఒక కఠోరమైన రాతి ప్రదేశంలో వుండటం వల్ల దాని మీందుగా నీళ్ళు ప్రవహించే అవకాశం లేదు.

పర్వత పైభాగంగూడా రాతి ప్రదేశమైనా క్రిందిభాగం చిన్న చిన్న రాళ్లముక్కలు గల ప్రదేశంగా వుంది. శిఖరానికి 200 గజాల దూరంలో చల్లని, స్వచ్ఛమైన జలంగల కాల్వ వుండడానికి కారణం యిదే. మేమిప్పుడా కాల్వఒడ్డుకు జేరి పశువులవలె కాళ్లు - చేతులమీద ఒంగి బాగా నీళ్ళు త్రాగాం.

నదీ భాగాన్ని దాటినప్పటినుండీ నీళ్ల మొఖం చూడలేదు. ఆ రోజుల్లోగూడా భయంకరమై దోమలకు భయపడి నదికి దూరంగా డేరాలు వేసుకొనేవాళ్ళం. అందులో ఒక రకమైన పురుగులు ఆఫ్రికాలో దక్షిణంనుండి వుత్తర కొనవరకు కన్పిస్తూంటాయి. కాని యీ జాతి పురుగులు మానవులకేమీ అపకారం చేయలేకపోయినా ఆవు, గుర్రం వంటి గిట్టలుగల జంతువులకు మాత్రం హాని జేయగల్గుతవి. శివనాథుని నోటుబుక్కువల్ల సోబాత్ లోయలో యీ పురుగులున్నవని తెలుసుకొనే ఒంటెలమీద మేమీ ఎడారి దాటే ప్రయత్నం చేయలేదు. దక్షిణంగా యింత దూరం వచ్చి బహుశా ఒంటెలు బ్రతుకలేవు.

మేమిప్పుడు శీతల జలాన్ని త్రాగి, దాహాన్ని తీర్చుకొని మాటలు - గీటలుగూడా విష్వకం మరచిపోయి ఆ చెట్ల నీడల్లో కాసేపట్లోనే నిద్రపోయాం.

సూర్యోదయానికి, నేను లేచేసరికి ధీరేంద్రుడు పొయ్యి వెలిగించి, చిన్న వంటపాత్రలో ఫలహారం తయ్యారు చేసే ప్రయత్నంలో వున్నాడు. మేము ముగ్గురం కాలకృత్యాలు పూర్తి చేసుకొని తనివిదీర స్నానం జేసేసరికి

ధీరేంద్రుడు, ఫలహారాలు వడ్డించాడు. ఆకలి మండిపో తున్నందువల్ల యిప్పుడిక ఆలస్యం జేసే అవకాశం లేదు. కంబళ్ళు పరచుకొని నలుగురం ఆ చల్లని చెట్ల నీడల్లో తిన డానికి కూర్చొన్నాం. ఆనాటి ఆ కూరల రుచి చెప్పేకంటే వూహించడమే చాల తేలిక.

ఇప్పుడు నలువైపుల దృష్టి సారించాం. భయంకరమైన యెండలో నీరూ - నీడా, విశ్రాంతి నామ మాత్రంగానైనా లేని నరకలోకంనుంచి బయట బడ్డట్లుగా వుంది నాల్గు వైపులా పచ్చని చెట్లు గలిగి ఎత్తుగా పెరిగి శోభాయమా నంగా వున్న గడ్డి, శీతల వాయువు ఆహ్లాదంగా వీస్తున్న దేశంలో యిప్పుడు మేమున్నాం. మా క్రింది భాగంలోని సెల యేటి కలవరం, దేవలోకపు వీణయొక్క మధుర సంగీతం లాగుంది.

ఈ విచిత్ర ఆనందదాయకమైన దృశ్యాన్ని నేనెప్పుడూ విస్మరించలేను. మేము పర్వతాగ్రాన వున్నాం. మా క్రింది భాగాన వుత్తర దిశగా కనుచూపుమేర జలసస్య రహితమైన బంగారు ఛాయతో కాగుతూన్న ఆ భయంకర యిసుక ఎడారి మాత్రం వుంది. దక్షిణ దిశగా వున్న దేశం చిత్రంవలె మా ఎదుట వ్యాపించివుంది. ఈ దేశం పచ్చని గడ్డితోనూ. చెట్టూ - చేమతోనూ, 40 మైళ్ళ పొడవునవుంది. వాయు మండలం యెంత పరిశుభ్రంగా వుందంటే దేశపు రెండవ కొననవున్న పర్వతం ఎంతో దగ్గరగానూ, స్పష్టంగానూ కన్పిస్తోంది. అక్కడక్కడ పెద్ద-పెద్ద రాళ్ళతోనూ పచ్చిక తోనూ కప్పుకుపోయినా, చిన్న - చిన్న కొండలు వున్నాయి.

మా కొండచరియ నుండి ఒక చిన్న ప్రవాహం క్రింది వైపుకు వెళ్ళింది. ఇంకా ముందుకు వెళ్ళి చిన్న చిన్న సెలయేళ్ళతో కలసి పర్వతం క్రింది భాగానికి చేరుకొన్నది. అక్కడని ఒక చిన్న నదిగా తయారైంది. ఈ నది చాల దూరం వరకు విశాల ప్రదేశంగుండా వెళ్ళింది. మేము దానిని దక్షిణ దిశగా ఎంతో దూరం వెళ్లడం చూశాం.

మేమున్న చోటుకు రెండు ఫర్లాంగుల దూరాన 10అడుగుల ఎత్తుగల రెండు రాతి విగ్రహాలు కనబడుతున్నవి. ఇవి ఎదురెదురుగా వున్నాయి. వాటిని చూడగానే మరీ దగ్గరకు వెళ్ళి చూద్దామన్న కుతూహలంతో అటువైపుకు దారితీశాను. ఆ విగ్రహాలు రూపురేఖల్లో సక్కారాలో దొరికిన ఆసీన దేవతా విగ్రహాలవలె వున్నాయి. శతాబ్దాల తరబడి జలవాయువుల తాకిడివల్ల ఆ రెండు విగ్రహాలూ గుర్తించడానికి వీలులేనంతగా వికృతమై పోయినాయి. ప్రతి దేవతా పద్మాసనం వేసుకొని పీటమీద ఆసీనమైవుంది. వాటి శరీరాల పైన వస్త్రాలున్నట్లు లేదు; కాని వాటి వెంట్రుకలు ప్రాచీన మిశ్రీయులకు మల్లేనే కత్తిరించి వున్నవి. ఆశ్చర్య పడాల్సిన విషయ మేమిటంటే మా కెదురుగా చూడగల్గినంత దూరం రెండేసి ఫర్లాంగుల కొక జంట విగ్రహం కన్పిస్తోంది. వీటిల్లో మొదట పెద్దవిగానూ పోను-పోనూ చిన్నవిగానూ, తర్వాత మరీ కొద్దివిగానూ ఆ పైన అస్పష్టమైన బిందువుల్లాగానూ వుండి చివరకు అవిగూడా కన్పించకుండా అదృశ్యమై పోయినవి. ఇవి రెండు వరుసలుగా పర్వత శిఖరంనుండి దక్షిణ దిశకు వెళ్తున్నాయి.

ఇవి సోపానాలనుండి మితనీ హాప్పికి పోయే మార్గాన్ని సూచిస్తున్న వనడంలో సందేహం లేదు. ఈ విషయాన్ని శివ నాధుడు గూడా వ్రాశాడు.

అప్పటి నా వుద్రేకాన్ని వర్ణించడం అసంభవం. ఒక్క రాత్రి విశ్రాంతితోనే నేను గడచిన కష్టాల నన్నిటినీ మరచి పోయాను; ముందువచ్చే ఆపదలను గూర్చి గూడా ఆలోచించలేదు. ఆసీన దేవతా విగ్రహాలు చూపిస్తున్న మార్గాన్ని కనుగొనడం అసాధారణ విషయం. ఇది మేరియట్‌ను కని పెట్టడం కంటే ఘనమైనదనడం నిస్సందేహం. నేను ఆశ్చర్యంతో దక్షిణ పర్వతాన్ని చూస్తున్నాను. థేబీయ రాకుమారుడైన సెరాఫిస్ సమాధి వున్న మితనీహాప్పి నగరం యిక్కడ వున్నదనడంలో నాకిప్పుడు గట్టి విశ్వాస మేర్పడింది.

పగలంతా కొండమీది చెట్ల నీడలో ఎంతో ఆనందంగా గడిపాం. నేను నా సహచరులతో నా నమ్మకాన్ని గూర్చి చెప్పాను. ఆ వేశంలో నన్ను నేను మరచి ప్రవర్తించానడంలో సందేహం లేదు. మేమింకా అనేక ఆటంకాల నధిగమించాలని, వాటిని గురించి ఆలోచించాల్సిన అవుసరం వుందని నేననుకోనేలేదు. మేమంతా యెంతో సంతోషంతో థేబీ నగారాల ధ్వనులతో ఆడంబరంగా ప్రాచీన మిశ్రీయుల వలె ఆసీన దేవతా విగ్రహాల మార్గాన సాగి వెళ్తామని నేను వూహించాను. యీ చర్మచక్షువులతోనే వేలకొలది సంవత్సరాల నాటి మిశ్ర నగరాన్ని సందర్శిద్దామన్న కోర్కె తప్ప నాకు మరే వుద్దేశ్యం లేదు. ధీరేంద్రుని విచిత్ర మందహాసం

నా ఆవేశాన్ని తగ్గించింది. ధీరేంద్రుడొక వ్యవహార దక్షుడు. మరి నేనో ? ఒక పనికిమాలిన వాణ్ణి.

ధీరేం:- ప్రొఫెసర్, మనం అత్తవారింటికి వెళ్తున్నట్లుగా మాట్లాడుతున్నారు. నేను ఇక్కడ మీఅభిప్రాయంతో ఏకీభవించను. మన యాత్రలో అన్నిటికంటె భయంకరభాగం ఇక ముందున్నదని నేను భావిస్తున్నాను.

నాకు మరోమారు ఎడారి దృశ్యం జ్ఞప్తికొచ్చింది. నేను చాలా భయంగా అన్నాను - అన్నింటికంటె భయంకరమా ?

ధీరేం:- అవును. మీరు చాలాదూరం ఆలోచించారు గాని అది ఇప్పుడు నాకేమీ నచ్చడంలేదు. పర్వతంమీద చెక్కబడివున్న ఆ రెండు భయంకర విగ్రహాలను గూర్చి, ఆసీన దేవమూర్తులను గూర్చి మీరేంచెప్పినా నాకు అంతా నిస్సారంగానే వుంది. మన ముందున్న ప్రదేశం పాడుబడి లేదనీ, ఇప్పటికీ సశ్యశ్యామలంగా వుందని మీరు భావించడం లేదు. నేను - సశ్యశ్యామలంగా వుందా ?

ధీరేం :- ఔనన్నట్లు తల వూపాడు.

నేను :- "నేను చూడలేదు." ధీరేంద్రుడు దుర్భిణిని నా చేతికిచ్చి అన్నాడు —— "కొంచెం దీనిలో చూడండి. ఇంతకు ముందున్న మీ అభిప్రాయాలను తొలగించుకొనండి. ముందు యీ దేశాన్ని సవిస్తరంగా పరిశీలించి చూడండి."

నేను దుర్భిణిని తీసికొని దూరాన వున్న పర్వతాలనూ, మా మధ్య భూభాగాన్ని చూశాను. ధీరేంద్రుని మాట నిజమేనని గ్రహించాను. అక్కడక్కడా విశేషించి,

నది ఒడ్డున పంటచేలు కన్పిస్తూన్నవి. అక్కడక్కడా పశువుల మందలు గూడా మేస్తున్నవి. దుర్భిణిని ధీరేంద్రుని చేతికిస్తూ నేనన్నాను — అవును యీ చోటు ప్రజలు నివసిస్తున్నదే.

ధీరేం :- మీరు ఇళ్ళను చూశారా ?

నేను :- లేదు.

ధీరేం :- అయితే మీరు సరిగా చూడలేదు.

ఆయన నిలబడి వ్రేలితో ఒక దిబ్బ వైపుకు సంకేతం చేశాడు. అదొక మైలు దూరాన వుండవచ్చు. ఆయన చెప్పినట్లు దుర్భిణిని అటు త్రిప్పి చూశాను. నేనాశ్చర్యంతో మొట్ట మొదటిసారిగా ఒక చిన్న గ్రామాన్ని చూశాను. అక్కడొక అరడజను ఇళ్లున్నాయి. వాటి ముందు మనుష్యులు అటూ ఇటూ తిరగడం చూశాను. నేనేమీ మాట్లాడకుండా దుర్భిణిని ధీరేంద్రుని కప్పగించాను. యీ లోగానే ఆయన చాంగ్ ధనదాసులతో రానున్న భయంకర స్థితిని గురించి చర్చించాడు గూడా. నేనొక సంచిమీద కూర్చొని ధీరేంద్రునితో అన్నాను - అయితే మనమేం చెయ్యాలి ?

ధీరేం :- రానున్న కొన్ని గంటలే మన అదృష్టాన్ని నిర్ణయిస్తాయి. ఎంతోసేపు ఇతరుల కళ్లుగప్పి ఇక్కడ వుండలేం.

ఆయన నిలబడి, జవాబుకోసం నిరీక్షిస్తూన్నట్లుంది. నాకు మాత్రం తిరిగి ఎడారికి వెళ్లేకంటే మృత్యువే వేయిరెట్లు మంచిదనిపిస్తూంది.

ఎవరూ మాట్లాడలేదు. కొంచం ఆగి ధీరేంద్రుడన్నాడు — సరే, ఇప్పుడు చాలా భాగం మీ మీదే

ఆధారపడే సమయమొచ్చింది. శివనాథుడు వ్రాసినవన్నీ ఇప్పటివరకూ యదార్థాలవుతూనే వచ్చినవి. అందువల్ల యీ రోడ్డు ప్రక్కనే మితనీ నగరముందనీ, ఇక్కడి ప్రజలు ప్రాచీన మిశ్రభాషను మాట్లాడుతారనీ ఆయన వ్రాసిన యీ విషయాలను గూడా నమ్మాలి. ఆ భాష మీకు వ్రాయనూ, చదవనూ వచ్చు. మీరీ దేశీయుల ప్రవర్తన, వేషభాషలు మొదలయినవన్నీ బాగా ఎరుగుదురు. ఆధునిక ఆటవికులను గూర్చి నాకు బాగా తెల్సుగాని, ప్రాచీన నాగరికులను గురించి నాకే మాత్రం తెలియదు. అయినా వీళ్లతో ఎలా ప్రవర్తించాలో నాకు బాగా తెలుసు. దానిలో యేమాత్రం పొరబడినా మనలో ఏ ఒక్కరం బ్రతికి బయట పడలేం. ప్రాచీన మిశ్రీయులు దయాపూర్ణ హృదయులు కారనుకొంటాను.

నేను :- అంతేగాదు. పైగా ఎంతో క్రూరులుగూడా.

ధీరేంద్రుడు ఇంకేమైనా చెపుతాడని నేననుకున్నాను. కాని ఆయన మౌనం వహించాడు. ఇదే సమయంలో చాంగ్ మహాశయుడు "మనమేమీ మాట్లాడరాదని" వ్రేలితో సంకేతం చేశాడు. మళ్ళీ వ్రేలిని చెవిపై పెట్టుకొని వినండని కళ్ళతో చెప్పాడు.



# 12. రధికుడూ - మా దుస్సాహసం.

మేము చెవొగ్గి విన్నాం. కొద్ది సేపట్లోనే గుఱ్ఱపు గెట్టెల ధ్వని విన్పించింది. చాంగ్ నేలమీద పడుకొని కాళ్లూ చేతుల సహాయంతో జరుక్కుంటూ ఒక పెద్ద రాతి చాటుకు వెళ్ళాడు. అక్కడనుండి మమ్మల్ని గూడా అలాగే చెయ్యమని సంకేతం చేశాడు. మేముగూడా అలాగే ఆయన వద్దకు చేరుకొన్నాం.

రాతిచట్టు చాటునుండి చాల సావధానంగా ఆ శబ్దం వైపు చూడసాగాం. అదే సమయంలో మా సమీపంగానే మాంసాన్ని తినే వుత్తమజాతి పశువొకటి మైదానంగుండా వెళ్ళడం కన్పించింది. ఆ జంతువు బాగా అలిసిపోయింది. మావద్దకు చేరేసరికి దాని నాలుక బయటకు కన్పిస్తూ వూగుతూండడం చూశాం.

ఎక్కువసేపు మేమా జంతువును చూడనుగూడా లేదు; దూరాన్నుండి ఒక నల్లని వస్తువు రావడం చూశాం. కొద్ది సేపట్లోనే అది మాకు చాలా దాపుకొచ్చింది. అది రెండు చక్రాలు గల్గిన రథం. దానిమీద ఒక మనిషి ముందుకు వంగి కూర్చున్నాడు. అతని చేతుల్లో గుర్రపు కళ్ళెంతో బాటు ఒక పెద్ద విల్లుగూడా వుంది. బంగారపు టంచుగల లుంగీతప్ప శరీరంమీద మరేవిధమైన గుడ్డలూ లేవు. అతని కంఠానవున్న హారంలోని రత్నాలు మెరుస్తూన్నవి.

గుర్రం ముందుకు పరుగెత్తుతూన్నప్పుడు గాలిలో అతని జూలు వెనక్కు ఎగురుతున్నది.

అతడొక ముప్పై సంవత్సరాల బలిష్టమైన యువకుడు. అతని రథం వేగంగా మాకు చాలా దాపుకు వచ్చింది. అలాంటి వుత్తమాశ్వాన్ని నేనెప్పుడూ చూచి వుండలేదు. అది ఆపాదమస్తకం బొగ్గులాంటి నల్లుపుగల్గి వుంది. రంగును బట్టే అది సిసలైన అరబ్బీ గుర్ర మనుకోవచ్చు.

మేము చూస్తూ వుండగానే కళ్లెమును ఆ వ్యక్తి ఎడమ చేతికి తీసుకొన్నాడు. కుడి చేతితో పొదినుండి బాణం తీసి వెంటనే నారి సంధించాడు. ఆ అంబులపొది రథంలో అధిరోహించే చోటునేవుంది. అతడు నారిని చెవివరకు లాగి వదలగా దాని తీవ్రమైన ధ్వని మాదాకా వచ్చింది. నిస్సందేహంగా యీ పురాతన అస్త్రం కనిపెట్టబడినప్పటినుంచీ నేటి వరకూ అలాంటి గురి ఎక్కడా కన్పించదు. బాణం, తిరుగుతూన్న జంతువుకు ఎడమభాగాన తగిలింది. అది అక్కడే గుండ్రంగా తిరిగి చచ్చింది. రథం నడపడంలో ఆ వ్యక్తి అపర కృష్ణుడు. గుర్రంగూడా అందుకు తగినదే. అతడు వెంటనే చేసిన సౌంజ్ఞమాత్రంతో గుర్రం శాంతంగా నిలబడిపోయింది. అతడొక నిముషంలోనే మృతజంతువు శరీరంలోని బాణాన్ని తీసి దాన్ని రథంలో పెట్టుకొన్నాడు. అప్పుడతడు రథాన్ని త్రిప్పి కొంచెం సేపట్లోనే గాలిలో తేలిపోతూ ఆసీన దేవతాగ్రహాల మార్గంవెంటే వెళ్ళిపోయాడు. ఇప్పుడా రథశబ్దాలు విన్పించక పోయినా, గిట్టలధ్వని లేకపోయినా ధూళితో ఆవరించిన మేఘం నడచిపోతున్నట్లుగా మాత్రం కన్పిస్తోంది.

మేము నిశ్శబ్దంగా చూస్తూన్నాం. అతడెంతో దూరం వెళ్లిన తర్వాతగాని మాలో ఎవరూ నోరెత్తలేదు. సూర్యు డస్తాద్రిని చేరుకొన్నాడు. పశ్చిమ క్షితిజంలో కెంపుఛాయలు వ్యాపిస్తున్నవి. క్షణక్షణం యీ రక్తిమ పెంపొందుతూ ఆకాశంలో చిన్నదైపోయింది. మొట్టమొదటగా ధీరేంద్రుడా నిశ్శబ్దాన్ని భంగం జేసాడు.

ధీరేం:- చూశారా ప్రొఫెసర్, మన ఆపదలు తొలిగి పోయినవని చెప్పలేం.

నేను నా ఎర్రని చేతిగుడ్డతో – యిదెప్పుడూ నావద్ద వుంటుంది. చెమటను తుడుచుకొని అన్నాను – మీరు చెప్పేది పూర్తిగా నిజం. మీవూహ వాస్తవం. నేనీ వ్యక్తిని పూర్వం చూసినట్లుంది. నా కల్పనా దృష్టితో యిలాంటి యువకుణ్ణో లేక ఆ యువకుణ్ణేనో అదే రథంమీద, అదే రోడ్డున థేబిస్ నుంచి కబ్తస్‌కు పోవు నైలునదీ తీరపు బాటపై వెళ్ళడం చూశాను. ఆ యువకుడు చక్రవర్తికి సామంతరాజై వుంటాడు. 19వ శతాబ్దపు విద్యాచార్యుడనైన నేను జాగృతావస్థలో వుండి కళ్ళారా అతన్నే చూస్తూండడం ఎంత ఆశ్చర్యం. ఇది నమ్మరానిమాట. కాని కళ్ళారా చూస్తూ కళ్ళనే ఎలా నమ్మకపోవడం ?

ధనదాసు నిలబడి పర్వతాల వైపుకు చూపించాడు. మరొకమారు అతని వున్మాదాన్ని చూశాను. అతడనుస్తూ "అ...క్క...డే...సెరాఫిస్...ధనరాసులు...వున్నాయి అన్నాడు.

అతని కళ్ళు మెరిసినవి. వేళ్లు వణికిపోతున్నవి. అతని ప్రత్యంగంలో మెరుపువంటి తీవ్రత్వం వెలిసింది. ధీరేంద్రుని నోట్లో బీడీ వెలుగుతోంది. చాంగ్ ఆసనం బైఠాయించాడు. ఆయన వదనంమీద దీర్ఘమైన హాసరేఖ కన్పిస్తోంది. కళ్లు మూతలుపడి వున్నవి. ఆయనేదో ఆలోచనలో లీనమైనట్లు నేనూహించాను.

ధీరేం:- మనం క్రిందకు వెళ్లదలిస్తే ప్రాణాలను గుప్పెట్లో పెట్టుకొని వెళ్ళాలి. ఇప్పుడు, యీపని నెలా నిర్వహించాలన్నదే సమస్య. మనమెలా ప్రారంభించాలి ?

దీనికి సమాధాన మిచ్చింది చాంగ్ మహాశయుడే.

"మనం మారువేషం వేసుకొని వెళ్ళాలి."

నేను :- మారువేషమా ! ఏ వేషం ?

చాంగ్ :- దీనికి సరైన సమాధానం మీరే ఇవ్వగల రనుకొంటున్నాను ప్రొఫెసర్.

ఒక్క నిముష మాలోచించాను; కాని నాకేమీ తోచిందిగాదు. చాంగ్ నావైపు చూచి అన్నాడు :- మీరు తప్పక ఆలోచించ గల్గుతారు. వారి దేవతల వేషంలో వెళ్ళ గూడదా ? అలాంటి దేవతలెవరూ లేరావీరికి ?

ఇప్పటికీ నేనాయన అభిప్రాయాన్ని పూర్తిగా గ్రహించ [illegible]ను. నేను ప్రాచీన మిశ్రదేవతల నెరుగుదును. [illegible] ప్రపంచంలో యింతమంది దేవతలను [illegible]ాల్ల తక్కువ. స్వర్గ, మర్త్య లోకాలను [illegible]ిస్ దేవుని ఆలయం, రోమ్ దేవత

జూపిటర్ కంటే చాల పెద్దది మిశ్రదేశంలో పరం పరంగా వచ్చిన దేవతలసంఖ్య తక్కువేమీ గాకపోయినా, ప్రతి నగరం ఒకొక్క దేవతను కొలుస్తూండేది. స్థానికంగా ఆ దేవతల మహాత్మ్యాన్ని గూర్చి అనేక రసవంతమైన కథలుండేవి. ప్తాహ - మెంఫిస్ నగర ప్రధాన దేవత; అమన్-థేబిస్ రాజధానీ దేవత; ఇసిస్ బుటో నగర దేవత. నేను మిశ్రదేవతల కథలను, వాటి లోతుపాతులను తెలుసుకోసాగాను. కాని చాంగ్ మధ్యలోనే అన్నాడు — నిజం ప్రొఫెసర్, అనేక గుణాలతోనూ, రూపాలతోనూ, కథలతోనూ గూడిన దేవత లెందరో ఇక్కడ వుండివుంటారు. కాని పర్వతాలపై చెక్కబడ్డ ప్రకాండ విగ్రహాల విషయమేంటి? అవి ఎవరి విగ్రహాలు? వాటిని గురించి నాకొక్క అక్షరమైనా తెలియదని గుర్తుంచుకోండి.

నేను :- వారు థాత్, అనుబిస్‌లు. ఒకటి మంత్రముల యొక్కయూ, కళలయొక్కయూ దేవత. రెండవది మృత్యు దేవత అనగా యమధర్మరాజు.

చాంగ్ :- మనలో యిద్దరు థాత్, అనుబిస్‌ల వేషాలతో వెళ్ళారనుకోండి, అప్పుడిక్కడి ప్రజలు ఎలా వ్యవహరిస్తారు? ఈ ప్రస్తావన వినగానే నా కళ్ళు మెరసిపోయినవి. దీని ఫలస్వరూపం నన్ను చకితుణ్ని చేసింది.

నేను:- "చాల వరకు సఫలత్వం జెందవచ్చు
మిశ్రీయులుగూడా మన ప్రజల్లాగానే పునర్జన
మహాశయా! ప్రతివ్యక్తి కెండు ప్రా
అందులో ఒకటి ఎప్పుడూ జీవి చి

వాళ్ళను గూర్చి నాకు తెలియని కర్మకాండలుగాని, ధార్మిక కార్యాలుగాని లేవనుకొంటాను. ఈ ఆలోచన తప్పక సఫలత్వం చెందవచ్చు. అలాగాక మన రహస్యం బయట బడే టప్పటి స్థితి తలచుకొంటే నా హృదయం వణికిపోతోంది."

ధీరేం:- నేనొకసారి ఆటవిక జాతులను, వారికి పూజనీయుడైన దేవతారూపం ధరించి శాసించాను. నేను వారిని నా దాసులుగా చేసుకొన్నప్పటికీ చివరకు నాకే యీ వంచన అంటే అసహ్యం వేసింది. వారి అంధ విశ్వాసాలతో నిండిన సరళ హృదయాలపై నాకు జాలి వేసింది. తర్వాత నేను వారిని ఆర్య సమాజానికి వప్పగించాను. కొంత కాలానికి ఒక ప్రచారకుడు వాళ్లెంతో నాగరికులైనట్లు చెప్పాడు. వారి నోటివెంట జైన మతాచార్యుని సూక్తులు, తథాగతుని గీతలు వినవచ్చినవి.

చాంగ్ మెల్లగా లేచి నిలబడ్డాడు. ఆయన ధీరేంద్రుని మాట విన్నాడని నేననుకోలేదు. తన ఆలోచనలోనే నిమగ్నమై వున్నాడు. ఆయన అన్నాడు — నేనెన్నో వేషాలు వేసి సఫలుణ్నయ్యాను. ఇది భయంకర కార్యమనడం నిస్సందేహం. ప్రొఫెసర్ యిది మీ మీద ఆధారపడి వుంది. ఇందులో సాఫల్యం పొందుతామన్న ఆశ మీకుంటే వెంటనే చెప్పండి. మేము మీ ఆజ్ఞలకు పూర్తిగా బద్ధులవుతాం.

నాకిప్పుడు విషయమంతా స్పష్టమైంది. నాకు దీనిలోని లోతు-పాతులు తెలుసు. నిజంగా అక్కడ మితనీ నగరముంటే ఆ నగర ప్రవేశానికి యింతకంటే వేరు మార్గంలేదు.

నేను :- మన ముఖాలకు సరిపోయే విధంగా ఒక నక్క-ముఖం తయారు చేయడం సంభవమేనా ?

ధీరేం :- ఇది చాల తేలిక. ఇప్పుడే 10 నిముషాలకు ముందు మన మొక "లకడా" (ఈజిప్టులో వుండే ఒక రకపు జంతువు) ను చూశాం. నాకు జంతువుల చర్మం ఒలిచి బాగు జేయడం బాగా అలవాటు. లేశమాత్రంగూడా గుర్తించని విధంగా నక్క తలను చేస్తాననడంలో సందేహమేమీ లేదు. అది సరిగ్గా నక్క తలలాగే వుంటుంది. నేను రామాయణ నాటకంలో హనుమంతుని ముఖాన్ని చేశాను. నిజంగా ఆ ముఖంలో ఎంతో నైపుణ్యం వుంది.

నేను :- పవిత్రమైన ఇబిస్ పక్షి ముఖాన్ని గూడా తయారు జేయగల్గుతారా ?

ధీరేం :- ఇది కొంచెం కష్టమైనా చేయ గల్గుతాను.

నేను :- మరొక డేగ ఆకారాన్నో !

ధీరేం :- ఓ, అదిగూడా.

నేను :- భేష్; మనవద్ద గోబర్లైలా వుంది. దేవతలు స్వయంగా గోబర్లైలాను తీసికొని సెరాఫిస్ సమాధికి వేంచేస్తున్నారు. మనం నదిమీద ప్రయాణం చేయాల్సివుంది; ఎందుకంటే, పవిత్రమైన నైలునదీ తీరంలో ప్రాచీన మిశ్రీయుల ధార్మిక కృత్యాలన్నీ జరుగుతూండేవి. ధనదాస్‌జీ, మీరు ఓసరిస్ పుత్రుడు, ఆకాశ దేవతయైన హోరస్ అౌతారు. ధీరేంద్రుడు అనుబిస్, చాంగ్ థాత్ అౌతారు.

నేను మీ ప్రధాన పూజారిని; ఎందుకంటే దేవతలు నీచ మానవ సంతానంతో మాట్లాడరు.

ధనదాసు తలయెత్తి విరగబడి నవ్వుతూ ఒక పెద్ద కేక పెట్టాడు — భేష్! యిందులో అసఫలత్వమంటూ లేనేలేదు.

## 13

## నైలు దేవతలు సెరాఫిస్ భూమి మీద అవతరించడం.

ఆరోజు వుదయం మేమీ విషయమై వివరంగా చర్చించాం. నా స్నేహితులు ధరించబోయే వేషాలుగల దేవతల యొక్క గుణగణాలూ, స్వభావాలనూ పూర్తిగా వివరించాను. నా సాహసపూర్ణ ప్రయత్నం వృథా కావడానికి నాకే కారణం కన్పించడంలేదు. మేము మా ఏర్పాట్లను పూర్తి చేసుకోవడానికి కొన్ని రోజులు పడుతుంది. గనుక సురక్షిత స్థలానికి మా మకాంను మార్చదలచుకొన్నాం. ధీరేంద్ర- ధనదాసులు మెట్లమీదుగా వెళ్ళి క్రిందిభాగంలో తగిన చోటు వున్నదేమోనని చూచివచ్చారు. వారు విగ్ర ...కు సమీపంలోనే ఒక నివాస యోగ్యమైన గుహ వున్న

...క వారం రోజులున్నాం. పనివత్తిడివల్ల ...కు తీరిక లేకపోయింది. ధీరేంద్రు

డొక లకడాను జంపి దాని తలవంటి తల నొకదానిని తయారు చేశాడు. ఆయన దాన్ని బాగా పరికించి చూసి లోపలు వున్న చోట్లను సరిజేశాడు. డేగ, ఇబిస్ పక్షుల ముఖాలను తయారు చేయడం చాల కష్టమైన పని. అవి పూర్తిచేయడానికి ధీరేంద్రునికి చాలారోజులు పట్టినవి. ఆయన ఒక పెద్ద డేగను చంపి, ఒక రకమైన కొయ్యముక్కలతో డేగ రెక్కలవలెనే రెక్కలను తయారు చేశాడు. అసలు డేగముక్కునే దానికి తగిలించాడు.

ఇబిస్ పక్షిని పట్టుకోవడానికి మేమంతగా కష్టపడ లేదు. ఎందుకంటే, నదికి ఆవలివైపున ఈ జాతికి జెందిన పక్షులు యెన్నో వున్నవి. ఈ ప్రదేశంలో సుందరమైన ఎర్రని ముక్కుగల ఇబిస్ పక్షులు చాల ఎక్కువగా వుంటవి. కాని నైలునది వరదలు వచ్చినప్పుడు ఎగువ మిశ్రదేశంలో కన్పించే ఇబిస్ పక్షులు మాత్రం ఇచ్చట చాల తక్కువ వుంటాయి. మేము సర్వతాగ్రాన్నుండి దుర్భిణీ సాయంతో అనేక ఎర్రని ఇబిస్ పక్షులు నదీతీరంలో మెల్లగా ఎగురు తూండడం చూశాం.

పవిత్రమైన ఇబిస్ పక్షి వెండిలాగా తెల్లగా వున్నప్ప టికీ తల, మెడ నల్లగానూ, ఈకెలు లేనిదిగానూ వుంటుంది. వీటిని నకలు చేయడానికేమీ వుపాయం తోచలేదు. అందు వల్ల ధీరేంద్రుడు 5–6 పక్షులను చంపి తీసుకవ వాటి తలయొక్క చర్మాన్ని వేరుజేశా చక్కంగా ఆ ముక్కలన్నిటినీ కలిపి నల్లని గట్టికర్రను కోసి ఒక పక్షి వ

చేశాడు. ఈ ముసుగును సన్నని మేకులతో ముఖానికి అతుక పెట్టాడు; మేకులు బయటకు కన్పిస్తున్నచోట ఒక పల్చని చర్మాన్ని అంటించాడు.

ఈ మూడు ముఖాల ఆకారం అచ్చంగా అసలు ముఖాలలాగానేవున్నవి. కెప్టెన్ ధీరేంద్రుని యాత్రలు చదివిన వారు అద్దాల కళ్ళను భద్రపరచే ఒక చిన్నపెట్టెను — దాని ద్వారా ఆయన ఆటవికులకు తన ఐంద్రజాలపు చమత్కారాన్ని చూపెడుతూ వుంటాడు—తనవద్ద వుంచుకొంటాడని తెలుసుకోగలరు. ఆయన ఆ చిన్న పెట్టెలో వున్న అద్దాల కళ్ళను ప్రతి ఒకరి ముఖంలోనూ వాటికోసం ప్రత్యేకించబడ్డ రంధ్రాల్లో బయటి వస్తువులను చూడడానికి వీలుగా అమర్చాడు.

చాంగ్ మహాశయుడు గూడా తన పనిలో నిమగ్నమై వున్నాడు. అపరాధ పరిశోధనలో యెక్కువగా వుపయోగించే భానుమతి సిటూరీని ఎడారి యాత్రలోగూడా వెంట వేసుక వచ్చాడు. దానిలోవున్న రంగులు తీసి ఆనాడు కన్పించిన రధికుని శరీరంమీద వున్న లాంటి రంగును మా శరీరాలకు పులిమాడు. వస్త్రధారణ విషయంలో మాకెలాంటి చిక్కూ లేదు; ఎందుకంటే ప్రాచీన మిశ్రీయుల దుస్తులు నడుము నుండి మోకాళ్ళ వరకుండే ఒక సాధారణమైన లుంగియే.
...తమ చొక్కాలతో తయారు చేసుకొన్నాము.
...రాజారికైన మనుష్యమాత్రుణ్ని గనుక
...రాదు చేసే అవసరం లేదు. ఆఁ, నాతల
...పగించి వెంట్రుకలు తక్కువజేశాడు.

ధీరేంద్రుడు ఆ కాసినిగూడా లేకుండా నున్నగా గొరిగివేశాడు. చాలకాలంగా వుంటూవచ్చిన గడ్డం - మీసాలుగూడా తీసి వేయబడ్డవి. ఆఖరుకు బంగారు పూతగల నా కళ్ళద్దాలుగూడా తీసివేయబడినవి.

సూర్యుడింకొక గంటకు అస్తమిస్తాడనగా మేము పర్వతాగ్రాన్ని పరిత్యజించాం. ప్రాచీన మిశ్రదేశపు దేవతలు హోరస్, అనుబిస్, థాత్ లు, వారివెంట వృద్ధపూజారి-అన్నిటికీ మించిన విశేష మేమిటంటే అందరి చేతుల్లో ఆధునిక బ్యాగ్ లు, తుపాకీలు వున్నాయి. నిజంగా అక్కడ నా పురాతత్త్వ మ్యూజియం స్నేహితులుంటే విరగబడి నవ్వేవాళ్ళు. అనుబిస్ చంకలో ఒక పొడవైన దుర్భిణీవుంది. ఆయన మోహినీ మార్కు బీడిని మాత్రం వదలలేదు. థాత్ వద్ద మందులపెట్టె వుంది. హోరస్ భుజాన సైనికుల కుండేలాంటి దుర్భిణీ వుంది.

ప్రయాణించబోయే ముందు నేను నా దేవతలను బాగా పరీక్షించాను. చాంగ్- ధీరేంద్రులు తమ ప్రయత్నంలో సఫలురయ్యారని నాకు బాగా తృప్తి కలిగింది. ధనదాసు హోరస్ రూపంలో అమోఘంగా వున్నాడు. ఆయన ఎత్తు హోరస్ కు తగినట్లుగా వుంది; ఎందుకంటే మిశ్ర పురాణాల్లో హోరస్ మిగిలిన దేవతలకంటే పొడగరియని చెప్పబడివుంది. ధీరేంద్రుడు అనుబిస్ రూపంలో సరిగ్గా నక్కవలె చంచలంగా వున్నాడు; చాంగ్ బొజ్జ థాత్ కు తగినట్లుగానే వుంది. ఆసీన దేవతా విగ్రహ[illegible] గామిగా నేనే వున్నప్పటికీ మధ్య - [illegible] ఆదేశం తీసుకోవలసి వస్తూండేది.

అతడనుస్తూ అన్నాడు - హోరస్! సంక్షోభమున్నల పుత్పాదకుడైన ఓసరిస్ పుత్రుడా, యీ దాసుణ్ణి కనికరించు.

నేను వాళ్లతో మాట్లాడాలని మొదటనే నిశ్చయించుకొన్నాను. అసలు వాళ్లభాష మాకు అర్థమౌతుందో కాదో పరీక్షించుకోవాలి. నేనన్నాను - శాంతించు! భయపడకు! నైలు దేవతల ఆగమనం. యీ దేశానికి అశుభం చేకూర్చడానికి గాదు.

సాష్టాంగపడిన మనుష్యుడు లేచే ప్రయత్నమే చేయలేదు; కాని అక్కడ నిలబడ్డ రెండవవాడు నావైపుకు చూశాడు. వాడు నామాట గ్రహించినట్లు నా కర్థమైంది. తమకు "పూజామలా" అని వాడు అన్నాడు.

నేను :- మహాదేవులైన హోరస్, అనుబిస్, థాత్‌లు తాము ప్రాచీన యుగంలో వుండే ప్రదేశంనుంచి వస్తున్నారు. నీముందు నిలబడ్డ అనుబిస్, ఓసరిస్ అంత్యక్రియలను పూర్తి చేశారు. జగత్తుకు వెలుగు ప్రసాదించే సూర్య దేవుణ్ణి సృష్టించిన వుషా - సంధ్యల తండ్రి హోరస్. నీ పూర్వజులకు గూడా లభించని జ్ఞానాన్ని ప్రసాదించడానికి వేంచేశారు బుద్ధిదేవత థాత్. 'రా' మందిరంలో సకల సపరిచర్యలతో పాటు ఘనస్వాగతం పొందమని వీళ్లను ఓసరిస్ యీ దేశా...వాడు. రా (సూర్యుడు) మందిరపు క్రిందిభాగంలో ...ర్గాక్షిస్ సమాధి వుంది.

పూర్తయ్యేసరికి నేలపైబడిన ఆ వ్యక్తి వాడు అకస్మాత్తుగా లేచి "దేవ

తలు పృథివికి దిగివచ్చారు. ఇక ప్రపంచం నాశనం కావడాని కెక్కువకాలం పట్టదు" అని అరుస్తూ బయటకి పారిపోయాడు.

రెండవవాడు గూడా యీ మహాదేవతల ముందు తాను ఒంటరిగావడం చూచి కొద్దిసేపు తర్వాత మొదటివ్యక్తి మార్గాన్నే అనుసరించాడు.

నేను వాడి మాటను అర్థం చేసుకొన్నానో లేదో తెలుసుకోవడానికి అవకాశ మివ్వలేదు. అయినా నేను మాట్లాడే భాష, వాళ్ళ భాష ఒకటేనని తేలింది. ఉచ్చారణలో మాత్రం చాల భేదముంది.

ఆ మనిషి బయటికి బోగానే "మీరు వాడి మాటను అర్థం చేసుకొన్నారా" అని ధీరేంద్రుడు అడిగాడు. "తెలుసుకోవడంలో యిబ్బందేమీ లేదు; కాని కొన్ని కొన్ని అంశాల్లో యీ భాష ప్రాచీన నైలు తీరవాసుల భాషతో భేదిస్తుంది. ఉచ్చారణలో యెంతో తేడావుంది" అని నేనాయనతో చెప్పాను.

ధీరేం:- అయితే మన కోర్కె సిద్ధిస్తుంది. మనమిప్పుడు సక్రమమైన మార్గంలో వున్నాం. ఇక మనం ముందుకు సాగవచ్చు. ప్రాచీన మిశ్రీయుల పెద్ద పెద్ద ధర్మోత్సవాలన్నీ నదీ తీరాల్లోనే జరుగుతూండేవని మీరు చెప్పారు; కాబట్టి ఇప్పుడు మనకొక నావ అవసర మనిపిస్తోంది. మనం నదీతీరాన వున్న గ్రామంలో వున్నాం గాబట్టి యిక్కడ నా[illegible] సంభవం.

ఇప్పుడు మేము నది ఒడ్డునే [illegible]
అంతరికన్నా ముందు అనుబిస్ వు[illegible]

దూరం బోకుండానే నది ఒడ్డున ఒక చిన్న నావ దొరికింది. అది ప్రాచీన నైలు తీరవాసులైన పల్లెవారి నావవలె వుంది. ఆ నావ ఒక చెట్టుకు నీళ్ళల్లో దట్టంగా నాచు వున్నచోట కట్టివేసి వుంచబడ్డది.

చాంగ్, ధనదాసు లిద్దరూ మేము వదిలివచ్చిన సామాను తీసుకురావడానికి వెళ్ళారు. ఇక నేనూ, ధీరేంద్రుడూ మహాదేవతల స్వాగతార్థమై నావను అలంకరించి వుంచాం.

మేము మా సామానంతటినీ నావలోని చెక్కల క్రింద వేశాం. దానిమీద దట్టంగా గడ్డి పరిచి చక్కని ఆసనంగా తయారుచేశాం. ధీరేంద్రుడు నావకు వెనుకభాగాన తెరచాప గట్టి దాన్ని నడిపే విధానం గూడా నాకు చెప్పాడు. నావ మధ్యన మేమొక అరుగులాంటిది వేశాం. ఆ పశువుల కాపరుల ఇంట్లో సంగ్రహించిన ఓసరిస్ యొక్క చిన్న రాతివిగ్రహాన్ని దానిమీద స్థాపించాం.

మేము మా నావను వదలిపెట్టినప్పుడు రాత్రి రెండు గంటలయింది. నది ఎంతో ఇరుకుగా వుంది. అయినా అదృష్ట వశాత్తు తెల్లని వెన్నెల్లో ఒడ్డు బాగా కనిపిస్తోంది. "తొందర ఏమీలేదు. మెల్లిగా ప్రవాహంతో పాటు మనం ముందుకు సాగాలి. మన నొసట వ్రాసింది కాకతప్పదు" అని ధీరేంద్రు డన్నాడు.

నావ ముందు భాగానికీ ఓసరిస్ విగ్రహానికీ మధ్య భాగంలో కూర్చున్నందువల్ల త్రోవలో మిత్రులతో మాట్లాడడానికి నాకు చాలా తక్కువ అవకాశమే దొరికింది. జరుగ

జోయేదాన్ని గూర్చిన ఆలోచనలు నా తలలో తీవ్రంగా పని చేస్తున్నవి. నాకీ దుస్సాహసాన్ని గూర్చి చాలా ఆశ్చర్య మేస్తోంది. పాలవెల్లిగా వున్న వెన్నెలలో మా సమీపం దృశ్యం ఎంతో మనోహరంగా కన్పిస్తూంది. నది మలుపుతో బాటు మేము మరోమారు ఆసీన దేవతలవద్దకు చేరుకొన్నాం. వాటి ఆకారం ఇప్పుడుగూడా ప్రశాంతంగానూ, కుతూహలో త్పాదకంగానూ వుంది. మా ముందుగా ఎన్నో గ్రామాలు, పల్లీయుల పూరిళ్లు, అక్కడక్కడా దేవాలయాలూ దాటి పోతున్నవి. మేము ముందుకు వెళ్ళినకొద్దీ నదీప్రవాహం వెడల్పుగానూ, కట్టలు ఎత్తుగానూ వున్నవి.

ఇది చాలా ఎత్తైన సస్యశ్యామల ప్రదేశం. మేము ముందుకు సాగిపోతున్నకొద్దీ పెద్దపెద్ద గ్రామాలు కన్పిస్తున్నవి. ఇళ్ళు యెంతో బాగున్నా ఒక్క మనిషిగూడా బయట కన్పిం చడంలేదు. అక్కడక్కడా ప్రాణిచిహ్నాలు లేవు. ప్రజలంతా నిశ్చింతగా నిద్రిస్తున్నారు. విదేశీ దోపిడిగాళ్లు వేలకొలది మైళ్ళ దూరాన్నించి వచ్చి వారి ప్రాచీన దేవతల రూపంలో వారి ఇళ్లల్లోనే జొరబడ్డారని వారికి తెలియదు.

నీటి వేగం గంటకు రెండు-మూడు మైళ్ళకంటె ఎక్కువ వుండదని మేమనుకొన్నాం. సూర్యభగవానుడు ప్రాచ్యదిశను అలంకరించే సమయానికి మేము పది-పన్నెండు క్రోసుల దూరం మాత్రం వెళ్లగలిగాం. తూర్పుదిక్కు క్షితిజంనుండి పంపునుండి నీరు చిందివ్యాపించినట్లుగానే కాంతిపుంజం వ్యాపించింది.

వెలుగు బాగా వచ్చిన తరువాత మేము అనుకొన్న కార్యక్రమం అమలోపెట్టాం. ఇప్పుడు దైవత్రయం నావ ముందు భాగంలోని అరుగుపై ఆసీనులయ్యారు. అక్కడ హోరస్ ముందువైపుకు ముఖం వుంచి నిలబడ్డాడు. మిగిలిన దేవతలిద్దరూ ఆయన వెనగ్గా వెనుకవైపుకు మొహాలుపెట్టి నిలబడ్డారు. శ్యేనముఖుడైన ధనదాస్ ప్రాచీన మిశ్రదేవతా రూపంలో అధికారయుత తేజస్సుతో వెలిగిపోతున్నాడు. నీటిపై తెల్లని పొగ లేస్తున్న ఆ ప్రభాత సమయంలో యీ స్వర్గదేవతాత్రయం అద్భుత ప్రభావాన్ని ప్రసరింప జేస్తున్నారు.

మొట్టమొదట మాకు కన్పించినవాడొక పల్లెవాడు. వాడు తడిసిన తన వలను ఎండలో ఆరబెట్టుకొంటున్నాడు. వాడి దృష్టి దేవతలపై బడగానే సాష్టాంగపడి మేము కనుచూపు మేర వెళ్లేంతవరకూ లేవనే లేదు.

ఇంకొంచెం దూరం వెళ్లేసరికి ఒక చెట్టుక్రింద బాలుడొకడు కన్పించాడు. ఒంటిమీద గుడ్డలేదు; వెండ్రుకలు మెలికలుతిరిగి వున్నవి. మమ్మల్ని చూడగానే భయంగా తన ఇంటివైపుకు పారిపోయాడు. దేవతలు ముగ్గురూ ప్రత్యక్షమయ్యారని తన తల్లితో చెప్పడానికి వెళ్ళినట్లుంది.

ఇప్పుడు మేము ధనాఢ్యుడో, లేక సామంతప్రభువో అన్నట్లున్న వాని ఇంటిముందుకు వచ్చాం. ఒకగది కిటికీలో రత్నజటిత భూషణాలతో అలంకరింపబడ్డ ఒక యువతి కూర్చొని వుంది. ఆమెకు బంగారు జరీ పనితనంగల టోపీ గూడా వుంది. హస్తాలకు రత్నఖచిత కంకణాలూ, భుజాలకు

మణిజటిత భుజకీర్తులూ, మెడలో అమూల్యమైన ఎన్నో రత్న హారాలూ వున్నవి. మా దర్శనం కాగానే రెండుచేతులూ జోడించి, తల వంచుతూ యేవేవో కొన్ని స్తుతివాక్యాలు పఠించింది. దూరంగా వున్నందున మాకవి విన్పించలేదు. మమ్మల్ని ఇద్దరు ముగ్గురు మనుష్యులు చూచినప్పటికీ విద్యుత గతిని యీ వార్త దేశంలో యీ మూలనుండి ఆ మూల వరకూ వ్యాపించకుండా వుండదని మేము ప్రథమంలోనే నిశ్చయించుకొన్నాం. ప్రజలు ఒక గ్రామాన్నుండి వేరొక గ్రామానికి పరుగెత్తుతూండడం మేమెన్నోసార్లు చూశాం. దేవతలు స్వర్గలోకంనుంచి భూలోకంలోకి దిగారని తెలియ జేయడానికే యీ పరుగులని నిస్సందేహంగా చెప్పవచ్చు. మాకు దూరాన కన్పిస్తూన్న ఒక కుగ్రామానికి సమీపంగానే మేము వెళ్ళాం. అక్కడీవిషయం తెలిసి దేవతల దర్శనంకోసం ప్రబలమైన కోర్కెతో ప్రజలు గుంపులుగా మొదట్నించీ వేచి చూస్తున్నారు. నది వొడ్డున మూడు వందలకు పైగా వున్న జనాన్నిచూసి నాహృదయం కంపించసాగింది. అందులో ఎక్కువగా ఆయుధహస్తులు.

శృగాల ముఖంనుండి ఒక హెచ్చరిక శబ్దం నాచెవుల్లో పడింది — "ధృఢంగా నిలబడి నీపాత్రను నిర్వహించు; నావను నదీ మధ్యభాగంలో వుంచి మేము వెంచేసినట్లుగా హెచ్చరిక చేయి ప్రొఫెసర్."

యీలోగా నేను మాట్లాడడానికి అనువైన మాటలు కూర్చుకొని వాటిని కంఠస్తంగూడా చేశాను ప్రజల దగ్గరకు రాగానే వాటిని పెద్దగా వుద్ఘోషించాను — "నైలుయొక్క

మహత్తర దేవతలు — గత యుగాల్లో మీ పూర్వీకుల రక్షకులు — అనేక శతాబ్దాల తరువాత నేడు తమ బిడ్డల భూమికి వేంచేశారు. వారు శాంతినీ, శుభాన్నీ ప్రసాదించడానికే వేంచేశారు. దేవతలు మానవజాతి సుఖాన్నే కాంక్షిస్తారు.

ప్రజల మాదర్శనార్థం తహ తహ లాడుతున్నారు. కాని వారు నది ఒడ్డుకు చేరుకోవాలని ఒకర్నొకరు నెట్టుకుంటున్నారు. అక్కడి గుంపులో అన్ని వృత్తులకూ చెందిన ప్రజలుండడం చూశాను. వారి దుస్తులు పూర్తిగా పురాతన మిశ్రీయులవే. అక్కడ పొడుగుపాటి లుంగీలు ధరించి, చేతిలో లాటీలుగల వాళ్లున్నారు. దుకాణదారు లెందరో దుకాణాలు వదలి వచ్చారు. వంటవాళ్ళ గరిటెలు చేతుల్లోనే వుండడం గూడా మర్చిపోయారు. పెద్ద పెద్ద శాలువాలు కప్పుకొన్న పండితులుగూడా వున్నారు. స్త్రీలూ, పిల్లలూ లెక్కే లేదు. వారంతా ఒక ఎత్తయిన గోడముందు నిలబడి వున్నారు. వెనుకవైపు ఎన్నో కిటికీలున్న ఒక భవనం వుంది. నా హృదయంలో, నా భావను గూర్చి ఎంతో సందేహిస్తున్నాను. ఇదే సమయంలో భవనం మీద ఒక వ్యక్తి కన్పించాడు. రాకుమారుడో లేక వున్నత రాజకీయోద్యోగో నని అతని దుస్తులు చెపుతున్నవి. అతడు వుచ్చస్వరంతో అన్నాడు—

"రాకుమారుల యొక్కయూ, రాకన్నియల యొక్కయూ ప మందిరాల్లో విశ్రమించే హోంస్ దేవత పృథ్వికి గ వచ్చారు. ఓ నాగరికులారా, మిశ్రీయులారా, మీ పితామహ ప్రపితామహుల దేవతలకు ఘనమైన స్వాగత మివ్వండి."

వెంటనే అక్కడున్న వాళ్ళంతా సాష్టాంగపడ్డారు. నేను గూడా దేవతల ఎదుట అలాగే చేశాను. అప్పుడు దేవ త్రయం ఆశీర్వదిస్తున్నట్లు తమ దక్షిణ హస్తాలను పైకెత్తి మెల్లి మెల్లిగా దించేసుకొన్నారు.

# 14. మితనీ నగర ప్రవేశం

మేము ఆ గ్రామాన్ని వీడగానే ప్రజలంతా తమ ఇళ్ళకు వెళ్ళిపోయారు. సూర్యాస్తమయానికి ముందే, మా ఆగమన వార్త దేశం నలుమూలలా వ్యాపించిన దనడంలో, సందేహం ఏమీ లేదు. ఆ భవన సింహద్వారం తెరువబడడం, అందులో నుండి ఒక రథం బయల్దేరి దక్షిణ దిశగా పోవడం నిజంగా మేము చూశాం. హోరస్, థాత్, అనుబిస్‌లు నది మార్గంగా వస్తున్నారన్న వార్త పర్వత సమీపంలో వున్న రాజధానికి చేరవేస్తాడనడం నిశ్చయం. ఆ దేవతలు తిరిగి మనుష్యుల్లో బుద్ధీ, జ్ఞానం లేనప్పటికాలంలో తాము నివసించిన పురాతన భూమిమీదే అవతరిస్తున్నారు.

ప్రొద్దెక్కినకొద్దీ ఎండ తీవ్రమై పోతోంది. ఆ ఎండను తప్పించుకోవడానికి నేను చెక్కల క్రిందికి వెళ్ళాను. కాని బడివున్న నా మిత్రులకు తమ ముఖాలను మించి తప్పించుకొనే వుపాయ మేమీ లేదు. ఇప్పుడు వారికి ఆకలి – దప్పికల సమస్య వచ్చింది. ఎందుకంటే ఆ రూ... వుండి దేవతలు తినడం కష్టం.

కొంచెం సేపట్లోనే మేమొక పెద్ద దేవాలయం వద్దకు వచ్చాం. అది నది ఒడ్డున వున్నది. అక్కడ విశ్రాంతి తీసుకోవాలని మేమనుకొన్నాం. నదిపాయ ఒకటి ఆలయ గర్భంలోకి చొచ్చుకుపోయింది. నేను నావను అక్కడకు చేర్చాను. ఇప్పుడు మేమొక వసారాలో వున్నాం. దాని కప్పు పెద్ద పెద్ద స్తంభాల మీదవుంది. ఆ స్తంభాలు ఎన్నో చిత్రాలతో, చిత్ర లిపితోనూ అలంకరింపబడి వున్నవి. ఆలయ పైభాగంలో ఇసిస్ దేవి విగ్రహం వుంది. ఆమె శిరస్సుమీద వున్న సూర్య బింబం రెండు కొమ్ములతో పరివేష్టింపబడి వుంది. ఆ విగ్రహం ఒక వున్నతమైన అరుగుమీద వుంది. ఆమె రెండు చేతులూ తొడల మీద వున్నవి. యీ దేవికొరకే యీ ఆలయం నిర్మించబడినట్లు తెలుస్తోంది.

అక్కడ వున్నది కేవలం ఒక్క పూజారి మాత్రం. అతడుగూడా పారిపోవడంగా తన భక్తి శ్రద్ధలను ప్రదర్శించాడు.

అచ్చటి రాతి గచ్చుమీద భక్తులకోసం ఎన్నో చాపలు పరచబడి వున్నాయి. ఆ సమీపంలోనే ఎన్నో రాతి, ఇత్తడి శిలాఫలకాలున్నాయి. మానావ వున్న స్థలానికి చుట్టూ ఇరవై గదులున్నాయి. ఆ గదుల్లో ధూప, దీప, ఫలభోజన యుక్త పాత్రలతో బాటు సారాయిగూడా వుంది. అదంతా ఇసిస్ దేవి నైవేద్య సామగ్రిగా తోస్తూంది.

యీ గదుల్లోనే ఒక దానిలో ప్రవేశించి నా ముస్గును మిత్రులు చక్కగా ఆరగించి వచ్చిందాకా నేను నావమీదే

వున్నాను. గుంపులూ, గోలలూ లేకుండానే ఆలయ భాగాన్ని దాటిపోతామని ఆశించాం; కాని అలా జరిగింది కాదు. నేను దక్షిణదిశగా మనుష్యుల అలికిడివిని ఆలయ ద్వారంలోకి వెళ్ళాను. నది ఒడ్డునే ఒక మనుష్యుల గుంపు రావడం చూచాను.

ఈ గుంపు ముందుభాగంలో ఎందరో పూజారు లున్నారు. నావలెనే ముండిత శిరస్కులు. వారి వెనుకవైపుగా వచ్చే వ్యక్తిని చూచినంత మాత్రాన్నే ఆతడొక ఉచ్ఛ శ్రేణికి జెందినవాడని తెలుస్తూంది. అతని శిరస్సు మీదనుండి వచ్చి లలాటభాగంలో బంధింపబడ్డ వస్త్రం శిర్స్యాణిలాగా క్రిందిభాగంవరకూ వ్రేలాడుతోంది. అతడు ధరించిన లుంగీ వెడల్పాటి బంగారు అంచుతో వుంది. అతడు కుడిభుజంమీద వేసుకొన్న పులిచర్మంలోని ముఖభాగం ముందువైపుకూ, కాళ్లు వెనుకభాగంలో నడుమువరకూ వ్రేలాడుతున్నవి. అతడు వృద్ధుడైనా యేమాత్రం వంగిపోక పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ వస్తున్నాడు. అతని విశాల భుజస్కంధాల్లోనూ, వదనంమీదనూ అధికారయుత తేజస్సు ప్రకాశిస్తూంది.

అతడు ప్రధాన పూజారి అని నేను చూడగానే గుర్తించాను. నేను వెంటనే ఆలయంలోకి వెళ్ళాను. నేను నా మిత్రులతో వెంటనే ముఖాలు తగిలించుకోమని చెప్పాను. ఒక శక్తివంతుడైన పురుషుని కల్సుకొనే అవకాశం కల్గిందని నేను వారితో చెప్పాను.

మేము వసారాలోకి వచ్చే సమయానికి మా పవిత్ర పల్లెనావను పురోహితుడు చూస్తూన్నట్లు గమనించాను.

కాని నా మిత్రులు బయటకు రాగానే వారి సందేహం తీరి పోయి సాష్టాంగ నమస్కారము చేయడానికి నేలపై వాలారు.

నేను ధైర్యంచేసి వారిని నిలబడమన్నాను. అప్పుడు ప్రధాన పురోహితుడు నా ముందుకు వచ్చాడు.

నే మెవరిమో వారికి వివరించాను. తర్వాత దేశాన్ని గూర్చి అనేక విషయాలు అడిగి తెల్సుకొన్నాను. ఎందు కంటే నా సుగ్గురు మిత్రులుగూడా యీ దేశానికి క్రొత్త. పురోహితుడు నా మాటలు తెల్సుకో గల్గుతున్నాడనీ, నేనతని మాటలను అర్థం చేసుకొంటున్నాననీ, ఇందులో ఏమాత్రం ఇబ్బంది కలగడం లేదనీ గమనించినప్పుడు నా మనస్సు తేలికపడింది. అదీగాక ప్రాచీన మిశ్రభాషకు సంబం ధించిన నా జ్ఞానం తక్కువేమీ కాదు. నేను సంవత్సరాల తరబడి దానిలో నా బుర్ర బద్దలు చేసుకొన్నాను.

తన నామధేయం అహ్మాసో అనీ, 'రా' దేవాలయానికి అధ్యక్షుణ్ణనీ, యీ దేశానికి ప్రధాన పురోహితుణ్ణనీ ఆవ్యక్తి నాతో చెప్పాడు. తర్వాత 'సేరిసిస్' మహారాణిని గూర్చి చెప్పాడు—"ఆమె ఇసిస్‌లాగే సౌందర్యవతి, ఆమె హృద యంలో హోరస్ సర్వదా నివసిస్తూంటాడు." ఎవరా హోరస్? తన ఎదురుగా కాళ్లు-చేతులు గల్గిన స్థూలశరీరుడై వున్నవాడే.

నేను అహ్మాసోను అడిగాను—"నీవు నగరాన్నుంచి ఇంతదూరం రావాల్సిన అవసరమేమిటి?" అప్పు డాయన అన్నాడు—"నన్ను నిన్న మహారాణి ఇసిస్ దేవి పూజ జరి

సించవలసిందిగా ఆజ్ఞాపించింది." ఇపుడు స్వర్గాధిపుడైన హోరస్, ప్రజ్ఞాధురంధరుడైన థాత్, నేపథస్ పుత్రుడైన అనుబిస్‌నూ ప్రత్యక్షంగా తన ముందుండడం చూచి అహ్మాసో ఇదేదో దైవ చమత్కార మనుకొన్నాడు. దేవతలు స్వయం గానే తమ ఆగమన వార్తను మహారాణికి ప్రథమంలోనే తెలియజేశారని భావించాడు. ఆయన ఆశ్చర్యంగా హోరస్ వైపు చూస్తూ నన్ను అడిగాడు—"దేవతలు స్వయంగా తమ శ్రీముఖాలతో మాట్లాడుతారుగూడానా ?"

"దేవతలు సహజ మరణధర్మం కల్గిన మానవులతో మాట్లాడరు. వారు నన్ను మాట్లాడమని ఆజ్ఞాపించారు" అని నే నాయనతో చెప్పాను.

"తమ పేరేమిటి ?" అహ్మాసో అడిగాడు.

కొంచెంసేపటివరకూ నేను మౌనంగా వుండిపోయాను. మేము అన్నివిషయాలను గూర్చి చర్చించుకున్నా యీ విష యాన్ని గూర్చిన తలంపే రాలేదు. ఇది పెద్ద పొరబాటు. కాని అదృష్టవశాత్తు వెంటనే అమెన్ యొక్క సుప్రసిద్ధ పురోహితుని పేరు స్మృతికి వచ్చింది.

నేను :- 'థోథ్మస్'.

ఆయన సంతోషాన్ని ప్రకటిస్తూ తల వంచుకొని అన్నాడు—దేవతలు ఎక్కడకు వేంచేయుచున్నారు ?

నేను:- 'రాణివద్దకు.' నేనీమాట అన్నప్పుడు నాశరీరం చల్లబడినట్లయింది. మేము ప్రస్తుతం యుద్ధక్షేత్రంలో వున్నా మనిపిస్తూంది. యుద్ధక్షేత్రంలో వుండి పారంగం త్రవ్వడం

సాహసోపేతమైన పని. పైగా ఆపదతో కూడినపని. అహ్మసో నావవైపు సంకేతం చేస్తూ అడిగాడు—'మా దేవతలు యీ నికృష్టమైన నావమీద ప్రయాణం చేస్తున్నారా?'

దీనికి సమాధానం చెప్పడం చాలా తేలిక—'ప్రథమంలోనే ఓసరిస్ పవిత్రమైన నైలునదీ జలంలో బంగారు నావలో ప్రయాణం చేశారా?'

అహ్మసో:- 'థోథ్మస్, మీరు జ్ఞానవిషయం చెపుతున్నారు.'

నేను అతనితో చెప్పాను—"తాము దక్షిణదిశకు నదీ ప్రవాహంతో పాటే వెళ్ళ గోరుతున్నామనీ, నీవు తప్ప (నేనుతప్ప) నావలో మరెవ్వరూ వుండరాదనీ వారి అభీష్టం." అహ్మసో తర్వాత మితనీనగరపు సంపత్సౌందర్యాలను గూర్చి చెప్పాడు. అప్పుడు నేనాయనతో "కావాలనుకుంటే దేవతల యాత్రకు పనికివచ్చే నావ నొకదానిని పంపండి. దేవతలు దానిపై ప్రయాణం జేయడానికి నిరాకరించరు. మీరు మీ సంతోషంకొద్దీ ఆడంబరంగా వారికి స్వాగత మివ్వవచ్చు" అని అన్నాను చల్లబడేవరకు ఇక్కడే వుండగోరుతున్నామనీ, తర్వాత బయలుదేర గోరుతున్నామనీ చెప్పాను. దీనికి సంబంధించిన యేర్పాట్లన్నీ చేస్తానని ఆయన మాట యిచ్చాడు.

ఈ సంభాషణ సమయంలో అహ్మసోగాని, ఆయన వెంట నున్న తదితర పూజారులుగాని నేరుగా దేవతలను చూడటానికి సాహసించలేకపోతున్నారని నేను గమనించాను. మా సంభాషణ పూర్తికాగానే ప్రధాన పురోహితుడు తన

అనుచరులతో సహా దేవతల ముందు సాష్టాంగపడ్డారు. ప్రధాన పురోహితునితో కలసి వారు పాడిన ప్రార్థనాగీతం అసలు అంతమే గాదన్నంత దీర్ఘంగావుంది. తర్వాత మమ్మల్ని వంటరిగా అక్కడే వదలి వెళ్ళిపోయారు. ఈవిధంగా చాల తేలికగా వాళ్ళు వదలిపోవడంతో ఎంతో ఆనందం కల్గింది.

చల్లబడగానే మళ్ళీ మా యాత్ర ప్రారంభించాం. ఇదొక విధమైన విజయోత్సవం. మా ఆగమన వార్త దేశ మంతటా వ్యాపించినందువల్ల రెండుగంటలనుండే నదిఒడ్డున దర్శనాకాంక్షులు నిలబడి వున్నారు. ఈ దేశపు జనసంఖ్య యింత యెక్కువగా వుంటుందని నే ననుకోలేదు. ఇంకా పైభాగంలో యెంతో దూరంవరకూ చాల బస్తీలున్నాయని నా స్నేహితులు నాతో అన్నారు. మేము గుంపువద్దకు వచ్చి నప్పుడల్లా అక్కడున్న యావత్తు జనం నమస్కరించడానికి నేలమీద వాలుతున్నారు.

నేటియాత్ర పచ్చికగల, సారవంతమైన సుందరప్రదేశం గుండా సాగిపోతోంది. ఆ పగలంతా ఆసీనదేవతల మార్గం మాకు కన్పిస్తూనే వుంది. దేశం మొత్తంమీద అంతటి ప్రభావాత్మకమైన దృశ్యం మరొకటి కన్పించదు. ఆ నోరు లేని శిలా విగ్రహాల మార్గం వర్తమానాన్ని, భూతకాలంతో కలిపి వేస్తున్నట్లుంది.

చీకటిబడ్డ కొద్దిసేపటి తర్వాత నది ఒడ్డున దూరంగా ఒక వెలుగు కన్పించింది. సమీపానికి చేరుతున్నకొద్దీ వందల కొలదిగావున్న కాగడాల వెలుగు యింకా స్పష్టమౌతోంది.

ఎన్నోనావల్లో యెందరో మనుష్యులు చేతుల్లో కాగడాలుపట్టు కొని మా వైపుగా వస్తున్నట్లు కన్పిస్తోంది. వారు పాడేపాట ఒక మైలు వరకైనా విన్పించేట్టుంది. నాకు తెలిసినంతవరకు యిది దేవతల (ముగ్గురి) స్తుతిగాన మనుకొన్నాను.

మే మా ప్రకాశానికి దాపుకు చేరగానే నా స్నేహితుడైన అహ్మాసో చాల ఘనంగా స్వాగతమిచ్చి "ఒక పెద్ద వుత్సవనావ దేవతల సేవార్థమై వస్తున్న" దని చెప్పాడు. ఆయనింకా యిలా అన్నాడు - తమ వద్దనుండి వెళ్ళగానే, నేను శరవేగంతో బోయే రథంమీద శీఘ్రంగా మితనీ నగరం చేరుకొన్నాను. నే నక్కడకు వెళ్లకముందే, దేవతలు వేంచేస్తున్నారన్న వార్త మహారాణికి తెలిసింది. మహారాణి మహాదేవతల పాదపద్మాలకు వినయపూర్వకంగా నమస్కరించి నివేదించుకొంది – "నేను అన్నివిధాలా తమ చరణసేవకు సిద్ధంగా వున్నాను. నేనేదైనా అపరాధాలు చేసివుంటే, ప్రభూ! నన్ను క్షమించండి. నేనేమైనా సుకృతం చేసివుంటే వందనీయులైన హోరస్, థాత్, అనుబిస్‌లు యీ చిరసేవికను జ్ఞాపకముంచుకొంటారు. నేను రాజ్యభారం వహించి నప్పటినుంచీ నా ప్రజలను ప్రసన్నులుగానూ. సుఖవంతులుగా చేయడంలో, లోపమేమీ చేయలేదు. ప్రాచీన మిశ్రదేశపు [illegible]కర్మలను యేమాత్రం వుపేక్షించవద్దనీ, చక్రవర్తులను [illegible]గానూ, యశోవంతులుగానూ చేసిన ఆమీ పూజ్య[illegible] విస్మరించవద్దనీ ప్రజలను నేనెప్పుడూ

దేవతలు, సేర్సిస్ మహారాణి వల్లగానీ, ఆమె దేశపు వో ఒక్క మానవుని వల్లనూ కించపడలేదని నేను అహ్మాసోకు తెలియజేశాను. నేను మాట్లాడే సమయంలో నాకు యింకో విషయం కష్టమయమనిపించింది. అంత పెద్ద నావను ఒక్కణ్ణే యెలా నడపగల్గుతానా అని ఆలోచిస్తున్నాను. ఇతరుల కళ్లు గప్పి మా సామగ్రినంతా దానిలో చేర్చడం యెలాగన్నది యింకో బాధ. ఈ మిశ్రీయులకు తుపాకులను గురించిగానీ, గుండ్ల పెట్టెలను గురించిగానీ రవ్వంతైనా తెలియదనడంలో సందేహంలేదు. కాని సర్వశక్తివంతులైన యీ ముగ్గురి మహా దేవతలకు వాటి అవసరమేమిటో వారికేమి (ప్రజలకు) తెలుసు ? నాకు దీన్ని గూర్చిన వుపాయమేమీ తోచలేదు. నేనిప్పుడొక చంచలచిత్తుడనయ్యాను. చాంగ్ - ధీరేంద్రుల సలహా తీసుకోవలసివుంది. కాని అహ్మాసో వుండగా వాళ్ళతో మాట్లాడడానికి వీలులేదు. నేనప్పుడతనితో "దేవతలతో యీ విషయం పరామర్శించాలని, మీరు కొంచెంసేపు తప్పు కోవాలని" చెప్పాను.

అహ్మాసో అక్కడినుండి పోగానే, నేను పరిస్థితినంతా చెప్పాను. ధనదాసు - ధీరేంద్ర - చాంగ్‌లు యెత్తైన అపగు మీద మొదటిలాగే నిలబడివున్నారు. నేను నావ మధ్యలో వుండి మాట్లాడాను. చాంగ్ మహాశయుడు వెంటనే యీ సమస్యను తేల్చివేశాడు.

చాంగ్ :- దేవతలమైన మేము
చేయబోమనడం స్పష్టం. దేవతలు

చూస్తే ప్రజల్లో భక్తి సన్నగిల్లుతుంది. మీరు అన్నట్లుగా వారికి మన వస్తువులను జూసే అవకాశం మివ్వడం మంచిది కాదు. మన విషయంలో వారికెంత తక్కువ తెలిస్తే అంత మంచిది. మన నావకంటే అది 5 రెట్లు పెద్దదిగా వుండడం మీరు చూస్తూనే వున్నారు. అందులో 3 వైపుల మూసి వేయబడ్డ మండపం వుంది; ఎదురుగా తెరచివున్న భాగాన్ని గూడా మూసివేయవచ్చు.

ఇంతలోనే ధీరేంద్రు డన్నాడు. — "అక్కడకు చేరు కొంటే సంతోషంగా మన కృత్రిమ ముఖాలను తొలగించ వచ్చు. నాకు బీడీ త్రాగే అవకాశం లభిస్తుంది. చాంగ్ మహాశయా, మధ్యలో అడ్డు వచ్చినందుకు క్షమించండి. ఇక మీరు చెప్పండి."

చాంగ్ :- తెరచాప స్తంభానికొక త్రాడుగట్టి నది కిరువైపులా ఒక్కొక్కడు ఆ నావను లాక్కురావడం మీరు చూశారు. ఆ త్రాళ్ళను యీ డింగీక్రింద దూర్చి పెద్ద నావ మీదకు ఎత్తిపెట్టడం తేలికగానే వుంటుంది

ధన :- భలే బాగుంది. తర్వాత పనంతా కొద్ది నిము షాల్లోనే జరిగిపోతుంది. మండపం క్రింద మన వస్తువులను తేలికగా దాచగల్గుతాం.

మా సంభాషణ పూర్తయ్యాక నేను అహ్మసోను పిలచి దేవతల అభీష్టాన్ని తెలియజేశాను. దేవతలు వెంటనే వెళ్ళి పెద్దనావ ముందు భాగంలో నిలబడ్డారు. డింగీని లేప డానికి వచ్చినవాళ్ళు దేవతలను జూచి సంకోచించారు.

కాని నేనూ, అహ్మొసో చెప్పిన మాటలు వారి సంకోచం తొలగిపోయింది. నేను అహ్మొసోతో "దేవతలు నావ నడప డానికి కొందరు మనుష్యులను కోరుతున్నారనీ, అయినప్పటికీ యిప్పుడు వారి అవసరం లేదనీ, నేటి రాత్రంతా వారు విశ్రాంతి కోరుతున్నారనీ. ప్రాతఃకాలంతో బాటు వారి యాత్రగూడా ప్రారంభ మౌతుందనీ" చెప్పాను.

ఇప్పుడిక మేం నలుగురం మాత్రమే మిగిలాం. సులభం గానే మా సామానంతా దించేసుకొన్నాం. మా సామా నంతట్నీ మూటలుగా కట్టి గడ్డిలో చుట్టి చెక్కల క్రింద సుర క్షితంగా అమర్చివుంచాం. ఈ పనంతా పూర్తయ్యేసరికి మేము అలసి అలాగే పడుకొన్నాం. దేవతలు ముగ్గురూ ముందే గురక మొదలుపెట్టారు.

యవనుల, రోమ్ దేశీయుల దేవతలవలెనే మిశ్రదేశ దేవతలుగూడా ఎన్నో మానవ గుణాలు గల్గివుండడం నిజం. సాధారణ మనుష్యుల వలెనే అనేక దోషాలు వారిలోనూ వుండేవి. మామూలు రైతులకు వలెనే హోరస్, ఓసరిస్ లకు నిద్రా, ఆహారాలు అవసరమవడంగూడా ఇందువల్లనే. మేము వుదయమే లేచి మండపం చాటున స్నానాదులు ముగించుకొన్నాం. తర్వాత నావమీద కొచ్చిన నైవేద్యా లను గూడా ఆరగించాం. అప్పుడు దేవతలు మండపంనుంచి బయటకొచ్చి నావ ముందు భాగాన వున్న సుందరమైన ఆస నాల మీద ఆసీనులయ్యారు. నేను దేవతల తపోదినం గనుక నిష్టలాగా నిలబడాల్సిన అవసరం లేకపోయింది.

మా యాత్ర ప్రథమభాగం తేలిగ్గా ముగిసినట్లే అంత్యభాగంగూడా ఆనందంగా సాగింది. మేమెంతో ఆడంబరంగా మిత్రనీ నగరానికి బయలుదేరాం. ఆసీన దేవతల మార్గం మా ఎడమ ప్రక్కగా వస్తోంది. మేము ముందుకు సాగిన కొద్దీ కుడివైపు కొండ సమీపిస్తోంది.

దక్షిణంగా పోయి పోయి నది పర్వతాన్ని దాటి పోయింది. మేమిప్పుడు ఎంతో సస్యశ్యామలమైన, సుందర ప్రదేశానికి చేరుకొన్నాం. అక్కడ మా చుట్టుప్రక్కల ఎన్నో అందమైన పర్వతాలూ, అరణ్యాలూ, గ్రామాలూ, పెద్ద పెద్ద రోడ్లూ, ఆలయాలూ కన్పిస్తున్నవి. ఇదొక స్వప్నస్థల మన్పిస్తోంది. వేలకొలదిగా ప్రజలు మమ్మల్ని అనుసరిస్తున్నారు. నది కిరువైపులా జనసందోహమున్నది. మాకు ముందుగా అహ్మాస్ నావ నడుస్తోంది. వెనుక వున్న ఎన్నో నావల్లో గాయకులు, భజంత్రీలు గానం చేస్తూ వస్తున్నారు.

నావ వెనుక భాగపు కొన వంకరగా పైకి లేచివున్నది. దాని ఆకారం కమలంవలె వుంది. నావ ముందు భాగం ఒక భయంకరమైన పొట్టేలుతల ఆకారంగా వున్నది. దాని రెండు కొమ్ములూ వెనుకవైపుకు వెళ్ళి దూరంగా వున్న దేవతల సింహాసనాన్ని చుట్టుకొని వున్నవి. నది ఒడ్డున ప్రజలు ... పడినప్పుడల్లా దేవతలు తమ దక్షిణ హస్తాలను ...గా పైకెత్తుతున్నారు. ముసుగులోనూ ధన... బాగా నిర్వహిస్తున్నట్లున్నది. అతడు ఆశీర్వదించే పద్ధతిలో ఒక రకమైన

హుందాతనం, ప్రభావం తొణికిసలాడుతున్నవి. ఆయన చేష్ట లన్నీ మిగిలిన ఇద్దరి దేవతలకంటే చాలా గంభీరంగా జరిగి పోతున్నవి. ధీరేంద్రుని ఇబ్బంది యేమంటే, ఆయన నక్క ముఖం ఎంతో బిగించబడి వున్నందువల్ల శ్వాస పీల్చుకోవడం గూడా కష్టంగా వుండడం.

యీ రోజునే మేమొక పెద్ద గ్రామంగుండా వెళ్లాం. ఆ గ్రామస్థులు ఆఫ్రికా ఆటవిక జాతిని తమ బానిసలుగా వుంచుకొంటున్నారని తెల్సింది. ఆ బానిసలు నీగ్రోలవలె దృఢకాయులైన హబ్షీలు. ఇదెందుకు చెపుతున్నానంటే మా అతిసుకుమారమైన దేవతలు సూర్యతాపం అధికంగా వున్న దన్నారు. నేనీ విషయాన్ని అహ్మోసేతో చెప్పగా అతనొక లావుపాటి హబ్షీవాన్ని పంఖా విసరడానికి పంపాడు.

ఈవిధంగా మరి మూడు రోజులు యాత్రచేసి మేము మితనీనగరాన్ని చేరుకొన్నాం. నేను ప్రథమంగా ఆ విచిత్ర మైన నగరంమీద దృష్టి సారించగానే థేబిస్ జ్ఞప్తికొచ్చాడు. మొట్టమొదట మేము చూచిన ఇళ్ళు మట్టితోనూ, పచ్చి ఇటుకతోనూ నిర్మించబడి వున్నవి. తాటి వాసాలమీద కెల్లు కప్పు వేసివుంది. నగరంలో ప్రవేశించినప్పుడు అక్కడ చిన్న చిన్న ఖాళీప్రదేశాలు, వాటిలో పచ్చిగడ్డీ, చిన్న చిన్న వృక్షాలూ వుండడం చూశాం. అంటే అవి యీనాటి పార్కుల్లాగానే వున్నవి. రోడ్లు విశాలంగా లేనప్ప ముందుకు వెళ్తున్నకొద్దీ పెద్దపెద్ద భవనాల మేము నగర మధ్యభాగానికి వచ్చేసరికి యాలూ, పెద్ద భవనాలూ, వుద్యానవన

డడం చూశాం. ప్రతి భవనం చుట్టూ ఎత్తయిన ప్రాకారాలు వున్నవి. ద్వారాలు దేవదారు కొయ్యలతో చేయబడినవి. వీటిమీది పనితనం చాలా అందంగా వున్నది. తోటల నిండా బాగా పళ్ళతో నిండిన ద్రాక్షచెట్లున్నవి.

ఈ విచిత్ర దృశ్యం—లేక సూర్యతాపమో—నన్ను సోమరిగా చేసింది. పోతూ పోతూ ఒకచోట మా నావ అకస్మాత్తుగా నిలిపివేయబడడం నాకు బాగా జ్ఞాపకం. ఇక్కడి నుంచి అందమైన రాతిసోపానాలు ఒక పెద్ద భవనంవైపుకు వెళ్తున్నవి. సోపానాల కిరువైపులా, వరుసలుగా చాలామంది సైనికులు నిలబడి వున్నారు. వారి కవచముల కాంతి మిరుమిట్లు గొల్పుతోంది. వారి చేతుల్లో విచ్చుకత్తులూ, చతుష్కోణంగా వున్న డాలులూ వున్నవి.

మా నావ అక్కడకు చేరగానే ప్రాసాద ద్వారంనుండి నగారా విన్పించింది. అహ్మాసో నావనుంచి దిగాడు. ద్వారం తెరువబడగానే లోపల చాలా చిన్నచిన్న చెట్లూ, ద్రాక్ష లతలతో నిండిన అత్యంత రమ్యమైన వుద్యానవనం ఒకటి చూశాం.

వుద్యానవనం మధ్యగా ఒక బాటవున్నది. ఆమార్గాన ఒక మనుష్య సమూహం రావడం చూశాను. మెల్లమెల్లగా వారు మెట్లు దిగి వచ్చారు. ఆ గుంపులో నిజం చెప్పాలంటే నా దృష్టి కేవలం ఇద్దరి వ్యక్తులవైపుకు మాత్రమే ప్రసరించింది. వారిలో ఒక వ్యక్తి చాలా పొడవూ - పొడవూ గల పురుషుడు. అతని శరీరంమీద సువర్ణకవచం తళతళ మెరిసి

పోతూంది. అతని ముఖంమీద గాంభీర్యం, అధికార లక్ష ణాలు వుట్టిపడుతున్నవి. రెండో వ్యక్తి స్త్రీ. ఆ వుత్సవానికి అగ్రగామిగా వచ్చిన దీమే.

ఆమె శరీరంమీద వజ్ర వైఢూర్యాలు పొదిగిన ఒక వస్త్రం అంటించబడినట్లుంది. ఆమె కంఠహారం, గాజులూ, భుజకీర్తులూ - అన్నీ అనేక రకాలైన అమూల్య రత్నాలతో పొదగబడి వున్నవి. ఆమె నల్లని ఉంగరాల శిరోజాలు మెడ నుండి నితంబముల క్రింది భాగంవరకూ వ్రేలాడుతున్నవి. శిరస్సూ, లలాటపు అర్ధభాగమూ సువర్ణ ఛాయగల పుమాలతో కట్టబడి వున్నవి. సరీగ్గా నుదుటి పైభాగాన రత్నజటిత శిరస్సు గల సర్పమున్నది. ఆ సర్పమే తన పడగతో లలాటాన్ని నలువైపులనుండి చుట్టుకొని ఆడుతున్నట్లుంది. దానికి మధ్యలో ఒక గొప్ప విలువైన వజ్రం పొదగబడి వున్నది. ఎవరో అన్నట్లు "స్వచ్ఛమైన సౌందర్యం కృత్రిమాన్ని ఆశించదు. కృత్రిమ పుష్పంలో సహజ వికసిత పుష్ప సౌరభం ఎలా సంభవం ?"

ఆ సుందరియొక్క అద్వితీయ సౌందర్యాభివృద్ధి యీ కృత్రిమ ఆభూషణాలమీద ఆధారపడి లేదు; పైగా అవే ఆమె లావణ్య శరీరంమీద స్థానం సంపాయించి తమకు తాము కృతకృత్యులమయ్యామని సంతోషిస్తున్నవి. ఆమె రెండో రంభో, లేక శచీదేవో ననిపిస్తూంది. ఆమెను చూడగానే ఫరోవా వంశజ, సెరాఫీయుల మహారాణి సేరిసస్ యీమేననీ అనుకొన్నాను.

15

# “సోహరీ” సేనాని

సోపానాలు దిగివచ్చి తన యిష్టదేవత లనుకొన్న ఆ త్రయానికి మితనీనగర రాణి సాష్టాంగపడింది. అప్పుడు ను - నా మిత్రులూ యెంతో ఆత్మగ్లాని ననుభవించాం. మా హృదయం మమ్మల్ని సిగ్గుపరుస్తోంది. వారి దేవతలపట్ల, ధార్మిక విశ్వాసాలపట్ల కపటంగా ప్రవర్తించడం సబబేనా? కాని నాకు సంబంధించినంత వరకు నా ధర్మంతో పాటే ఆ సరళ, సాత్విక ప్రాచీన ధర్మం గూడా ఆదరణీయమైనదే. స్వప్నంలో అమెన్ దేవతను తూతన్ ఖామున్ రాజు పూజిస్తూండడం చూచినప్పుడు నేను నా మనస్సులో పరిహసిస్తూండేవాడనా? లేదు, లేదు. నేనా పూజను చాల శ్రద్ధతోనూ, సౌహార్ద్రంతోనూ, యెంతో భక్తిపూరిత హృదయంతోనూ చూస్తూండేవాణ్ణి. నా ముగ్గురు మిత్రులు గూడా అలాటివారే. ఒకవేళ లోభపరవశుడైన ధనదాసుకు యేమీ బాధ కలుగకపోయినా చాంగ్, ధీరేంద్రులకీ విషయం బాధాకరంగానే వుంది. ఎందుకంటే మేమే జాతినిగానీ, వ్యక్తినిగానీ పరిహసించే పద్ధతికి పూర్తి విరోధులం. కాని మాకు యిక గత్యంతరం లేదు. విద్యాలోభం మమ్మల్ని ఇచ్చటకు చేరవేసింది. ఇక అక్కడ ప్రాణం దక్కించుకోవడానికి, మా జిజ్ఞాసలను పూరించుకోవడానికి వేరు వుపాయ మేమీ లేదు.

భద్రశీలయైన ఆ మహారాణి సాష్టాంగ పడినప్పుడు భయంతో ఆమె శరీరం కంపించడం చూశాను. ఒక అత్యంత

మృదు మధురమైన స్వరంలో తన పరిజనులను కొంచెం సేపు తప్పుకోమని చెప్పింది. ఆ స్వర్ణ కవచధారియైన పురుషుడు తప్ప మిగిలినవారంతా దూరంగా వెళ్ళారు. అప్పుడు మహా రాణి చేతులు జోడించి నాతో యిలా అన్నది—

"మా పితామహ - ప్రపితామహులయొక్క పూ దేవతల చరణకమలాలు యీ తుచ్ఛమైన మితనీ నగరం నివసిస్తాయా ?" ఆమె అధరాల కదలిక మాత్రంతోనే నాకు విషయం తెలిసింది. నేను సులభంగా తెలుసుకోగల్గి మాండ్లాడ గల భాషను ఆమె మాట్లాడుతోంది. ఆమె వుచ్చారణకూడా సరిగ్గా నేనూహించినట్లుగానే వుంది. ఆ భాష థేబీయ రాజ వంశ పారంపర్యంగా వచ్చి యుండవచ్చు. నేను అప్పుడు యవన చరిత్రకారుడైన హెరొడోతస్ వ్రాసిన "ఎడారి నివాసులు మిశ్రవంశజులు" మాటను జ్ఞప్తికి తెచ్చుకొన్నాను బహుశా ఇది లిబియాలోకి చొచ్చుకువచ్చిన ఆ మిశ్రజాతే అయి వుండవచ్చు.

తర్వాత నేనామె ప్రశ్నకు సమాధానం చెప్పాను— నాకు తెలిసినంతవరకు పూజనీయులైన దేవతలు 'రా' మంది రంలో వుండాలనుకొంటున్నారు.

మహా :- అయితే నిజంగా మా మహద్భాగ్యం. అయినా నేను భయపడుతున్నాను.

నేను:- భయపడకు మహారాణీ. దేవతలు నీ మేలును గోరే వెంచేశారు.

ఆమె సతమస్తకురాలై వెళ్ళాలనుకుంటూనే వుంది; ఇంతలోనే ఆ సువర్ణ కవచధారి ముందుకు వచ్చి బెదరిస్తున్నట్లుగా నన్నడిగాడు—"అయితే నీవెవరవు ?"

ఇక్కడ యేమాత్రంగానైనా దౌర్బల్యం చూపడం హానికరమని నేను బాగా తెలుసుకొన్నాను. నేను ప్రశాంతంగా జవాబిచ్చాను—'పూజారిని. చూస్తేనే తెలుస్తుందిగా.'

అతడు కనుబొమలు ముడిచి అన్నాడు—'నీపేరు ?'

నేను:- 'థోథ్మస్.'

సు. క.:- 'ఓ, చాల పెద్దపేరు! అయితే ఎక్కడినుంచి దిగావు ?'

నేను :- ఎడారివద్దనుండి దేవతల సేవార్థమై పిలిపించబడ్డాను.'

సు. క.:- ఎడారికి అవతలవైపేముంది ?

నేను :- "ఎడారిలో సైకత రాజ్యం వుంది. అక్కడ నేమ్ఫ్తస్ హృదయం రిక్తంగా వున్నందుకు యేడుస్తుంది. నీ వొక గొప్ప యోధుడవు, శూరుడవు అయినప్పటికీ, యెడారికి ఆ వైపున నీకంటే గొప్ప గొప్ప మనుష్యులే నివసిస్తున్నారు." ఆ వ్యక్తి నాస్తికుడుగా కన్పిస్తున్నాడు.

నిశ్శబ్దంగా వుండమని సంకేతం చేస్తూ మహారాణి అన్నది — 'ప్రశాంతంగా మాట్లాడు నొహాక్; నీవెప్పుడూ ఆవేశంగానే వుంటావు; అనాలోచితంగా మాట్లాడుతావు. దేవతల వెంట వచ్చిన యీ వ్యక్తి నీకంటే తెలివిగలవాడే; నీవొక మూర్ఖ సైనికుడవు మాత్రమే.

ఇది వినగానే ఆ వ్యక్తి తన కత్తిపిడిపై చేయివేసి వుద్రేకంతో అన్నాడు – "మహారాణీ, మీకేమైనా ఆపదలు వస్తే మీ సేనానిని నిందించరాదు. వీరు నిజమైన దేవతలౌనో కాదో నాకు తెలియదు. నేను వీరినేమీ లక్ష్యపెట్టడంలేదు. నొహారీ యే దేవీ-దేవతల పూజా-ప్రార్థనల్లో యిరుక్కోడు. వాళ్ళు ఎక్కడినుండి వచ్చారో అక్కడికే పంపివేయడం మంచిదని మీతో చెప్పాలనుకొంటున్నాను మహారాణీ. దేవతలు పృథివిపై సంచరిస్తారని నేనెప్పుడూ వినలేదు."

ఇక్కడ వున్నంతవరకూ యీ వ్యక్తి మాత్రమే హాని కారకుడౌతాడని నేనప్పుడే అనుకొన్నాను. మహారాణి, ప్రధాన పురోహితుడు మొదలు సాధారణ వ్యక్తి వరకు యేమాటను తర్కించకుండా తగిన ఆధారం లేకుండా ఒప్పుకొనని వాడు యితడొక్కడే.

మా మధ్య జరిగిన మాటలన్నిటినీ ధీరేంద్రుడు విన్నాడు. మా సంభాషణలోని ఒక్క శబ్దంగూడా తెలియనప్పటికీ నొహారీ ముఖమూ, స్వరమూ యేదో అసాధారణమూ, క్రోధపూరితాన్ని సూచిస్తున్నట్లు ఆయన గమనించాడు. ఏమైనా ఆయనొక సాహసకార్యం చేశాడు. దానిలో ఆశించని ఫలితంగూడా లభించింది.

మేము మాట్లాడుతుండగానే ధీరేంద్రుడు దిగి నొహారీవైపుకు నడిచాడు. రాణి భీతితో అహ్మోసె వెనుక దాగింది. కేవలం పూజారులు, దాస, దాసీలు మాత్రమేగాక సైనికులు గూడా అనుబిస్ (యమరాజు) ను జూచి వెనుకంజవేశారు.

నోహారీ అక్కడే నిలబడివున్నాడు. అతడు నిర్భయం గానూ, ధైర్యంతోనూ వుండాలని ప్రయత్నించినా అతని ముఖంమీద భయరేఖలు కన్పించినవి. దగ్గరకువెళ్ళి చాల మెల్లగా అనుబిస్ తన చేతినెత్తి సరిగ్గా నోహారీ గుండెపై చాల మెల్లగా వుంచాడు. తర్వాత, తన స్థానానికి తిరిగి వచ్చాడు.

ఈ సంకేతార్థాన్ని గ్రహించడం చాల తేలిక. జన మంతా ఆశ్చర్యచకితులై నోహారీవంక చూడడం నేను గమ నించాను. ఇక నోహారీ కొన్ని గంటలపాటు మాత్రమే జీవి స్తాడని అందరూ అనుకొన్నారు. కొద్ది క్షణాలక్రితం అతని మాటలు, భావాలు యెంతో వుద్రిక్తంగావున్నా ఇప్పుడతడు గూడా కొంచెం తెలుసుకొన్నట్లుగావుంది. అతడు రాణివైపు కొకసారి జూచి సోపానాల మీదుగా వేగంగా ప్రాసాద ద్వారం దాటి తిరోహితుడయ్యాడు. అతడలా వెళ్ళగానే మహారాణి నావైపుకు తిరిగి అన్నది—

"మా పూజ్య దేవతలు నాస్తికుని ఆక్షేపణలను లెక్కించకుందురుగాక. నోహారీ ఒక గొప్ప వీరుడూ, సైని కుడూ అయినప్పటికీ తలబిరుసుగల వ్యక్తి. అతడు నరులకు గానీ, అమరులకుగానీ భయపడడు. హోరస్ సహజంగా కఠోరమైన మాటను సహించడనీ, మృత్యుదేవత అనుబిస్ అపరాధిని క్షమించడం యెరుగడని నాకు తెలుసు. అయినప్ప టికీ నా పూజ్యదేవతా చరణాలు అతని అపరాధాన్ని క్షమించాలి. ఎందుకంటే ప్రాచీన మిశ్రీయులను శాసించిన

మహాదేవతల చరణాల్లో నెఫ్రిసిస్ హృదయం సమర్పించు కుంది.

నేను అనేకవిధాల ఓదార్చాను. తిరిగి అహ్మసోతో పాటు నావమీదికి వెళ్ళాను. ఇప్పుడు నావ అక్కడినుంచి 'రా' మందిరంవైపుకు సాగింది. మా నావ బయలుదేరే సమయంలో మహారాణి మళ్ళీ సాష్టాంగపడటం చూసి సైనిక, దాస-దాసీలందరు ఆవిధంగానే చేశారు.

సూర్యుడు అస్తాద్రిని చేరుకొన్నాడు. మా నావ నగర మధ్యభాగంగా వెళ్తోంది. మా సమీప గృహాలు, ప్రాసాదోన్నత శిఖరాలు సాంధ్యరక్తిమారంజితాలైనవి. ఇచ్చట మేంఫిస్, థేబిస్, సాయిస్‌ల సౌందర్యమంతా కేంద్రీకరించబడింది. ఈ ప్రాచీన సభ్యతగల మిశ్రభూమిలో, ఆధునిక ప్రపంచపు గృహ పరిశ్రమలు, శిల్పకళలు, ఆహార విహారాలూ, ఆచార వ్యవహారాలు అన్నీ జీవించే వున్నవి. కాని ఒక దుర్గమమైన యెడారి యీ ప్రాచీన భూమిని బహుధా వికసితమైన ఆధునిక ప్రపంచాన్నుంచి వేరుచేసింది.

ఇదొక విచిత్ర స్వప్నం. నదీప్రవాహంలో ప్రయాణిస్తూన్నప్పుడు నా మనోహర స్వప్నం భగ్నమై మళ్ళీ నలందాలో నా మంచంమీద పడివుండాల్సి వస్తుందేమోనని భయపడుతూండేవాడిని. ఆధునికజగత్తు ఇక్కడ కెంతదూరం! విద్యుత్తు, వార్తాపత్రికలు, యింకా వేలకొలది ఆధునిక విషయాలు మాకెంతో దూరాన వున్నవి. తిరిగి నా క్షీణ స్మృతిలో శివనాథుని ఛాయలు కన్పించినవి. నావలోనే ఆ వ్యక్తిగూడా యీ దృశ్యాన్ని చూచి వుండవచ్చని నేనను

కొన్నాను. ఒకటి రెండుచోట్ల నోట్ చేయడం తప్ప అతడీ విషయాలను యెవరితోనూ చెప్పలేదు. ఆయన చాలా నిర్ద యత్వంగా చంపబడ్డాడు. మేమింత సాహసం చేసి వుండకపోతే ఆ వ్యక్తి కనిపెట్టినదంతా వ్యర్థమే అయ్యేది. ఎందువల్లనో గాని మేముకూడా ప్రాణాలతో తిరిగి వెళ్ళతామన్న ఆశ లేదు. ఆ సమయంలో నా మస్తిష్కంలో తిరుగాడుతూన్న ఆలోచన లేమంటే—ఒకవేళ తిరిగి వెళ్ళినప్పటికీ యీ అసం భవ వుదంతాన్ని నిజమని చెప్పి ప్రజలముందు నిలబడే దుస్సా హసం ఎవరుచేస్తారు? ఇదే సమయంలో మా నావ ఆగి పోయింది. ఇప్పుడు మేమంతా నగర పశ్చిమాంతంలో వున్న 'రా' (సూర్య) భగవానుని భవ్యమందిర ప్రాంగణంలో వున్నాం.

## 16

## "రా" మందిర ప్రవేశం- 'స్పారో' పునరాగమనం

మొట్టమొదట మేము మకాం చేసిన 'రా' మందిరం నగరమంతటిలోనూ, రాణీ, సేనాపతుల భవనాలకంటేకూడా అందంగా వుందనడం నిస్సందేహం. ఈ అద్భుత దేవాలయం నగర పశ్చిమ భాగాన వున్న ఒక కొండమీద వున్నది. అందులో అనేక విధాలైన పెద్ద పెద్ద శిలావిగ్రహాలున్నాయి. ఈ దేవాలయం, సమీపంలోనే వున్న ఒక చలువరాతి గని

నుండి తీయబడ్డ రాతితో నిర్మించబడింది. ఆ మందిరపు రాళ్లను చూస్తుంటే యంత్ర సహాయం లేకుండా ఇంత పెద్ద శిలాఖండాలను పైకెట్లా పంపగలిగారా అని అనిపిస్తుంది. దీని నిర్మాణంలో యెంతగానో వ్యయ - ప్రయాసలు కలిగివుండవచ్చు. వేలకొలదిగా నిపుణులు ఈ పనిలో వుండివుంటేనే యిది పూర్తయి వుండవచ్చు. ఆలయానికి ద్వారపాలకులుగా రెండు ఆడ సింహాలు వున్నవి. మధ్య సభామండపము నకు అంత్యభాగంలో వుండే స్తంభాలు 10 గజాలకంటే ఎక్కువ లావు, ఎత్తు షుమారు 125 గజాలు కలిగి వున్నవి. దాని శిల్ప - సౌందర్యం, నిర్మాణ చాతుర్యంముందు అమిసిస్ చక్రవర్తి నిర్మించిన మేంఫిస్‌లోని ఆ దేవాలయం కొరగానిదిగా కన్పిస్తోంది.

మధ్యలోవున్న సభామండపానికి నాల్గు వైపులా అనేక చిన్న - చిన్న గదులున్నాయి. వాటిల్లో ఒకటి యీ దేవత్రయానికి యివ్వబడ్డది. అక్కడ పళ్లు-పూలు, నైవేద్యాలు మొదలైనవన్నీ దేవతల కోసమై వుంచబడ్డాయి. మందిరాల్లో వుండే పూజారులందరు నిర్విరామంగా హోరస్, థాత్, అనుబిస్‌లలాంటి మహాదేవతల సేవల్కై తయారుగా వుంటారు. మేము ఆశించనంత సుఖంగా, విశ్రాంతిగా కొన్ని రోజులపాటు వున్నాం. అహ్మాసో స్వయంగా మా కష్టసుఖాలను గూర్చి విచారిస్తూ, మాకు కావలసినవాన్ని తెప్పిస్తున్నాడు. మహారాణి సందేశంగూడా రోజూ వస్తూండేది. అయినప్పటికీ మేమొక జైలులో బంధింపబడినట్లుంది. విశేషించి నా మిత్రులకు ఏకాంతవాస శిక్ష విధించినట్లుంది. వాళ్లు యెప్పుడూ గదిలోనే

వుండాల్సొస్తూవుంది. కృత్రిమ ముఖాలను చాల జాగ్రత్తగా తీసి భోజనం చేయాల్సివస్తుంది. ఈ స్థితి ఎక్కువకాలం వుండ దన్న విషయం నిశ్చయమే. ధనదాసు మాత్రం యెప్పుడు [స]నాగారంలో ప్రవేశిద్దామా, యెప్పుడు దాన్ని వశపరచు కొందామాయని ఆతురత చెందుతున్నాడు.

చివరకు మేము అహ్మసోతో చెప్పగా ఆయన మమ్ము లను సమాధి వున్న భవనానికి తీసుక వెళ్ళడానికి వప్పు కొన్నాడు. ఒకానొక రోజు మూడవ ఝామున మమ్మల నొక భూగర్భ గృహంవైపు తీసుకవెళ్లాడు. సూర్య (రా) మందిరానికి వెనుకగా కొన్ని మెట్లు దిగాక మేమొక వసారా లోకి వచ్చాం. తర్వాత దానికి ముందున్న మరొక చిన్న గదిలోకి వెళ్లాం. కాగడా వెలుగులో అది ప్రకాశిస్తోంది. దానికెదురుగా వున్న ద్వారాని కిరువైపులా విచ్చుకత్తులు పుచ్చుకొన్న యిద్దరు పూజారులు స్థిరంగా నిలబడియున్నారు. రాత్రింబవళ్ళు బహుకాలంగా యిక్కడ యిద్దరు పూజారులు కాపలా వుంటున్నారని అహ్మసో మాతో అన్నాడు. అప్పుడే నాకు గోబర్జైలా విషయం జ్ఞాపకం వచ్చింది—“సెరాఫిస్ సమాధికి నిరంతరం రక్షకులు వుంటారు; వారు సర్వదా అప్రమత్తులై వుంటారు.

ద్వారానికి దక్షిణంగా మితనీ నగర దేవత “రా” విగ్రహం వుంది. ప్రాచీన మిశ్రదేశంలో సూర్యభగవానుణ్ణి యెన్ని రూపాల్లో పూజిస్తారో, యిక్కడ వ్రాసే అవసరంలేదు. నా పరిశోధనా కాలమంతటిలో యిలాంటి సూర్య విగ్రహాన్ని మరెక్కడా చూడలేదు. దీని పేరు నిశ్చయంగా ‘రాకపాళం

అయివుండవచ్చు. 'రా' అంటే సవిత లేక సూర్యుడు; అంటే ప్రపంచాన్ని ప్రకాశింప జేయువాడు, వుత్పత్తి జేయువాడు. కపాలం భూమిమీద సూర్యుని ప్రతినిధి. అక్కడొక పెద్ద గోబ్రైలా విగ్రహముంది. గోబ్రైలా తన వెనకకాళ్ళపై నిలబడి వుంది. కాళ్ళమధ్య నొక గుండ్రని సూర్యబింబ మున్నది. గోబ్రైలా పాదాలవద్ద ఒక మనుష్య విగ్రహం చేతులు చాచి దేవతలను యాచిస్తున్నట్లుంది.

ద్వారానికి మొదమభాగాన చిత్రలిపిలో శిలాశాసన మొకటి వుంది. దానికి సమీపంలో ఒక విశాలకాయుడైన చక్రవర్తి విగ్రహం వుంది. మేము చూడాలనుకుంటున్న రహస్యాన్ని నెలకొల్పిన చక్రవర్తి అయివుంటాడు.

నేను శిలాశాసనాన్ని ధ్యానపూర్వకంగా చూశాను. నాకలాంటి శిలాశాసనం మరెక్కడా లభించలేదు. చిత్రలిపి లోని ప్రతి అక్షరం ఒక చక్రంపై అందంగా వ్రాయబడి రంగు వేయబడి వుండడం చూశాను. ఈ చక్రం నిరంతరం చాల వేగంగా అక్కడే తిరుగుతోంటుంది.

నేను అహ్మాసోను ఆ విచిత్ర శాసనం యొక్క తాత్ప ర్యాన్ని గూర్చి అడిగాను. ఎందుకంటే చిత్రలిపిని గూర్చిన అనుభవం బాగా వున్నప్పటికీ అభ్యాసం లేనందున బాగా చదువలేక పోయాను. "ఇది సమాధి పూజారులకు గూడా తెలియని ఒక మహారహస్యం, నాకుగూడా తెలియదు." అని అహ్మాసో తల వూపుతా చెప్పాడు.

నేను సూర్యదేవుడికీ, శిలాశాసనానికీ మధ్యగల చిన్న ద్వారం వైపుకు చూశాను. ద్వారం చాల బలిష్ఠంగావుంది.

ద్వారానికి ముందు భాగంలో అంటిపెట్టుకొని వున్న గట్టి యిత్తడి చువ్వలు యిరువైపులావున్న గుబ్బల్లోనుండి గోడలోకి గూడా చొచ్చుకొని వున్నవి.

నేను :- అయితే, దీనిలో ప్రవేశించే మార్గం లేదా ?

అహ్మాసో :- అవును. దేవతలకు మాత్రమే యీ రహస్యం తెలుసు.

నేను :- దీనిని తెరవడాని కొక గోబక్రైలా వుందని నేను విన్నాను.

అహ్మా:- గోబక్రైలా ! అది తస్కరింపబడడం విచారకరం. కొన్ని సంవత్సరాల క్రితం ఇక్కడ కొక విదేశీయు డొచ్చాడు. అతడు,కొంతకాలానికి మందిరానికి విశ్వాసపాత్రు డైనాడు. అత డెలాగో యిక్కడ వున్న గోబక్రైలాను దొంగిలించాడు.

నేను :- అయితే శాశ్వతంగా యీ సమాధి మూసి వేయబడినట్లేనా ?

అహ్మా :- అవును. సెరాఫిస్ సమాధికి గోబక్రైలా తిరిగి రానంత వరకు. నోహారీ సేనాని ఆ వ్యక్తిని ఎడారి వరకు వెంటాడినా, ఎలాగో బ్రతికి పారిపోయాడు.

నేను :- దీని లోపల యేముంది ?

అహ్మా :- సెరాఫిస్ మమ్మీ ప్రాచీన దేవీయ ధన సర్వస్వం. (సర్వ సంపద)

నేను :- ఈ ధనగారంమీద అధికార మెవరిది ?

అహ్మా :- సెరాఫిస్ మమ్మీకే దీనిమీద అధికార ముంది. మీతో నేనీ రహస్యం చెబుతున్నాను. నోహారీ దీన్ని

స్వైవసం చేసుకోవాలంటున్నాడు. అతడు దేవతలకు భయ పడడు. తన తండ్రి తాతల ఆత్మలనుగూడా లెక్కచేయని వ్యక్తి. గోబర్ఫైలా ఎత్తుకు బడినప్పుడు తన కత్తిని సాక్షిగా పెట్టుకొని ప్రతిజ్ఞ చేశాడు; ఎందుకంటే అతడు అమెన్, ఓస రిస్‌ల పేర్లమీద శపథం చేయడు. 'నేను గోబర్ఫైలాను తిరిగి మితనీకి తెప్పిస్తాను' అన్నదే ఆ ప్రతిజ్ఞ. నేటికెన్నో సంవత్స రాలు గడచిపోయినవి. అతడు 'మాయలమారి'గా చెప్పబడే ఒక వ్యక్తిని పంపించాడు. సాధారణ మానవులకన్నా వాడు చాల తెలివితేటలు గలవాడు. వాడిపేరు "ప్సారో". ఎన్నో మాసాలు గడచిపోయినా యింతవరకూ వాడు తిరిగిరాలేదు.

ప్సారో పేరు వినగానే నన్నెవరో వీపు చరిచినట్లయింది. నాకు రామేశ్వరుని విషయం జ్ఞాపకం వచ్చింది. అతడామాట నలందా సంగ్రహాలయంలో శివనాథుని నోట విన్నాడు. గోబ ర్ఫైలాను రామేశ్వరుని చేతిలో పెడుతూ "ప్సారో వస్తాడు జాగ్రత్త" అన్నాడు. గోబర్ఫైలాను తీసికొని సంగ్రహాలయంలో కూర్చున్నప్పుడే నా హృదయం కంపన స్ఫురణకొచ్చింది.

యీ వ్యక్తి శివనాథుని దానాపురంలోని తన స్వగృ హంలో హత్యజేసిన ఆ ప్సారో కాదుగదా ? 'మాయావిగా' ప్రసిద్ధి కెక్కిన ప్సారో కాదుగదా ? గచ్చుపై పాలు చిలక రించి జంబుక వదనుడైన అనుబిస్‌ను చిత్రించినవాడు కాదు గదా ? ఇప్పుడు నా భయం అధికం కావడం ప్రారంభించింది. సూయజ్ వరకూ మమ్మల్ని వెంటాడిన ఆ వ్యక్తులు మళ్ళీ గుర్తుకొచ్చారు. నా గుండె తీవ్రంగా స్పందించడం ప్రారంభిం

చింది. నేను మళ్ళీ అహ్మోసో నడిగాను - యీ పాస్పారోరూప మెలావుంటుంది.

అహ్మోసో :- నేను వాణ్ణి చూచి చాలా రోజులైంది. అయినప్పటికి వాడి ముఖం మరుపురానిది. అతడొక వృద్ధుడు; చూపులకు కన్పిస్తూన్న దానికంటే అధిక వయస్కుడు. తలపై ఒక వెంట్రుక గూడా లేదు. నేను తెలుసుకొందా మన్న కాంక్షకొద్దీ నన్ను నేను నిగ్రహించుకోలేక "వాడి ముఖంమీద వాతలాంటిది యేమైనా వున్నదా ?" అని అడిగాను. అహ్మోసో గాబరాగా నావైపు చూచి తలాడిస్తూ "లేదు, ఏమీ వాత లేదు" అన్నాడు. నేను పొరబడ్డానని తెల్సుకొన్నాను. నా భయం తీరిపోయింది. ఆపదలు నెత్తి మీదనే సంచరిస్తున్నట్లు నే గ్రహించలేక పోయాను. మేము పైభాగంలో వున్న మా గదికి రాగానే నాకు నోహారీ నుండి పిలుపు వచ్చింది. నేను వెంటనే నదికి అటువైపున రాజ ప్రాసాదానికి ఎదురుగావున్న నోహారీ భవనానికి వెళ్లాలి.

నోహారీ నన్ను తీసుకపోవడానికి స్వయంగా తన సొంత నావను పంపాడు. పది నిమిషాల్లోనే నేను సేనాని సమక్షంలోకి కొనిపోబడ్డాను. మేమిద్దరం ఒక చిన్న గదిలో వున్నాం. వెనుక భాగంలో ఒక తెర వుంది. నోహారీ ఇప్పుడు తన పసిడి కవచాన్ని విసర్జించాడు. ఒక స్వచ్ఛమైన, సన్నని ఉన్ని శేర్వాణీ ధరించి వున్నాడు. ఒక అందమైన పట్టెమంచంమీద పడుకొని వున్నాడు. అతని కెదురుగా ఒక చిన్న బల్లమీద ఒక కూజాలో సెరాఫీయుల మద్యమున్నది. నేను లోపలకు వెళ్ళినప్పుడు అతడు లేవనూ లేదు, నమస్కరించనైనా లేదు. ఎంతో నిర్ల

క్ష్యంగా ఒక కుర్చీని చూపి కూర్చోమని సంకేతం చేశాడు. అప్పటికీ నేను నిలబడి వుండడం చూచి అతడు తీవ్రంగా అన్నాడు— "దేవతల పూజారి నరనాయకుల ముందు నిల బడడం యుక్తమైన పని కాదప్పటికీ నీయిష్టం" అన్నా డతని ముఖంమీద వ్యంగ్యపూర్ణమైన చిరునవ్వు చిందులాడు తూండడం నేను గమనిస్తూనే వున్నాను. నేను "పురోహితుడు నిరభిమానంగా వుండడమే మంచిది" అన్నాను.

నొహరీ :- కావచ్చు, కాని సైనికుడావిధంగావుండడం మంచిదిగాదు. సరే. నీకు నాశక్తి తెలుసా ?

నేను:- నీవు మహారాణి సైన్యాధ్యక్షుడివనీ, యీ గడ్డ మీద అత్యంత శక్తిశాలివనీ నేననుకుంటున్నాను.

నొహరీ:- రాణి నన్ను వ్యతిరేకించగలదని నీవు భావి స్తున్నావా ?

నేను:- దేవతలు రాజప్రాసాదంవద్దకు వచ్చినప్పుడు శక్తిశాలి అయినటువంటి నొహరీ రాణిదృష్టిలో గౌరవ నీయుడు కాదని నేను తెలుసుకొన్నాను.

అతడు నవ్వుతూ అన్నాడు :- రాణి నేనంటే భయ పడుతుంది. కాని అప్పుడు ప్రాచీన మిశ్రదేవతల భయం ఆమెను ఆవరించి వున్నది. ముందుముందు ఆమె తన మూర్ఖత్వానికి స్వయంగా పశ్చాత్తాప పడుతుంది. అను బిస్ స్పృశించాడు. కాని చూడు ! ఇప్పుడుగూడా నేను జీవించే వున్నాను.

నేను:- "ఇప్పుడైనా నీవు మరణించవచ్చు" అతని మనస్సులోని విషయాలను ఎలాగైనా బయటకు తీద్దామను

కున్నాను; నేను కష్టాలవైపుకు మొగ్గుతున్నానని తెల్సు కున్న ప్తాక్.

నొహారీ:- ఓ థోత్ మస్! నేనొక నిష్కపట వ్యక్తిని. నీనుండికూడా నిష్కపటమైన సమాధానాన్నే కోరుతున్నాను. నేనొక సైనికుణ్ణి. సైనికుడు నిష్కపటంగానే వుంటాడని నీకూ తెల్సు.

నేను:- నేనుగూడా అలాగే వాంఛిస్తున్నాను.

నొహారీ:- ఇది అక్షరాలా నిజం. సరే! అయితే యీ విషయం చెప్పు. సెరాఫిస్ గోబర్జైలాను గురించి నీకేమైనా తెలునా?

నా శరీరానికి రంగు వేయబడి వుండడం అదృష్టం. లేకుంటే పాలిపోయిన నా శరీరాన్ని చూసివుండేవాడే.

నేను:- ఎన్నో సంవత్సరాల క్రితం అది సమాధినుంచి తస్కరింపబడడం నాకు తెలుసు. అదే సమాధి తాళపుచెవి అనిగూడా నేనెరుగుదును.

నొహారీ:- నీకింకా ఎన్నో విషయాలు తెల్సు. సరే, యీ విషయం నీకెలా తెల్సింది.

నేను:- అహ్మసోద్వారా.

నొహారీ:- అయితే వృద్ధపురోహితుడెంతో మూర్ఖుడు. అహ్మసో దైవగాథలను కంఠస్థం చేయగల్గుతాడేగాని, మానవ హృదయం తెల్సుకోవడం అతని చేతగాని పని. కాని నొహారీ మరో మూసలో తయారు చేయబడ్డాడు. హోరస్ దేవత, ఇసిస్, ఓసిరిస్ అనే దేవీ దేవతల పుత్రుడనన్నీ, అనుబిస్

రోదన దేవత 'నేస్ఫస్' కుమారుడినన్ని నేను విన్నాను. పెంపుడు గొర్రెల్లాగా వెంటబడి వచ్చే దేవతలు వీరేకదూ! వారిని గూర్చిన ప్రార్థనల్లో నా సమయాన్ని వృథాచేయక పోవడాని కెంతో సంతసిస్తున్నాను. నేను మానవుల్ని పరీక్షించినట్లే దేవతలగూడా పరిశీలిస్తాను. ఓ థోర్మస్, ఇప్పుడు నిన్ను పరీక్షించబోతున్నాను.

ఇలా అంటూ వెంటనే లేచి ఎదురుగా వున్న తెరను తొలగించాడు. తెర తొలగగానే చూచిన దృశ్యంతో నా శరీరం గడ్డకట్టుకొని పోయింది. గుండె ఆగినట్లయింది. నన్ను నేను సంబాళించుకోవాలని చూశాను. నా ఆంతరిక స్థితి చాలా భయావహంగా వున్నది. నేను ఇదివరకు చూచినవాడే వీడు. నోహారీ వుచ్ఛస్వరంతో అన్నాడు—"ప్సారో! యీ పూజారిని జాగ్రత్తగా పరిశీలించు. ఇతనెవరు?"

ఇప్పుడిక ఆ వ్యక్తి ముఖంవైపుకు చూచే శక్తి నాలో లేకపోయింది. మొదటి చూపుతోనే అతన్ని గుర్తించాను. సన్నని బలహీనమైన శరీరం, బట్ట తల, క్రౌర్యంతో మెరిసిపోతున్న కళ్ళు; నేనూ, ధీరేంద్రుడూ కమల్ మీద చూసిన వాడే యీ వ్యక్తి. గోబ్రైలాను తస్కరించిన ఇతనినే సూయజ్ పాతాళలోకంలో చివరకు చాంగ్ బోర్లా కొట్టించాడు. ఇతడే శివనాథుని హంతకుడని నిశ్చయమైనట్లే.



## 17 మహారాణితో సంభాషణ

వృద్ధుడు నావైపు బాగా పరికించి చూశాడు. అతని దృష్టి నన్ను భేదిస్తున్నట్లుగా వుంది. నే నతని భుజంనైపు జూశాను. అదే సమయంలో నా దృష్టి మరొక యువకునిపై బడింది. అతడు వృద్ధుని వెనుక వున్నాడు. అతన్ని గూడా నేను "కమల్" మీద జూశాను.

నోహరీ నా భుజంమీద చేయి వేశాడు. అప్పు డతని శరీరశక్తిని గుర్తించగలిగాను. అతని నాల్గు వ్రేళ్లుమాత్రమే నా భుజంమీద వున్నా అది పగిలిపోతుందో లేక నేను పడి పోతాననో అన్పించింది. అతడన్నాడు—"సరీగ్గా చెప్పు ప్సారో. నీ వితనిని ఎరుగుదువా? నీవు ఎడారి ఆవైపున వున్న ఆ అద్భుత దేశంలో ఇతన్నెప్పుడైనా చూశావా?"

నేను బోను ఎక్కించబడ్డ హంతకున్నానీ, జూరీ అభిప్రాయం కోసం నిరీక్షిస్తున్నానని అనిపించింది. ప్సారో తల వూపి "నేనితనిని ఎరుగను" అన్నాడు.

ఆ సమయంలో చాంగ్ మహాశయుని చతురత్వానికి నా మనస్సు అనేక ధన్యవాదా లర్పించింది. ఆయనే నాకు రంగు వేశాడు. గడ్డం, మీసం తీసివేశాడు. ఈవిధంగా నేను మరోమనిషిలా తయారయ్యాను.

నోహరీ తన హృదయంలో రేగిన నిరాశాభావాన్ని దాచుకోలేక పోయాడు. అతడు గదిలో పచారు జేయ సాగాడు. అతని నాశికారంధ్రాలు విప్పారినవి. తన కుడిచేతి

పిడికిలిని ఎడమ అరచేతిలో కొట్టుకొంటున్నాడు. నేనా సమయంలో బోనులో పెట్టబడిన కొత్త సింహంవలె వుండటం చూశాను.

నొహరీ అర్ధనిమీలిత నేత్రుడైనాడు. తన రెండుచేతులను ఛాతీమీద కట్టుకొని పాస్నోతో అన్నాడు — "సరీగా చూడు, యీ దేశవాసులు చూడని, విశ్వసించరాని అద్భుత వస్తువుల నెన్నిటినో నీ వా మహోన్నత దేశంలో చూశావు. నీ వక్కడనుండి యిక్కడివారి కెవరికీ తెలియని ఒక విచిత్ర భాషను నేర్చుకొన్నావు. సముద్రతీరాన వున్న ఒక నగరంలో గోబ్రైలా అపహరించబడిందని నీవు చెప్పావు. ఆ దొంగ ఎలా వున్నాడు."

పాస్నో:- చీకటి గావడంవలన నాకు తెలియ లేదు. గోబ్రైలాను తీసుకొని యిద్దరు వ్యక్తులు అక్కడనుండి వెళ్ళడం చూశాను. అందులో ఒకడు వృద్ధుడు. అతని గడ్డం తెల్లగా వుంది. అతనెప్పుడూ గోబ్రైలాను తీసుకెళ్ళేటంత సాహసం చేయ లేడు.

నొహరీ:- మరి రెండవవాడో ?

పాస్నో:- ఇతడు ఆ వ్యక్తి కాజాలడు. ఎందుకంటే అతడు పొడవైన నల్లటి మనిషి. అతని కళ్ళు పైతాను కళ్ళ వలె వుంటవి.

ఇప్పుడు నా ప్రాణంలోకి ప్రాణం వచ్చింది. పునర్జన్మ కలిగిందని అనుకొన్నాను. నేనా సమయంలో ధైర్యంజేసి వుండకపోతే నాకూ — నా స్నేహితులకూ అశుభం కలిగేదని నేను అనుకొన్నాను. నేను యిప్పుడు నొహరీపై అధికారం

చాలాయిస్తున్నట్లుగా గర్జించి అన్నాను—"నోహరీ, యీ దేశపు మహారాణి మాకు స్వాగతమిచ్చింది. నీవు చెప్పినట్లు విస్సప్పటికీ ఆమె నీకంటె గొప్ప హోదాగలది. మేము యిక్కడకు వచ్చినప్పటినుండి యే వ్యక్తికీ ఉపణ్మాత్రమైనా కష్టం కలిగించలేదు. ఇక్కడకు మేము శాంతి - శుఖాలు కోరి వచ్చామని వచ్చిన రోజునే మహారాణితో చెప్పాను. నీవు ఎవరి ఆజ్ఞతో నన్ను అవమానించావు? నామీద తీర్పరిగా వేశావు? అని నేను అడుగుతున్నాను."

అతడొక అడవిమృగంవలె గర్జిస్తూ అన్నాడు—"నాఆజ్ఞతోనే."

నేను :- అయితే నేను స్వయంగా మహారాణితో ఆమె రాజ్యంలో అవమానింపబడడానికి రాలేదని చెప్తాను.

నోహరీ:- రాణి దేవతల కథలకూ, భూతాల కథలకూ, ఇంద్రజాలాలకు భయపడవచ్చు. స్త్రీలకది సహజం. కాని యీ విషయాలు సైనికుని దృష్టిలో విలువలేనివి.

నేను :- నేను మహారాణివద్దకు వెళ్తున్నాను.

ఇలా అంటూనే నేను వెనక్కు తిరిగాను. నేను ద్వారంవద్దకు రాగానే కవాటాలు తెరువబడ్డాయి. రెండడుగులు గూడా వేయకముందే ఆపాదమస్తకం అస్త్ర శస్త్రాలతో సుసజ్జితులైన 20 మంది సైనికులు నా త్రోవను అడ్డగించారు. "నన్ను ముందుకు పోనివ్వాలని వీరిని ఆజ్ఞాపించు" అని సేనానివైపుకు తిరిగి అన్నాను. నన్ను జూచి అతడు చిరునవ్వు నవ్వాడు. నేనతని నవ్వులో తోడేలు ధూర్తత్వం లాంటి భావం జూశాను.

నోహ :- మూర్ఖావు గమూ; నేనిక్కడ తోక వ్యూహం పన్నాను. ఈ సారికి నీవు బ్రతికి బయటబడ్డావు. నీవు మరో సారి నా వ్యూహాన్ని తప్పించుకు వెళ్ళలేవు. అంతేగాక హోర్నమస్, నీతోపాటు నక్క, ఇబిస్, డేగలు కూడా బొక్కలో పడతవి.

అతడు సైనికులను దారి యివ్వమని ఆజ్ఞాపించాడు. నేనక్కడ నుండి బయటకు వచ్చాను. అప్పుడు నా గుండె తీవ్రంగా స్పందిస్తోంది. అదృష్టం వల్ల యీసారి బయట బడ్డానని అనుకొంటున్నాను. నేను మొదట్లోనే చెప్పినట్లు పిరికి వాణ్ణి గాబట్టి అలాంటి పరిస్థితులు నాకు భయం కల్గిస్తవి.

నేను నావమీదకు వెళ్ళి మహారాణి ప్రాసాదం వైపుకు పోనివ్వమని సేవకులతో చెప్పాను. ఈ విషయాన్ని పూరికే వదిలివేయడం మంచిది కాదని తెలుసుకొన్నాను. నోహా తన శత్రుత్వాన్ని స్పష్టంగా ప్రఘోషించాడు.

ప్రాసాదంలో నాకు స్వాగతం మరో విధంగా జరిగింది. ద్వారం వద్దకు చేరుకోగానే ప్రతీహారి నాకు నమస్కరించాడు. నా ఆగమనానికి కారణ మడిగాడు. మహారాణిని కలుసుకోవాలని నేనాతనితో చెప్పాను.

అతడు నన్ను విశాలమైన వుద్యానవనపు త్రోవన ఒక సోపానం వద్దకు తీసుకు వెళ్ళాడు. అది సుందరమైన చలువ రాతితో నిర్మించబడింది. దాని ద్వారా నేను రాజ సింహాసనపు భవనంలో ప్రవేశించాను. అక్కడ గొట్టాలనుండి నీటి జల్లులు పడుతున్నవి. క్రిందవున్న నీటిలో కమలాలు,

చేపలు వున్నవి. జలకుండానికి సమీపంలోనే పరచబడివున్న ఒక నల్లని తివాసీపై రాణి తన చెలికత్తెలతో కూర్చొని వున్నది. ఆమె గడ్డిపోచలతో చేపలను కదిలిస్తోంది. నిజంగా ఆమె ఒక బాలిక.

నేను వెళ్ళగానే లేచి నిలబడి ఆదరంగా నమస్కరించింది. "దేవతలేమైనా సందేశం బంపారా?" అని అడిగింది. నేను ఆమెతో అన్నాను—"దేవతలు మహారాణికి దీవెనలు పంపారు. నేనీమాట లంటున్నప్పుడు నాఅంతరాత్మ ఘోరంగా యెదిరించడానికి సిద్ధమౌతున్నట్లుంది. ఆ తరుణి వుత్తమురాలు, నిష్కపటి, ఆమె ముందు నేను అపరాధి ననుకొంటున్నాను; ఎందుకంటే నేనామెను మోసగిస్తున్నాను. ఆమె హృదయం మధురమైనది కావడంవల్ల నా హృదయం కరుణాక్రాంతమైంది. ప్రాచీన సభ్యత ఆమెను మహారాణిని చేసినా ఆమె అమాయకురాలు. ఆమె సుశిక్షిత. పండితులతో గంటల తరబడి ఆమె సంభాషిస్తుందని అహ్మసో నాతో జెప్పాడు. ఆమెకి ఆధునిక ప్రపంచాన్ని గూర్చి యేమాత్రం తెలిసినా యీ విస్మృత రాజ్యరాణి. యీ విస్మృత నగరాన్ని ఎంతో చక్కగా శాసించగల్గుతుంది; ఎందుకంటే ఆమె స్వభావం చాల మధురమైనది; హృదయమెంతో వుదారమైనది; నడవడి వుత్తమోత్తమమైనది.

నే నలాంటి వ్యక్తి సరళతనూ, విశ్వాసాన్ని పురస్కరించుకొని అనుచిత లాభాన్ని పొందుతూ ఆమెనే మోసగించడం – యివన్నీ నామీద నాకే అసహ్యాన్ని గొలుపుతున్నవి. నేను సేనాపతి సమక్షంలో వున్నప్పుడు నా

యొక్కయూ, నా మిత్రుల యొక్కయూ ప్రాణాలు చాల సున్నిత స్థితికి చేసుకొన్నట్లుగా భావించాను. ఏమాత్రం తప్పటడుగు వేసినా, మాట జారినా మేమంతా సఫా ఔతాం. అత డాజ్ఞాపించడమే ఆలస్యం, మా శిరస్సులు మా మొండేల నుండి వేరైపోతాయి. అతని హృదయంలో కరుణా - గౌరవాలకు స్థానమే లేదు.

ఈ రకపు మనుష్యుల చేతుల్లోనుండి యేవిధంగా తప్పించుకొన్నా క్షంతవ్యమే. అతనెంత శక్తివంతుడంటే మేము మోసం జేసిమాత్రమే అతని వ్యూహంనుండి తప్పించుకో గల్గుతాం. నాకు మొదటినుండీ అతనంటే భయమేర్పడిందన్న విషయం దాచుకో దలచలేదు.

కాని మహారాణి సమక్షంలో వున్నప్పుడు మేము దండనార్హులమే ననిపిస్తుంది. నా హృదయంలో నటన కంటకంలా గ్రుచ్చుకొంటోంది. మనస్సు విప్పి రహస్యమంతా యీమెతో యెందుకు చెప్పగూడదు? అనిపిస్తుంది. కాని అలా చేయడం చాల తెలివితక్కువతనమని నాకు బాగా తెలుసు. సెరిసిస్ మమ్మల్ని రక్షింపగోరినా, ప్రజలుమాత్రం మమ్మల్ని ప్రాణాలతో వదలరు. ఎందుకంటే మేము వారి దేవతల వేషాలు ధరించి వార్ని మూర్ఖులుగా చేశాం. దేవతా పూజారినన్న భావం వదలివేసినా మహారాణి నేనంటే ఎంతో ప్రసన్నంగానే వుంటుంది.

నేను ఆమె పితామహుని వయస్సు కలిగి వున్నాను. నేను యువకుణ్ణయినప్పటికీ ఆమె ప్రేమాభిమానాన్ని పొంద

గానే ఆకర్షణ, రూపం నాకు లేదు. అయినా ప్రేమ వుంది. దాన్ని సాత్త్విక ప్రేమ అనండి, వాత్సల్య ప్రేమ అనండి, ఆదరపూరితమైన ప్రేమ అనండి. ఈ సమయంలో ఆమె నా చేయి పట్టుకొని చలువరాతి సోపానాలు దిగి రాజోద్యానం లోకి తీసుకపోయింది. ఆ సాయంకాలపు శీతల వాయువుల్లో ఆ తోట అగణిత పుష్పాలతో శోభాయమానంగా వుంది.

ప్రాచీన దేవతా విగ్రహాల మధ్యగా మేము వెళ్ళు తున్నాం. ఆమె నావైపు చూసి యిలా అన్నది – "చెప్పండి థోత్మస్, తమరు గాబరాగా వున్నట్లుంది."

నేను:– "అవును మహారాణీ, నిజమే" ఆమె గంభీరంగా జిజ్ఞాసతో అడిగింది – "తమరు సజీవ దేవతలను అప్రసన్ను లుగా జేయ లేదుగదా!"

నేను:– అప్రసన్నులుగా చేసేసని నేను చేయకపోయనా నోహారీ నాతో వైరం పెట్టుకున్నాడు. మహారాణీ, నే నా భయంకర దుష్ట మానవుని బారినుండి తప్పించుకోవడానికే యిక్కడకు వచ్చాను.

ఆమె ఆతురతతో చేతులు నలుపుకొంటూ, పెదవులు నొక్కుకుంటూ అన్నది—"నోహారీ పెద్ద బలాఢ్యుడు."

అప్పుడామె ముఖం ఎర్రబారింది. తన దక్షిణ పాదంతో భూమిని తన్నింది. ఆమె యీ క్రోధపూరితమైన మాటలన్నప్పుడు ఆమెలో యెక్కువగా బాల్యమే గోచరిం చింది. తీవ్రంగా యింకా యిలా అన్నది–"నేను మహారాణిని కానా? పర్వతాలనుండి ఎడారివరకున్న యీ దేశాన్ని నేను శాసించడంలేదా? నేను థేబీయు సార్వభౌమ వంశ

సంజాతను కానా? ఈ దేశంలో నా మాట శాసనం. ఇక్కడ నా ఆజ్ఞ నెవ్వడూ వుల్లంఘించలేడు. అయినా న్యోహరీ సేనాని నా మాటవినడు.

నేను :- నీవుగూడా అతడంటే భయపడుతున్నావా?

మహా :- నే నతనికి భయపడడంలేదు. అతడు నా మాటను లెక్కచేయడు. నేను అహ్మోసోను సలహా సహాయముల నడుగుతాను. కాని ఆయనగూడా సేనానంటే భయంతో వణికి పోతుంటాడు.

తర్వాత ఆమె నావైపు జాలిగొలుపు దృష్టితో జూచింది. ఆమె తన రెండు చేతులనూ ముందుకు జాచింది. దినకరుని అంతిమ కిరణాలు ఆమె రత్నభూషణాలపై ప్రసరించి ఇంద్రధనస్సులాగా ప్రతిఫలిస్తున్నవి.

ఆమె తన హస్తాలను పైకెత్తినప్పుడు కంకణాల మధుర నిక్వాణం దగ్గరగా వున్న సంగీతంలో మేళవించి యింకా మనోహరంగా మ్మారిపోయింది. నా కా విషయం స్మరణకు వచ్చినప్పుడల్లా నేను స్వప్నావస్థను అనుభవించకుండా వుండలేను. ఆ అద్భుత ఉద్యానవనం, మల్లెగొల్పే పుష్ప సౌరభం, సుందరమైన వుద్యానపథం, ద్రాక్ష - సీమరేగుల అందమైన వృక్షాలూ, ద్రాక్ష లతలతో ఆవరింపబడి వున్న పెద్దపెద్ద ప్రాచీన విగ్రహాలూ, సింహ వదనాలుగల మానవ విగ్రహాలూ — యీ అద్భుత దృశ్యా లన్నిటిమధ్య ఆ నారీ రత్నం, ఆ అనుపమ సుందరి, ఆభువన మోహినీ కుమారి, ఆ సౌందర్యరాశి, ఆ ప్రాచీన సభ్యతా ప్రాంగణంలో దేదీప్యమానంగా వెలిగి పోతోంది.

ఇది ప్రపంచంలో మరో ప్రపంచం. నేనప్పుడెంతో జాగ్రత్తగా, ప్రాచీన వస్తువులకు చీటీలంటించి, నెంబర్లువేసి, లిస్టు యేర్పాటుజేసి, అందంగా వరుసల్లో వుత్తమ అద్దాల బీరువాల్లో అలంకరించాలనుకొన్నప్పటికీ వాటిల్లో ఆ జీవకళ ఎలా వస్తుంది? ఫరోవా వంశంలో జన్మించిన ఆ కన్య యొక్క జీవితమే ఒక విలక్షణవస్తువు. ఆమె జీవితమే ప్రత్యేకమైనది. సంగ్రామ స్థలంగూడా భిన్నమైనదే. ఆమెతో నేను సంభాషించేప్పుడు, అదృష్ట వశాత్తు ఆమె హక్కులనూ, రాజ్యాన్ని రక్షించే సంగ్రామంలో పాల్గొనడానికి యిక్కడకు పంపబడ్డా మనిపించింది.

ఆమెను మోసగిస్తున్నానన్న విషయం నాకు తెలిసినప్పటికీ నా ఆత్మ నన్ను వివశుణ్ని చేసింది. స్వయంగా నేనే మాత్రం శక్తివంతుడను గానప్పటికీని నా జీవిత మంతటిలో ఆ నాడు ప్రథమంగా ప్రతిజ్ఞ చేశాను. ఆమెను ఆపద మేఘాలావరించినా, ఆమె కష్టాలతో చుట్టుముట్టబడినా ఆమెకు సహాయం జేయడాని కేమాత్రం నేను వెనుకాడబోను. చాంగ్ - ధీరేంద్రులవంటి చతురులు, శక్తి సంపన్నులూ అయిన మిత్రులూ లభించి వుండకపోతే బహుశా నా యీ ప్రతిజ్ఞ పనికిమాలినదయ్యేది.

మహా :- "ఓ థోథ్మస్, మీరు చతురులు. దేవతల విశ్వాసాన్ని చూరగొన్నవారు; తప్పక నాకు సాయపడగల్గుతారు. మీరు ప్రార్థిస్తే దేవత లిందులో స్వయంగా నాకు సహాయ పడతారు." "ఎటువంటి సహాయాన్ని ఆశిస్తున్నావని" నేనామెను అడిగాను.

మహా :- నోహాకీ నా రాజముకుటాన్ని, రాజ్యాన్ని కబళించ గోరుతున్నాడని నాకు తెలుసు. అత డత్యంత బల శాలి. నాకతడు విరోధియైతే సైన్యంలో అత్యధికభాగం అతని వైపుకే మొగ్గుతుంది.

నేను :- అతడలా చేయడు.

మహా :- ఏ నాటికో యిది తప్పక జరుగుతుందని నాకు బాగా తెలుసు. అహ్మాసోను తప్ప నేను మరెవ్వరినీ విశ్వసిం పను. సంగ్రామమొస్తే నా అంగరక్షకులను తప్ప మరెవ్వరినీ నమ్మలేను.

నేను :- వాళ్ళందరూ రాజభక్తులుగానే వుంటారు.

ఆమె అభిమానంగా అన్నది — "అందరూ, ప్రతి ఒక్కరూ."

అప్పుడామె ముఖమండలముపై ప్రకాశవంతమైన కిరణమొకటి భాసించడం చూశాను. ముఖం మీద వుద్భ వించిన రక్తిమ ఆమె సౌందర్యాన్ని ద్విగుణీకృతం జేసింది.

నేను :- వాళ్ళు బలశాలురు. నేను లోనికి వచ్చేప్పుడు ఆ కవచధారులు శస్త్రాస్త్రాలతో అలంకరింపబడి వుండడం చూశాను. ఇతర సైనికుల దుస్తులకంటే వారి దుస్తులు భిన్న మైనవి. వారి శిరస్త్రాణాలపై రక్తంతో గూడిన ఎర్రని ఇబిస్ పక్షుల ఈకెల గుత్తులున్నాయి.

మహా :- వీరు పేరుబడ్డ యోధులు. నా రాజ్యమంత టిలో వెదకి తీసుకోబడ్డారు. ఇతర సైనికులు వారి భుజాల వర కైనా రారు. వారిలో ఒక్కరుగూడా నాకై తమ ప్రాణాలను బలిజేయడానికి వెనుకంజ వేసేవారు లేరు.

ఒక్క క్షణంలో నే నామె మాటలను గూర్చి ఆలో చించాను. ఆమెతో అన్నాను —"అయితే నోహారీ యేమి చేయగల్గుతాడు"

మహా :- అత డధికారాన్ని వాంఛిస్తున్నాడు. అతడు నా సింహాసనాన్ని ఆక్రమించుకోనంత వరకు శాంతించడు. ఇంతకంటే ఎక్కువగా అతనికి ధనలోభముంది నేను చెప్పే యీ విషయాలలో ఒక్క మాటైనా బయటకు బోరాదు. దేవతలను సైతం యేమాత్రం లెక్కచేయని నోహారీ. సెరాఫిస్ సమాధిని బ్రద్ధలు చేయగోరుతున్నాడని నాకు తెలిసింది.

నేను :- అతడా ధనాగారాన్ని కైవసం చేసుకోగోరుతున్నాడా ?

మహా :- అతడు చేసుకోగలడు; చేసుకుంటాడు గూడా. కాని సమాధి ద్వారం తీయలేడు. అతడు భూగృహం లోకి వెళ్ళి నా శవ సంపత్తిని కొల్లగొట్టలేడు. కాని అతడు సూర్య దేవుణ్ణి అవమానిస్తాడు.

నేను :- అవును. నేను విన్నాను. అక్కడొక రహస్య మున్నదనిన్నీ, అది తెలుసుకోకుండా సమాధిలో జొర బడడం అసంభవమని అహ్మాసో అన్నాడు.

మహా :- మీకా రహస్యం తెలిసి వుండవచ్చు. మీ వద్ద దాని తాళపు చెవి వుండి వుండవచ్చు.

నేను :- మహారాణీ, మీకా రహస్యం తెలుసునా ?

ఆమె తల ఆడిస్తూ జవాబు చెప్పింది — ఎవ్వరికీ తెలియదు. ఏమైనా గోబర్రైలా లేకుండా సమాధి జొచ్చడం అసంభవం. అది పోనే పోయింది; తస్కరింప బడింది. దాని

అన్వేషణార్థం పంపబడ్డ 'ప్సారో' అనే వ్యక్తి తిరిగి ఎప్పటికీ రాలేదు.

నేను :- "మహారాణీ అతడు తిరిగి వచ్చాడు" నేనీ మాట అనగానే ఆమె గాబరాపడి ఆతురతగా "ప్సారో తిరిగి వచ్చాడా!!"

నేను :- ఎడారికి ఆవలివైపునున్న ఇంద్రజాలిక దేశం నుండి నేడే వాడు తిరిగి వచ్చాడు. అప్పుడామె నిరాశా పూరితంగా అన్నది—"అయితే నా సింహాసనం కదలి పోయినట్లే; యిక నా ప్రాణాలు దక్కడం గూడా కష్టం. ఎందుకంటే వాడే నోహారీని రెచ్చగొడతాడు. నోహారీలో శక్తి సాహసాలుంటే, ప్సారోలో సర్పబుద్ధి వున్నది."

ఆమె నాతో మాట్లాడుతున్నప్పుడు మా వెనుకగా కవచ ధ్వని వినిపించింది. నేను తిరిగి చూశాను. స్వయంగా నోహారీ వస్తున్నాడు. అతడు సింహంలా తలెత్తుకుని నడుస్తున్నాడు. ఆపాద మస్తకం కవచం ధరించాడు. నేనా పురుషునికి భయపడ్డప్పటికీ అతని వీరత్వంతో కూడిన ప్రవర్తనను ప్రశంసించకుండా వుండలేను.

మహారాణి మెల్లగా అన్నది—"అతనొచ్చాడు. మీరిక వెళ్ళండి. కాని రేపు యిక్కడకు తప్పకరండి. ఇంకా మీతో కొన్ని విషయాలు చెప్పాల్సి వుంది."

ఆమె మళ్ళీ నమస్కరించింది. నే నక్కడి నుండి బయలుదేరాను. నేను నోహారీకి దగ్గరగా వెళ్ళేప్పుడు అతని నల్లని, తీవ్రమైన కళ్ళు నాపై బడటం చూశాను.

ఆ రాత్రి తెల్లవారుఝాము వరకు చాంగ్-ధీరేంద్ర ధనదాసులతో చర్చించాను. నేను చాల విషయాలను గూర్చి ఆలోచించాల్సివుంది. ఏ విధంగా జూచినా మా స్థితి భయంకరంగా వున్నట్లే తోస్తూన్నది. నోహారీ మమ్మల్ని శంకిస్తున్నాడు. అతడు శంకించడమే మాకు ప్రమాదకరమైనదిగా తోస్తూంది. కాని ప్సారో మితనీ హర్బీకి తిరిగి వచ్చాక మా మృత్యువు యింకెంతో దూరం లేదనడంలో సందేహం లేకుండా పోయింది.

సెరాఫీయులలో ప్సారో మొదటి నుండీ ఐంద్రజాలికుడుగా ప్రసిద్ధి కెక్కాడు. ఈ దేశ మంతటిలో ఆధునిక జగత్తును సందర్శించినవాడు అతడొక్కడే. అతడు ఆధునిక అవిష్కారాలను, ఆధునిక సభ్యతకు సంబంధించిన గొప్ప గొప్ప విచిత్రాలను బాగా పరిశీలించాడు. నిస్సందేహంగా "అతడే నీ పినతండ్రి ఘాంతకుడని ధనదాసుతో" అన్నాను. వార్తా పత్రికలలో ప్రకటించని హత్యా సంబంధమైన విషయాలెన్నో ధనదాసు నాతో చెప్పాడు. ఆ ప్సారో నేరం యిప్పుడు పూర్తిగా రుజువయింది.

ఈ సంఘటనలను పరిశీలించడానికి నియమింపబడ్డ సి. ఐ. డి. గచ్చుమీద ఒక చాకు పడి వుండటం చూశాడు. దాని వలన హత్యకు పూర్వం యిద్దరూ పోట్లాడు కొన్నట్టుగా తెలుస్తోంది. ఆత్మ రక్షణకు జేసిన అంతిమ యత్నంలో

ప్సారో చెక్కిలపై గల దెబ్బ శివనాథుడు కొట్టిందేనని నేను నిశ్చయించుకున్నాను. అహ్మాసో చెప్పిన దాన్ని బట్టి అంతకు పూర్వం అతని ముఖం మీద ఎలాంటి మచ్చ లేదు.

కాని యిందువల్ల మా స్థితిలో భయంకరత యే మాత్రమూ తగ్గలేదు. ఈ దేశంలో యితరులను మోసగించ గలిగినట్లు ప్సారోను బోల్తా గొట్టించ లేమన్నది స్పష్టం. నే నప్పుడే యీ నగరాన్ని వదలి వెళ్ళడానికి సిద్ధంగా వున్నాను. నేను ఆశించిన దానికంటే అధికంగా తెలుసుకొన్నాను. ఇక్కడ ఆలస్యమైన కొద్దీ ప్రమాదం హెచ్చుతోంది. ఈఆప దల నుండి గట్టెక్కుతామని మాకు ఆశలేదు. ఒకవేళ నగరం విడిచి వెళ్ళినా, దేశాన్నుండి వెళ్ళిపోయే మార్గం తెలి యదు; ఎందుకంటే మళ్ళీ యెడారి మార్గాన వెళ్ళడం మూర్ఖత్వమే ఔతుంది. నేను నా మిత్రులతో యీ విష యమై సంప్రదించినప్పుడు నిరాశావాది నయ్యాను. చాంగ్ మహాశయుడు ఆసనం వేసుకొని గంభీరంగా కూర్చొని వున్నాడు. ఆయన మాటల ద్వారా నా భయాన్నంతా పోగొట్టాడు.

చాంగ్:- ప్రొఫెసర్, నిరాశజెందే అగత్యమేమీ లేదు. ఎడారి మార్గాన తిరిగి వెళ్ళడం వెర్రితనమేనని నేనూ ఒప్పుకొంటాను. కాని ప్సారో నగరానికి తిరిగి వచ్చాడన్న మీ యీ వార్త నాకెంతో ఆశాజనకంగా వుంది.

నేను:- ఆశాజనకంగానా! ఎలా? మనజాడ తెలియ గానే నొహరీని వాడు రెచ్చగొడతాడు. ఒక్క క్షణంలోనే అతను మనపై ఎలుకమీదికి పిల్లి దూకినట్లు దూకుతాడు.

చాంగ్ మందహాసం జేస్తూ అన్నాడు — ప్సారో ఎడారి మార్గాన వచ్చాడని మీరనుకొంటున్నారా?

నేను:- నాకు తెలియదు.

చాంగ్:-అలా రావడం అసంభవ మనుకొంటున్నాను.

నేను:- అలాగని మీరెట్లా విశ్వసిస్తున్నారు?

ఛాంగ్:- అలా రావడానికి అతనికి శక్తిలేదు. అతడు మీకంటే వృద్ధుడు. నేనా రోజున సూయజ్‌లో గోబర్రైలా తీసుక రావడానికి వెళ్ళినప్పుడు అతని శరీరాన్ని బాగా పరిశీలించాను.

నేను:- కాని ఇది వూహాగానం మాత్రమే.

చాంగ్:- మీరేమైన అనండి; కాని కొన్ని వుపకారణాలు గూడా వున్నవి. ఆఫ్రికా అరణ్యాలలో ఒక విధమైన జబ్బు వుంటుంది. ఆ జబ్బు ఆశించినవారి పెదవులు శాశ్వతంగా నల్లబడి పోతాయి. నేనీ చిహ్నాన్ని ప్సారో పెదవులపై చూశాను.

నేను:- ఆరాత్రి సూయజ్‌లో మీరతనిని జూశారా?

చాంగ్:- నేను నా టార్చిలైటు వెలుగులో విశేషంగా-ధ్యాసంగా చూడకపోయినా, నాకిప్పుడిప్పుడే స్ఫురణకు వస్తున్నది. నా మస్తిష్కం ఒక పాతరవంటిది. దీనిలో అన్ని రకాలైన విషయాలూ ఉంటవి. వాటిని కొన్ని కొన్ని సమయాల్లో నేనే తెలుసుకోలేను. ఇక నా వాదం వినండి. ఈ దేశానికి ఉత్తర – దక్షిణ దిశల్లో దీర్ఘంగా వున్న అరణ్యాలు లేవు. సోబాత్, నైలునదీ లోయల్లోగూడా శూన్యం. ప్సారో దక్షిణదిశనుండి యీ నగరానికి రాలేడు; ఎందుకంటే యింత

చుట్టు తిరిగి రావడానికీ కాలం చాలదు. అతని శారీరిక బల హీనతను గూర్చి ఆలోచిస్తే యెడారి మార్గాన రాలేదని స్పష్టమౌతోంది. ఆగ్నేయ దిశనుండి తప్ప ఈ దేశంలో ప్రవేశించడానికి వీలులేదు.

నేను:- ఇది నిజం కావచ్చు.

చాంగ్:- ఇది సాధారణ విషయమే. ప్సారో వచ్చిన మార్గాన్నే మనంగూడా యిక్కడినుండి వెళ్ళవచ్చు.

నేను:- ఎంత శీఘ్రముంగా వెళ్తే అంత మంచిది; ఎందుకంటే యీ దేవాలయంలో గడుపుతోన్న ఒక్కొక్క క్షణానికి ఒక్కొక ఆపద పెరిగిపోతోంది.

ధీరేం:- అవకాశం చిక్కగానే యిక్కడినుండి వెళ్ళిపోవాలనేనా మీ ప్రతిపాదన?

నేను:- అవును. ఇదే నా ఉద్దేశ్యం. కాని రాణిజీవితం ఆపదల పాలౌతుందేమోనని అనిపిస్తోంది.

ఇప్పటివరకూ మౌనంగా వున్న ధనదాసు మొదటిసారిగా నోరు విప్పాడు — ఇక్కడకు మన మే రాణి ప్రాణాలను రక్షించడానికి రాలేదు. ఈ నగరంనుండి నిష్క్రమించేముందు నేను సమాధిలో జొరబడాలనుకొంటున్నాను.

చాంగ్:- ఇది పూర్తిగా అసంభవం. మనకు రహస్యమంతా తెలిసినప్పటికీ అచ్చటి రక్షకులను వశపర్చుకోవడం కష్టం.

ధీరేం:- ఇక్కడ బలప్రయోగం జేయడం ఆపదలను కొని తెచ్చుకోవడమే. అందరికీ మిత్రులుగా వుండడమే

మంచిపద్ధతి. ఇక్కడ మనం యే ఒక్కర్ని విరోధులను చేసుకున్నా మనపని ఖతమ్.

ధనదాసు మా కెదురుగా మండుతున్న మంటవైపు చూస్తున్నాడు. అతడు మధ్యమస్వరంతో అన్నాడు — నా పినతండ్రి ఒక బ్రహ్మాండమైన విషయాన్ని కనిపెట్టాడు, ఆయన మీరు చూస్తున్న యీ దేశాన్ని, యీ సభ్యతనూ. యీ దృశ్యాలనన్నిటినీ కనుగొన్నాడు. ఆయన కేవలం తన నోటు పుస్తకాలను వదలి వెళ్ళాడు. అందున్న ప్రతి అక్షరం నిజమైంది. ఇందువల్లనే వాళ్ళకు అసంభవంగా కనబడినా సెరాఫిస్ సమాధిని గురించి ఆయన వ్రాసిన ప్రతి మాట పరమసత్యమనడంలో సందేహమేమీ లేదు. బహుశా సమాధిలో ప్రవేశించ గోరటం మూర్ఖత్వంగావచ్చు. కాని యీ అపార ధనరాసులను విడచి వెళ్ళడం అంతకు మించిన మూర్ఖత్వ మౌతుంది.

కొద్దిసేపు నిశ్శబ్ద మావరించింది. ఈలోగా మేమాతని ముఖం వైపుకు జూచాం. అతడు ధనాగారాన్ని గూర్చిన కలలు గంటున్నట్లుగా మాకు తోచింది. కేవలం ధనాగారాన్ని వశపరచుకోవడానికే యీ భయంకర యాత్ర జేశాడని మాకు స్పష్టంగా తెలుస్తుంది. చాంగ్ - ధీరేంద్రులు గూడా యిందులో భాగాన్ని కోరుతారనే తనవెంట వార్ని తీసుకరావడానికి ఒప్పుకోని కారణం. అతడెంత స్వార్థాంధుడంటే యిందులో ఒక్క దమ్మిడీ గూడా పరాయి వాడికి దక్కనివ్వకుండా చేద్దామనుకున్నాడు. ధీరేంద్రుని భావాలు యెప్పుడూ ఆచరణ యోగ్యంగా వుంటాయి. ఆయన అన్నాడు—

"మనం సమాధిలోకి వెళ్లామనుకోండి, ఆ సంపదంతా మన చేతికి చిక్కిందనుకోండి, అయినప్పటికీ వేలకొలది మైళ్ల విస్తీర్ణం గలిగి వున్న యీ ఆఫ్రికా అరణ్యాలను నిగ్ర మించి ఆ సంపత్తిని తీసుక పోవడమేలా? తూర్పు దిక్కున నేను విశ్వసిస్తున్నట్లు ఒక మార్గం వుండి వుంటే అది అజ్ఞాత అరణ్యాల గుండా అబిసీనియాకు గాని, ఉగాండాకు గాని చేర వచ్చునని మీరు తెలుసుకోండి. నేను ఎన్నో పర్యాయాలు అరణ్యాలలో పర్యటించాను. అందు నే నెన్నో నిరుపమాన విచిత్రాలను చూశాను. అలాంటి అరణ్యాలలో మనం ప్రయాణించాల్సివస్తే — నా మాట నమ్మండి—మన జీవ నానికత్యంతావశ్యకములైన వస్తువులు తప్ప మరేమీ వెంట తీసుక వెళ్ళలేము."

ధన :- ఎందరో మానవులకు ధనం గూడా అత్యంతా వశ్యకమైన వస్తువే.

ధీరేం :- తమరు బంగారాన్ని తినలేరుగా. ప్రపంచ మంతటిలోని రత్నాలన్నీ ప్రోగుచేసి గూడా అటవికుల దండ యాత్రను చిందర - వందర చేయలేరు.

ధనదాసు చాలసేపు నిశ్శబ్దంగా వున్నాడు. తర్వాత బొంగురు గొంతుతో అన్నాడు — నేనొక సాహసిని. అవ సరమైతే నా కాలాన్ని వృథా చేయడానికి గూడా సిద్ధంగా వున్నాను. మన మందరం పరిస్థితులకు దాసులం. ఏ వ్యక్తీ— విశేషించి యిలాంటి పరిస్థితుల్లో — రేపేమి జరుగుతుందో చెప్పలేరు.

ఇది పూర్తిగా నిజం. మా బ్రతుకులు పురిలేని ధారాల మీద వ్రేలాడుతున్నవి. ప్సారో నగరంలో వుండగా మేము చర్చల్లో మా అధిక కాలాన్ని దుర్వినియోగం చేయడం వృథా అనిపిస్తోంది.

రెండోనాడు సాయంత్రం అహ్మోసో నా వద్దకు వచ్చి మహారాణి వెంటనే రమ్మంటున్నదని చెప్పాడు. నేను వెంటనే ఆయన వెంట రాజ ప్రాసాదానికి వెళ్ళాను. నావ మీదకు, వెళ్ళిన తర్వాత నేను మాట్లాడ సాగాను. అతడు నాతో ఎక్కువగా మాట్లాడడం లేదు. చేతులతో కళ్ళు గప్పుకొని అశ్రుబిందువులు రాల్చుతున్నాడు. ఆ వృద్ధుని యీ దుస్థితి జూచి నాకు చాల బాధ కలిగింది. ఎందుకంటే మేం కలుసుకొన్నప్పటినుంచీ మా పట్ల ఆయన ప్రవర్తన ఎంతో ప్రేమ పూరితంగా వుంది. ఏదో పెద్ద ఆపద వచ్చినట్లు నేను తెలుసుకొన్నాను.

రాజ ప్రాసాదంలో సెరిసిస్ యేకాంతంగా వుండడం చూశాం. ఆమె నమస్కరించి "ఎందుకు పిలిపించారని" నేను ప్రశ్నించకముందే నా చేయి బట్టుకొని యిలా అన్నది—

"నాకు మీ సహాయం అత్యవసరం. నిన్న మీతో అన్న మాట నిజమైంది. ప్సారో తిరిగి వచ్చాడు. హాడూ, నొహరీ కలసి నాకు వ్యతిరేకంగా కుట్ర పన్నారు. నీవు నా మాట మన్నించకపోతే నేను బ్రహ్మాండమైన విప్లవం లేవదీస్తానని" నిన్న రాత్రి నొహరీ నన్ను బెదరించాడు.

నేను :- అతడు అభిలషిస్తున్న దేమిటి మహారాణీ ?

మహా :- "దాన్ని గూర్చి ఆలోచించడం గూడా అసంభవం." మళ్లీ అహ్మాసో వైపు తిరిగి అన్నది-నేనూ నా పూర్వీజులూ దేవతలను సన్మానించ లేదా? ఈ నీచుణ్ణి లొంగదీయ గలవాడు యీ దేశంలో లేడా?

నేను మళ్ళీ అదే ప్రశ్న వేశాను — నొహారీ కోరుతున్న దేమిటి?

మహారాణి నా వైపుకు తిరిగి అన్నది — తనకు సెరాఫిస్ సమాధిని కొల్లగొట్టుటకు నేను అనుమతి యివ్వాలట; తర్వాత బలాత్కారంగా రక్షక పూజారులను తొలగించి వేయగలడట.

అహ్మా :- ఇది జరగడానికి వీలులేదు. అలా జరిగితే దేవతల ప్రచండ కోపాగ్ని రాజ్యమంతా వ్యాపిస్తుందనడంలో సందేహం లేదు.

మహారాణి తనను తాను నిగ్రహించుకొని ప్రశాంతంగా నాతో అన్నది — ప్రాచీన మిశ్రదేశ రక్షకులైన మహాదేవతలు హోరస్ - థాత్ - అనుబిస్‌లు యీ సంకటావస్థలో యీ సేవకురాలుకు సహాయం చేస్తారనే నేను మిమ్ము పిలిపించాను.

వారు తప్పక చేస్తారు అని నేను ధృడంగా చెప్పాను.

అప్పుడు నన్నేమి ఆవహించిందో యిప్పటికీ నాకు తెలియదు. మహారాణి అధికారం సురక్షితంగా వుండడంలోనే మా మేలుందనీ, నొహారీ అధికారమే వస్తే ఒక్క రోజైనా జీవించి వుండడం దుర్భరమని స్పష్టంగా తెలుస్తున్నది.

నా మాట మహారాణి దుఃఖాన్ని చాలవరకు వుపశమనం జేసింది. మరొక మారు ఆ సుందర వదన మండలం మీద హాస రేఖలు తొణికిసలాడినవి. చప్పట్లు గొట్టూ అన్నది "మాననీయ థోత్‌మస్, మీ యీ హామీకి చిరకాలంగా కృతజ్ఞతతో వుంటాను. సింహాసనాన్ని కైవసం జేసుకోవడానికి ఇది నొహరీ ప్రయత్నమని నాకు బాగా తెలుసు.

నేను :- అతడు రాజ్యాధికారాన్ని కోరుతుంటే ముందే ఖజానాను చేజిక్కించుకోవాలని ఎందుకు అనుకొంటున్నాడు ?

మహా :- ధనంతో దేశ ఘాతకులను కొనవచ్చు.

నేను :- ఓహో ! అదా సంగతి !

మహా :- ఏమైనప్పటికీ ఖజానాకు పూర్తి కాపలా పెట్టాలి. నొహరీ - ప్సారోలు పూజారులను అంతం జేసినా ఓసరిస్ దయవల్ల సమాధి ఇంకా సురక్షితంగా వుంటుంది.

నేను :- బలాత్కారంగా సమాధిని బ్రద్దలు జేయలేరా ?

రాణి మందహాసంతో తల అడ్డంగా త్రిప్పుతూ అన్నది—"ఇది అసంభవం. వేల కొలది.సంవత్సరాల నుండి ఖజానా సురక్షితంగా వుంచబడింది. నే నీ విషయంలో ప్సారోను శంకిస్తున్నాను. వాడొక గొప్ప గారడీవాడు. మంత్ర - తంత్రాలు గుప్త రహస్యాలూ బాగా తెలిసినవాడు. వాడికి సమాధి జొచ్చే మార్గ మేదైనా తెలుసేమో."

నాకూ యిదే భయం. ఎందుకంటే ప్సారో గారడీ అంతా ఆధునిక జగత్తుకు సంబంధించినదని నాకు తెలుసు.

నేనొక క్షణకాలం ఈ సమస్యను గూర్చిన అన్ని అంశాల మీద ఆలోచించి రాణితో అన్నాను — నే నీ విషయంలో థాత్‌ను సంప్రదిస్తాను. థాత్ మహాజ్ఞాని. ఇది వాస్తవం గూడా; ఎందుకంటే చాంగ్ వంటి ధీమంతుణ్ణి నా జీవితంలో చూడలేదు.

# 19 భయంకరమైన తుపాను

మేమొక అగ్నిపర్వత శిఖరంమీద వున్నామంటే అతిశయోక్తి కాదనుకుంటాను. ఎప్పుడో ఒకప్పుడు అంత్య ఘడియలు వచ్చి భూదేవి మమ్మల్ని కబళించవచ్చు. మేము కేవలం బౌద్ధిక శక్తిమీదే ఆధారపడి వుండాల్సొస్తే దానికి యే రూపం ఇచ్చి వుండేవాళ్ళమో చెప్పలేను. నేను నా మిత్రుల సలహా తీసికొనే అవకాశం లభించలేదు. నే నా రాత్రి చాలా ప్రొద్దు పోయాక రా-మందిరానికి తిరిగి వచ్చాను. నేను వచ్చిన తరువాతనే యీ పెనుతుపాను ప్రారంభమైంది.

మధ్యలోని పెద్ద వసారాను ఆనుకొని వున్న ఆ చిన్న గదిలో మేము నల్గురం కూర్చొని వున్నాం. రాణితో జరిపిన సంభాషణాంశాన్ని చెప్పడం పూర్తి అయ్యీ కాకముందే వసారావైపుగా ఒక పెద్ద కోలాహలం విన్పించింది. వెంటనే నేనటు పరుగెత్తాను.

నే నక్కడ చూచిన భయంకర దృశ్యాన్ని వివరించ డానికి నా హృదయం కంపిస్తూంది. మానవరక్తం నా ముందు ప్రవహించడం జీవితంలో ప్రథమంగా చూచాను. నేనీ విష యాన్ని గ్రంథాల్లో చదివాను కాని, సభ్యపురుషులు గూడా రాక్షసు లౌతారని నే ననుకోలేదు.

రా మందిరం ఆరోజున దీపాలతో దేదీప్యమాన మైంది. అది సూర్యభగవానుని ఉత్సవదివసం. మందిరం ఎదుట చాలామంది పూజారులు గుమిగూడారు. అదే సమయంలో ఆపాదమస్తకం ఆయుధాలతో మునిగిన ఇరవైమంది సైనికు లక్కడకు వచ్చారు.

ద్వారపాలకుడు మొదటి బలి అయినాడు. నా చెవుల్లో గింగురుమన్న ఆర్తనాదం అతనిదే.

నే నక్కడ నోహరీని చూచాను. అతని సువర్ణ కవచం వెలుగులో మిడిసిపడుతోంది. అతని పార్శ్వంలో ప్సానో వున్నాడు. అతని చేతిలో ఆనాటి రథికుని చేతిలో వున్నదాని లాంటి పెద్ద విల్లొకటి వుంది. వీరిద్దరి దాపులోనే ఎందరో సిపాయిలున్నారు. వాళ్ళు సునాయాసంగా మందిరపు క్రింది హాలులో ప్రవేశించి పాపం ఆ శస్త్రహీనులైన పూజారుల మీద విరుచుక పడ్డారు.

వాళ్లలో బ్రతికి బైట పడ్డవాళ్ళు చాలా తక్కువ. వాళ్ళు హాలులోని స్తంభాల మరుగున నక్కారు. తర్వాత ద్వారంవద్దకు వచ్చి చీకటిరాత్రిలో మాయమై పోయారు. మిగిలినవారు క్రూరంగా వధింపబడ్డారు. వాళ్ళ ఆక్రందిం

చారు. నొహరీ తన కరవాలాన్ని పైకెత్తి "సమాధికి, సమాధికి" అని అరవడం నేను చూచాను.

అటు తరువాత నొహరీ అనుచరులు అతన్ననుసరించారు. కొద్దిసేపట్లోనే భూగృహంనుండి ఆయుధాల ఖణాఖణలు వినవచ్చినవి. నేనొక్క క్షణంగూడా ఆలస్యం చేయకుండా అక్కణ్నించి తిరిగి వెళ్ళాను. మిత్రులవద్దకు వచ్చేసరికి వారు తమతమ ముఖాలను ధరించి వున్నారు. నేను వెఱ్ఱికేక పెట్టాను. "నొహరీ పూజారులను బలిగొన్నాడు. అతడిప్పుడు సమాధిని ప్రవేశించే యత్నంలో వున్నాడు. దాని నతడు వశం చేసికొంటే మన ప్రాణాలు..."

ధీరేంద్ర:- "రివాల్వరు—నావెంట" అని అంటూ గది నుండి బయటకొచ్చాడు. చాంగ్ - ధనదాసులు ఆయన వెంట వున్నారు. నేను వారి వెనగ్గా వెళ్తున్నాను. అప్పుడు నా హృదయంలో యీ విచిత్ర దృశ్యం ఆశ్చర్యకరంగా మెరిసింది. ప్రాచీన మిశ్ర దేవతలు—వీరి పూజా-పురస్కారాలు 2500 సంవత్సరములకు పూర్వమే అంతరించినవి — నేడు ఆధునిక ఆగ్నేయాస్త్రాలతో సుసజ్జితులై సాగిపోతున్నారు.

మేము భూగృహంలో ప్రవేశించినప్పుడు ఆలస్యంగా వచ్చామనిపించింది. ఎందుకంటే రక్షక పూజారుల శరీరాలు అప్పటికే రక్తసిక్తమై భూమిమీద పడివున్నవి.

తరువాత, కేవలం క్షణంలో జరిగిన పనైనప్పటికీ ఒక్క శబ్దంలో వర్ణించలేము. నాకు జ్ఞాపకమున్నంత వరకూ నే నా ప్రయాస ననుభవించలేదు. కాని నేను చాలా భయ

పడ్డాను. నా చేతిలో పన్నెండు గుళ్ళు గల పిస్తోలు సిద్ధంగా వున్నప్పటికీ వుపయోగించడం గూడా గుర్తు లేకపోయింది. నేను భయంతో వణుకుతూ, నా జీవితంలో అద్వితీయమైన ఆ భయంకర దృశ్యాన్ని చూస్తూ వుండిపోయాను.

నేను అస్పష్టమైన ప్రకాశంలో కత్తులు మెరిసి పోతూండడం చూశాను. అక్కడ నేను కొన్ని మానవ మూర్తులనుచూశాను. వాటిలోకొన్ని పసుగెత్తుతున్నవి. కొన్ని ముందుకు పోతున్నవి. ఇంకా కొన్ని వణుకుతూ దొర్లి పోతు న్నవి. యీ పశు వదనులైన మిశ్ర దేవతలు తమ శత్రువుల మీద సింహాల్లాగా లఘించి వారి నెలా వధిస్తూన్నారో చూశాను. హోరస్ ముఖం ఒక్క నోహరీ తప్ప అందర్నీ మించిపోయింది. ఆయుధాల ఖణ ఖణలూ, ఒరిగి పోతున్న మనుష్య కవచాల దబ దబలూ, పిస్తోళ్ళ ధన్- ధన్‌లూ నన్ను చెవిటి వాణ్నిగా చేసినవి.

ఇక యీ కాండ సమాప్తమైంది. ప్సారో, నోహరీ, మిగిలిన వారి అనుచరులూ వైదొలగడం ప్రారంభించారు. సోపానాల మీదుగా ప్రధాన మండపంలోకి పారిపోయారు. ఇక మేము నల్గురం మాత్రమే మిగిలాం. మా సమీపంలోనే మృత్యువు పాలబడ్డ పూజారులూ, నోహరీ సైనికుల శవాలు అయిదూ పడివున్నవి.

ధీరేంద్రుడు సోపానాల పై భాగానికి పసుగెత్తుకొని వెళ్ళాడు. తర్వాత మందిర ద్వారంలో మరికొన్ని కాల్పులు జరగడం విన్నాము. ఇది ఆఖరు కాల్పులు. అటుపైన నోహరీ

అతని అనుచరులుగా నది ఒడ్డుకు చేరుకొని నావపై తిరిగి వెళ్ళి పోయారు. ఈ విధంగా నొహారీ మొదటి దెబ్బ వృథా అయింది.

ఒక్క నిముషంలో ధీరేంద్రుడు మా వద్దకు చేరుకున్నాడు. భుజం రక్తసిక్తమై వుండడం నేను చూశాను. నేను భయపడి అడిగాను — మీకు గాయం పెద్దగా తగిలిందా ?

ధీరేం :- కేవలం చర్మం కొద్దిగా చీల్చుకు పోయింది. ఆ పసిడి రక్కసుడు ఎలాగో బ్రతికి బయట బడ్డాడు. మేము గురి జూడడానికి వీలు లేనంత సమీపంలో వున్నాం.

ధన :- మనం ఒక్క క్షణంగూడా ఇక్కడ సురక్షితంగా వుండలేమని మీరు గుర్తుంచుకోవాలి. సూర్యోదయంతో పాటు నొహారీ తిరిగివచ్చే అవకాశాలున్నవి. మనం అతని సైన్యాధిక్యత ముందు యేమీ చేయలేని వాళ్ళమౌతాం.

నేను :- కాని యిక్కడి ప్రజల్లో అంధ విశ్వాసాలు అధికంగా ఉన్నవని గూడా గుర్తుంచుకోవాలి. వారు దేవతలనుకొంటున్న వారిపై యుద్ధం జేయడానికి సంకోచిస్తారు

చాంగ్ :- అయినా బొంబాయి, కలకత్తా, పాట్నా బెనారస్ లాంటి మహానగరాలను సందర్శించి వచ్చిన ప్సారో అనుబిస్ రివాల్వర్ మోసంలో పడిపోడు. ఇప్పుడు నాటకం అంతమైనట్లే గుర్తించాలి. మనకొక్క అరగంట మాత్రమే సమయమున్నది. ఈలోగానే యేదో నిర్ణయం జేసుండి.

నేను :- మనం రాజ ప్రాసాదానికి వెళ్ళాలి. అక్కడ మినహా మరెక్కడా సురక్షితంగా వుండలేం.

నేను మాట్లాడుతున్న ఈ తరుణంలో ధనదాసు ద్వారం వద్దనున్న చిత్రలిపిని చూడడం ప్రారంభించాడు. ఆయన నన్ను పిలిచి గాబరాగా అన్నాడు — ప్రొఫెసర్, గోబ్రైలాను తెచ్చారా?

నేను :- లేదు.

ధన :- అయితే త్వరగా తీసుకరండి. దీనిలో వున్న అక్షరాలన్నీ గోబ్రైలా మీదగల అక్షరాలవలె నాకు కన్పిస్తున్నవి. ఈ తిరిగే చక్రాలు గోబ్రైలాకు సంబంధించినట్లు కన్పిస్తున్నవి.

నేను కాసేపటిలో పైకి వెళ్ళి గోబ్రైలాను తీసుకవచ్చాను. కాని నాకు ఆ చక్రాలకు, బీజక్‌కు సంబంధమున్నట్లు తోచలేదు. చివరకు చాంగ్ మహాశయుడు - లేక ఇంద్రజాల దేవత — అసలు రహస్యాన్ని బయట పెట్టాడు. ఆయన అన్నాడు — నాకు అర్థమైంది; ఇది మరేమో గాదు. అతఘుర్ అక్షరాల తాళం. రా ప్రొఫెసర్, నీ పనేమంటే చేతిలో బీజక్ (గోబ్రైలా) వుంచుకొని మొదటి పంక్తి మీద దృష్టి నిలపడం. నేను చక్రాన్ని త్రిప్పుతాను. బీజక్ లోని మొదటి పంక్తి యొక్క మొదటి అక్షరం దీనిలో కన్పించగానే ఆపమని నాతో జెప్పు. తర్వాత గూడా ఇక ఇదే విధానం.

బీజక్ మీద అన్నిటికంటె ముందున్నది కపాళమూర్తి. చాంగ్ చక్రం త్రిప్పగానే అందులో యెన్నో చిత్రాక్షరాలూ, సంకేతాలు రావొడగాయి. కపాళమూర్తి రాగానే

నేను చాంగ్ మాట గుర్తు తెచ్చుకొని ఆపివేసేయమని చెప్పాను.

ఇక యిప్పుడాయన రెండవ చక్రాన్ని త్రిప్ప సాగాడు. అక్కడగూడా రెండవ అక్షరం రాగానే ఆపించాను. ఈ విధంగా 3, 4, 5...చివరకు మేం మొదటి పంక్తిని పూర్తిజేశాం. ఇప్పుడీ పంక్తిలో బీజక్‌లో వున్న వాక్యాలూ, అక్షరాలే వున్నవి.

ఈ పని పూర్తికాగానే మేము యిత్తడి కడ్డీని త్రిప్పి చూశాము. ఇప్పుడది తేలికగా సూర్య విగ్రహానికి వెనుక వున్న రాతిగోడలోనికి నెట్టివేయవచ్చని తెలిసింది.

ద్వారానికి యెన్నైతే యిత్తడి చువ్వలున్నాయో, గోబ్రైలాలో సరిగ్గా అన్నే పంక్తులుండడం, యెన్ని చక్రాలున్నాయో అన్నే అక్షరాలుండడం గూడా మేము గమనించాము. మేము అదేవిధంగా చక్రాలన్నిటినీ త్రిప్పి ఒకదాని తర్వాత ఒకటిగా ఇత్తడి చువ్వల నన్నిటినీ కుడ్యభాగంలోనికి నెట్టేశాము ఇప్పుడు ద్వారం మీదనూ, చక్రాల కెదురుగల అక్షరాలనూ కలిపి చదివితే యీ విధంగా వున్నది —"సమాధిలో ప్రథమంగా ప్రవేశించిన వానికోసం అనుబిస్ ప్రతీక్షిస్తూంటాడు. అతడు వానిని శాశ్వతమైన నరకానికి గొని పోతాడు." దాని మీదున్న గోబ్రైలా శాసమిది.

సెరాఫిస్ సమాధిలో అనేక గదులున్నవి. వాటి గోడలమీద అనేక రకాల రంగురంగుల చిత్రాలున్నవి. వాటిల్లో స్వర్గీయుడైన థేబిస్ రాకుమారుని జీవిత ఘటనలు

చిత్రించబడి వున్నవి. మమ్మీ వున్న గదికి యేవిధమైన అలం కారాలు లేవు. శవ పేటిక ఒక చిన్న రాతి అపగుపై వుంచ బడ్డది. దానికి నలువైపులా పాత్రలూ, బుట్టలూ, భోజన సామగ్రి మొదలగు వస్తువులున్నవి. శవోత్సవంతో పాటు మిశ్రదేశం నుండి వచ్చిన వస్తువులివే. వీటిల్లో భోజనవస్తువు లేవో స్పష్టంగా తెలియడం లేదు. యుధిష్టరుని కాలం సుదూరం. అయినప్పటికీ సెరాఫిస్ ఆయన సమకాలికుడే కావచ్చు. ఒక గదిలో సెరాఫిస్ యొక్క పెద్ద విగ్రహ మొకటి వున్నది. ఆ విగ్రహం సింహాసనంమీద వున్నట్లు చూపబడింది. దాని ప్రక్కనే సెరాఫిస్ ఆత్మవిగ్రహం వున్నది. ఈ గదిలోనే ఖజానా వున్నది. నేనిక్కడ అనేక పెట్టెలు రకరాకాలైన రత్నాలతో నిండి వుండడం చూశాను. వీటి విలువ కొన్ని కోట్ల రూపాయలుంటుంది. అవి 14 పెట్టెలు. నేలమీద పసిడి యిటుకలు పరచబడి వున్నవి. ఈ యిటుకలన్నీ ఒకే ఆకారం గలిగి వాటిపై సెరాఫిస్ మొహరు వేయబడి వున్నది. అతడు 12వ థేబిస్ రాజవంశానికి జెందిన చక్రవర్తి.

ఈ అపార ధనరాసుల సందర్శనం ధనదాసుమీద అంతులేని ప్రభావాన్ని ప్రసరింప జేసింది. తన మెడను ముందుకు వంచి విరగబడి నవ్వుతున్నాడు. తనను తాను విస్మరించినట్లున్నది. అతడు వున్మాదుడైనాడు. అతని స్థితి సన్నిపాత రోగివలె అయిపోయింది. అప్పుడతడు ఆ పసిడి రాసుల మధ్య పడిపోయాడు.

అదృష్టవశాత్తు మేము తీసుకపోయిన ఆ కాగడా యింకా ఆరిపోలేదు. దానిని మేము పైకెత్తి చూశాం. అతన్ని

మూర్ఛితుడైనాడు. కాని కొద్దిసేపట్లోనే స్పృహ వచ్చింది. ఇప్పుడుగూడా అతనికి మరో విషయం రుచించడం లేదు. అతడా పెట్టెలలోని రత్నాలనే చూస్తున్నాడు. వాటికి బీగాలుగూడా లేవు. ఈ రత్నదర్శనం అతన్ని బాగా ఆకర్షించింది. నేనతని ముఖంవైపు చూడసాగాను. అతని స్థితి చిత్రంగా వున్నది. కళ్లు నిస్తేజంగానూ, శూన్యంగానూ వున్నవి. అవి కేవలం తెరచుకొని వున్నవి. అతని నల్లని కంటి పాపల చుట్టూ తెల్లదనం కన్పిస్తున్నది. అతడు నోరు తెరచుకొని వున్నాడు. ఆ స్థితి జూచి నేను భయపడ్డాను. ధీరేంద్రుడు నన్ను హెచ్చరించి వుండకపోతే ధనదాసు అక్కడి నుండి కదలేవాడు కాదనుకొంటాను.

ధీరేం :- కాలం వృథాగా గడచిపోతోంది. మనం యిక్కడకు వచ్చి పావుగంట దాటిపోయింది. నొహరీ దేవాలయానికి యేసమయంలోనైనా రావచ్చు.

చాంగ్ :- అవును. "ఇది అక్షరాలా నిజం. మనం వెంటనే వెళ్ళిపోవాలి."

ధనదాసు రత్నరాసులమీద చేయిబెట్టి పిచ్చెత్తినట్లుగా అరచాడు — "వీటన్నిటినీ వదలివేశా !"

ధీరేం:- మూర్ఖుడా, వీటిని మనవెంట యెలా తీసుకవెళ్ళ గల్గుతామని భావిస్తున్నావు ?

నేనెంతో వ్యాకులపాటుతో ధనదాసు చేతులు పట్టుకొని అన్నాను — ప్రాణాలే దక్కకపోతే ప్రపంచపు ఖజానా మొత్తానికిగూడా విలువలేదు. నడువు.

మేము బలవంతాన బయటికి లాక్కు వచ్చాము. అక్కడినుండి చాంగ్ అతనిని మెట్లమీదుగా మందిరపు ప్రధాన మండపంలోకి తీసుకెళ్లాడు. అతడప్పుడు త్రాగిన వాడిలా నడుస్తున్నాడు. నేనూ ధీరేంద్రుడూ వెనక వున్నాం. మేము ద్వారాన్ని మూసివేశాము. ఇప్పుడు ద్వారం చక్రాల మీద గోబర్లైలా శాపం స్పష్టంగా కన్పిస్తోంది. ఇత్తడి చువ్వలను వాటి రంధ్రాలనుండి తీసి చక్రాలలో పెట్టాము. తర్వాత చక్రాలను ఇటు - అటు త్రిప్పాము. ఇక మాకు రహస్యం తెలిసిపోయింది. అసలు విషయమేమంటే - ప్రతి ఒక చక్రం లోభాగాన నాలుగు మూలలు గల మేకువంటి వస్తువొకటి వున్నది. అది చువ్వ యొక్క గుండ్రని రంధ్రంలో వుండిపోతుంది. ఇక చువ్వ కదలలేదు. కాని కడ్డీ (చువ్వ) రెండవవైపు గుండ్రంగా వున్నప్పటికీ ఎదుటిభాగం ఈ చివర నుండి ఆ చివరవరకు యేదో ఒక పదునైన ఆయుధంతో కోసి వేయబడినట్లుంది. ఇందువలన చువ్వలయొక్క యితర భాగాలకూ, చక్రమూ - చువ్వల మధ్యనూ చాల తక్కువ తేడా వున్నట్లుంది. మనకు కన్పించు చువ్వ భాగం అంగుళం మంధాన వుంది. చక్రం మేకు సరిగ్గా ఆ విశేషాక్షరం క్రిందనే వుంది. అందువల్ల మేకు అక్షరం ఎదటికి రాగానే అది చువ్వ రంధ్రంనుండి బయటికి వస్తుంది. అప్పుడు చువ్వను తొలగించడం సులభమౌతుంది. కాని అక్షరం దాటిపోతే మేకు మళ్ళీ రంధ్రంలో జొరబడిపోతుంది. తిరిగి చువ్వ అక్కడే ఇరుక్కుపోతుంది. చక్రాలు 100 కంటె ఎక్కువ వున్నవి. అందు ప్రతి ఒక్కటి అభేద్యమైన ఒక్కొక్క పెద్ద బీగం అనుకోవాలి.

మందిరం వున్న పర్వతం క్రింద, నదిలో చాల నావలు కట్టివేయబడి వున్నవి. ఇవి 'రా' మందిరం పూజారులకు మాత్రమె ప్రత్యేకించబడినవి. వాటిమీద వారు నగరానికి వస్తూ పోతూ వుంటారు. ఈ నాటి వేనిస్ నగర కాల్వలలాగే మితనీ హార్పిలోని కాల్వలు రోడ్లవలె వుపయోగ పడతాయి. నిజంగా మితనీ హార్పి ఆ సుందరమైన ఇటలీ నగరాన్ని బోలి వుంటుంది. రధాలూ, వాహనాలకువలె అక్కడ తేలిక డింగీలు అన్ని చోట్లకూ మనుష్యులను చేరవేస్తుంటాయి. నదీ తీరాన వున్న ప్రతి ఒక భవన ద్వారంనుండి రేవు వరకు సోపానాలు నిర్మించబడి వున్నవి.

మేము కొద్ది సేపట్లోనే మా సామానంతా తీసుకొని ఒక నావపై ఎక్కి దానిని నదిలోకి నెట్టివేశాం. ఇది పెద్ద ఆపదతో కూడిన పని. ఎందుకంటే యే సమయంలోనైనా ఆ అంధకారంలో నొహారీ – ప్సారోలు వచ్చి మమ్మల్ని నాశనం చేయగల్గుతారు. ధీరేంద్రుడు చుక్కాని బట్టాడు. మేము ప్రవాహాని కెదురుగా నడపసాగాం. అదృష్ట వశాత్తు రాత్రి చాల చీకటి మయంగా వుంది. అర్ధరాత్రి సమయ మైనా నది ఒడ్డున చాలామంది మనుష్యులు తిరుగుచున్నారు. ధీరేంద్రుడు తెడ్లు వేయడంలో బహు నేర్పరి. కనీసం చిన్న ధ్వని గూడా కాదు. ఈ విధంగా మేము ఎవరికీ తెలియ కుండా రాజ ప్రాసాదానికి చేరుకొన్నాం.

నేను తలుపు తట్టాను. వెంటనే మమ్మల్ని లోపలకు తీసుకున్నారు. ద్వారపాలకుడు నన్ను బాగా ఎరుగును. అతడు నాకోసమే నిరీక్షిస్తున్నట్లుంది. ఎందుకంటే మహారాణి నేను

యే సమయంలో యిక్కడకు వచ్చినా లోపలకు ప్రవేశమివ్వాలని ఆజ్ఞాపించింది. మేము ద్వారపాలకునితో సంభాషించేప్పుడే నది ఆవైపునుండి నగారాధ్వని వినిపించింది. మేమిద్దరం నోహారీ మహలువైపుకు చూశాం. ఆ ప్రాంగణమంతా వందలకొలది కాగడాల వెలుగుతో పట్టపగలుగా వుంది.

ద్వారపాలకుడు గాబరా పడ్డాడు. అతడు నా చేయి పట్టుకొని అన్నాడు—"దీని అర్థమేమో మీకు తెలుసుగా? సింహగర్జన మీరు వింటున్నారుగా?

నేను :- నోహారీ తన సైనికులను సమావేశ పరుస్తున్నాడు?

ద్వార :- అవును. దీని అర్థం విద్రోహం, విప్లవం. ఈ పాపాత్ముల మీద ఓసరిస్ వజ్రపాతం వేయుగాక! రేపు సూర్యుడుదయించకముందే మితనీ నగరం సంగ్రామ భూమై పోతుంది.

ఇదే సమయంలో మళ్లీ నగారా శబ్దం విన్నాం. ఇంకా నది కావల కోలాహలం గూడా విన్నాం. సేనాపతి స్వయంగా తన సైన్యాన్ని తీసుకొని రా మందిరం వైపుకు వెళ్తున్నాడు. అతడు దక్షిణ దిశగా వెళ్తున్నాడు. దారిలో వున్న భవనాల గోడలమీద వూగుతున్న కాగడాల వెలుగును చూశాం.

ద్వార :- అయ్యో మితనీ హార్ప్! అయ్యయ్యో సెరిసిస్!! మితనీ నగర మహారాణీ! నోహారీని, వాడి సైన్యాన్ని ఆమె ఎలా జయించ గల్గుతుంది?

నేను వీరుణ్ణి కాకపోయినా మాటల్లో మాత్రం మంచి శౌరత్వం వున్నది. నేనన్నాను - భయపడకు. థాత్ - అను బిస్, స్వయంగా హోరస్ గూడా మహారాణి సెరిసిన్ కోసం, యింకా చెప్పాలంటే ఆమె సింహాసనం కోసం పోరాడడానికే యిక్కడకు వచ్చారు.

ద్వార :- అయితే ఆ అద్భుత సమయం సమీపించింది. ఇప్పుడు ప్రళయం ఆసన్నమైంది. ఎందుకంటే దేవతలు స్వయంగా మానవ మాత్రులతో పోరాడడానికి పృథ్వికి దిగి వచ్చారు. మిశ్ర భూమి వుత్పన్నమైన సమయంలో గూడా యిలాగే దిగారు.

'నిర్భయంగా నేరుగా పైకి రండి' అని నా స్నేహితులను పిల్చాను. హోరస్ - థాత్ - అనుబిస్‌లు మహారాణి ప్రాసాదంలో ప్రవేశించారు. వుద్యానాన్ని దాటి మేము అభ్యంతర మందిరానికి చేరుకొన్నాం. ఆ ముగ్గురూ మందిర మధ్య భాగంలో వున్నారు. అచ్చటి గోడల మీదనూ, పై భాగంలోనూ యెన్నో రకాల చిత్రాలు చిత్రించబడి వున్నవి. ఇప్పుడు పాచిక వేయబడిందని నేను అనుకొన్నాను. దీనిలో రాణి నాశనమైతే మేము గూడా ఆమెతో పాటు నాశనమౌతాం. అప్పుడు నేను కళ్ళు మూసుకుని కొంచెం సేపు నాలో నేనే మాట్లాడుకో సాగాను.

ఆ సమయంలో నేను నా మాతృ భాషలో మాట్లాడుతున్నానన్న జ్ఞానం గూడా లేకపోయింది. నా మాటలు పూర్తి కాగానే యెదురుగా అహ్మసోను జూశాను. "మీరు యే భాషలో మాట్లాడుతున్నారని" ఆయన నన్ను అడిగాడు.

అప్పుడు నాకు సాహసం కల్గింది. నా హృదయం నుండి వంచన తొలగిపోయింది. నే నన్నాను – "నేను నా మాతృ భాష హిందీలో మాట్లాడుతున్నాను. నాలో నేనే యీ కష్టాలను గూర్చి అనుకొంటున్నాను.

ఆయన ఆశ్చర్యంతో నా మాట విని నా చేయి పట్టుకొని అన్నాడు – మహారాణి మీకోసం ప్రతీక్షిస్తున్నది. ఆమె నేటి రాత్రంతా నిద్రించలేదు.

# 20 బక్రీ మొదటి దెబ్బ

అహ్మోసో నా ముగ్గురు అమర మిత్రులను మహల్లోని ఒక చిన్న గదికి తీసుకవెళ్ళాడు. అక్కడ పరమ సుందరమైన ఇబిస్ దేవత విగ్రహ మొకటున్నది. వారిని అక్కడ వదలి నేనూ — అహ్మోసో అంతఃపురానికి వెళ్లాం. ఆమె యెంతగా భయపడి వున్నదంటే నన్ను చూడగానే ఆమె అశ్రువులను రాల్చింది. నమస్కరించి యిలా అన్నది— ఓ థోత్‌మస్, చివరకు తుపాను రానే వచ్చింది. నొవారీ తన సైనికులను సమీకరించాడు. ఇప్పు డతడు రాజ ప్రాసాదాన్ని స్వాధీన పరచుకోవడానికి వస్తున్నాడు.

రాణి ప్రక్కన ఒక వ్యక్తి నిలబడి వున్నాడు. ఇంత వరకూ నే నతనిని గుర్తించలేదు. ఆతని నల్లని గడ్డం, విశాల వక్షంవరకూ వ్యాపించివుంది. అధికార తేజాన్ని గురిపిస్తున్న అతని వదన రక్తవర్ణాంకితమైన లోహ సిరస్త్రాణం – యివన్నీ

చూసి యితడు అంగరక్షకులకు కెప్టెన్ అని వూహించాను. అతని విషయం అహ్మాసో అనేకసార్లుగా నాతో అంటూ వచ్చాడు.

రాణి ఎంతో చింతాక్రాంతమై వుంది. ఆమె తన రెండు హస్తాలనూ జోడించి ప్రార్థించినట్లుగా అన్నది— నాతండ్రి సాక్షాత్తూ థేబీయ చక్రవర్తుల వంశంవాడు. ఇక నా వంశ నాశనం దాపురించింది.

ఇది విని బక్నీ తన కరవాలంమీద చేయివేసి బిగ్గరగా అన్నాడు—ఓ నా పూజ్య మహారాణీ, దేశద్రోహి యెవ్వడైనా నాయొక్కయూ, నా సైనికుల యొక్కయూ మృతకళేబరాలపై మాత్రమే నడచి లోపలకు ప్రవేశింప గల్గుతాడు. మాలో ప్రతి ఒక్కరం రాజ సింహాసనంకోసం ప్రాణాలర్పించడానికి సిద్ధంగా వున్నాము.

మహా :- ఓ శూర బక్నీ, నాకీ విషయం తెలుసు. అయినా కొంచెం ఆలోచించి చూడు. అంగరక్షకులు రాజ్యమంతటిలోనూ సాహసవంతులు, శక్తివంతులూ అయినప్పటికీ ఒక్కొక్కడు 20 మంది సైనికుల నెలా ఎదిరించగలుగుతాడు ? సైన్యమంతా నొహారీ పక్షానే వుంది.

నేను అక్కడ నిలబడి ఆ అల్ప వయస్కురాలి సంతాపాన్ని ఎక్కువసేపు చూడలేకపోయాను. ఆమెను ఓదార్చడాని కేమైనా చెప్పడం యుక్తమని భావించాను. ఇందుకుగాను నా మిత్రులైన చాంగ్-థీ రేంద్రులపై బాగా విశ్వాసముంది. నేనన్నాను — సెరాఫీయుల మహారాణీ, సెరిసిస్, ఏమాత్రం భయపడవద్దు. కేవలం రాజ్యంలోని అంగరక్షకులే

గాక మీ తండ్రి-తాతల పూజ్యదేవతలు గూడా - వారిని ప్రాచీనకాలంలో నైలు తీరవాసులు పురాతన నగరాల్లో పూజిస్తూండేవారు - మీ హక్కులకోసం, మీ రాజ్యం కోసం కత్తి బట్టడానికి సిద్ధంగా వున్నారు. ఇప్పుడుగూడా వారు మీ మహలులోనే వున్నారు. మీకోసమై పోరాడ డానికి సిద్ధంగా వున్నారు.

రాణి:- ఇక్కడ వున్నారా!

నేను:- అవును. రాజ ప్రాసాదంలో.

రాణి:- థాత్, శక్తిశాలి హోరస్...

నేను:- మృత్యుదేవత అనుబిస్‌గూడా.

వారిమీద విశ్వాసంతో నేను యీవిధంగా నటిం చడం పిరికితనమైనప్పటికీ క్షణమాత్రంలో ఆమె దుఃఖం మాయమైందని చెప్పగలను. అహ్మోసోతో "అయితే నేను భయపడాల్సిన అవసరం లేదన్నమాట" అని అన్నప్పుడు ఆమె అధరాలపై చిరునవ్వు చిందుతోంది.

క్షణం క్రితం దుఃఖసాగరంలో మునకలు వేస్తున్న ఆ రాణి యిప్పుడొక పసిపిల్లలా ఎంతో ప్రసన్నంగా వున్నది. నా హృదయంలో ఆమెపట్ల యెంతో గౌరవం, ప్రేమ జనించి నవి. నేను నా మిత్రద్వయ పరాక్రమాన్ని, తెలివితేటలనూ గూర్చి ఆలోచిస్తున్నప్పుడు నది ఆవలివైపు నున్న కాగడాల వెలుగు స్ఫురణకు వచ్చింది. మేమెక్కడ వున్నామో ప్సారో తెలుసుకొనే వుంటాడు. మావన్నీ వేషాలుమాత్రమే నని ప్రజలను రెచ్చగొట్టి వుంటాడు. ప్రజలు విశ్వసించకపోయినా యుద్ధవీరుడూ, భయంకరుడూ, దృఢహృదయుడూ అయిన

నోహరీ వున్నాడు. అటువంటి శూరుడు రాజద్రోహాన్ని తల పెట్టినప్పుడు తిరిగి వెనుకంజ వేస్తాడనడం అసంభవం. అసఫలత మృత్యువుగానూ, సఫలత సింహాసనా ప్రాప్తిగానూ దీని పరిణామస్వరూప మౌతుంది.

క్షణక్షణం దండయాత్ర జరుగుతుందన్న భయముండడంవల్ల మేము యుద్ధ సమావేశాన్ని జరుప నిశ్చయించాము.

దేవతల సలహాకోసం వారున్న చోటికి వెళ్ళాను. నేను వారిని కలుసుకోవడానికి యిబ్బందిపడ్డాను; ఎందుకంటే వారు మందిరంలో క్రిందిభాగాన వున్న భూగృహంలో వున్నారు. వారు తమ వేషాలను తీసివేసి కూర్చొని పండ్లు తింటూండటం చూసి నేనెంతో సంతోషించాను. వీటితో పాటు మిశ్రదేశపు ద్రాక్ష సారాగూడా దేవ ప్రీత్యర్థంగా దేవాలయంలో వుంచారు. కాని నా మిత్రుల్లో మధుపానం జేసేవారెవ్వరూ లేనందున కేవలం పళ్లే తింటున్నారు. చాంగ్ నవ్వుతూ అన్నాడు – "ఏం థోథ్‌మస్, నీవు క్షుధార్తుడివై వుంటావు. దైవ ప్రసాదం కొంచెం స్వీకరించు."

"అవును. దైవసేవార్థం యీ శరీర మెప్పుడూ సిద్ధంగానే వుంటుంది" అని నేను కూర్చొన్నాను. తృప్తిగా అందరం ఆరగించాం.

భోజనం పూర్తయ్యాక నా మిత్రులు విశ్రమించడం జూచి నేను మహారాణి యింటివైపుకు తిరిగివెళ్ళాను. అక్కడ రాణి అహ్మాసో–బక్నీలతో సంప్రదిస్తున్నది. నోహరీ సైన్యం

నదిదాటి 'రా' మందిరంవైపుకు అగ్రసరమవడం తాను చూచినట్లు అహ్మాసో చెప్తున్నాడు.

రాణి:- నే నూహించినట్లే జరిగింది. నొహారీ రా మందిరాన్ని దోచుకోవా లనుకొంటున్నాడు. జీవితమంతా అతని దృష్టి సెరాఫిస్ సమాధిమీదే వుంటూ వచ్చింది.

బక్షీ గంభీరంగా అన్నాడు — "కాని యిది మహా అధర్మం."

రాణి:- అయినా అలాంటి వ్యక్తులు ధర్మాన్ని లెక్క జేయరు. అతడెప్పుడూ దేవతలను తిరస్కరిస్తూ, నిందిస్తూం టాడు. ఏం థోఫ్మస్, దీన్నిగూర్చి ఆలోచించండి. అతడు ఖజానాను హస్తగతం చేసుకొంటాడు.

ఆమె నన్ను సంబోధించి ఎందుకు చెప్పిందో తెలి యదు. కొన్ని గంటల క్రితమే మేము సమాధి రహస్యాన్ని తెలుసుకొన్నామని ఆమెకు తెలిసివుండడం అసంభవం.

నేను:- అతడు లోనికి ప్రవేశించలేదు. మితనీహార్పి నగరమంతా కలసి ప్రయత్నం చేసినా ప్రవేశించలేదు. కాని ఇప్పుడక్కడ ఒక్క పూజారిగూడా లేడు.

రాణి:- "ఒక్కడుగూడా లేడా?" అని అడిగింది. ఎందుకంటే నేనిప్పటివరకూ పరిస్థితి మొత్తంగా వివరించ లేదు.

నేను :- అందర్నీ అంతంచేశారు; చాలా నిర్దయగా. స్వయంగా నొహారీ, స్పారోతే యీ హత్యాకాండ చేశారు.

రాణి:- ఎంత నైచ్యం! ఎంత క్రౌర్యం!! ఇది దేవ తలుగూడా క్షమించరాని పాపకార్యం.

"ఖజానాను హస్తగతం చేసికొనే ప్రయత్నంగూడా చేశారా ?" అని అహ్మాసో నన్నడిగాడు.

నేను:- అవును. కాని వాళ్ళకు అవకాశం దొరక లేదు. దేవతలు మధ్యలోనే అడ్డుపడ్డారు. నొహరీ తన అను చరులతో సహా పారిపోవాల్సి వచ్చింది.

అహ్మాసో:- "దేవతలా !" ఆయనకు దీని అర్థం తెలియ నన్నట్లు మళ్ళీ మళ్ళీ అడిగాడు.

నేను:- అవును. హోరస్, థాత్, అనుబిస్‌లు.

అహ్మాసో:- అయితే నొహరీ వారితో పోరాడడానికి సాహసించాడా ?

నేను:- "అవునంటూ" తల వొంచుకున్నాను.

రాణి :- దేవతలే స్వయంగా రక్షిస్తున్నారని తెలిసి నప్పటికీ అతడు రాజ ప్రాసాదంమీద గూడా దండెత్తడానికి వెనుదీయడనేనా దీని అర్థం? అయితే రాజ ప్రాసాదంపై దండెత్తబోయే ముందు ఖజానాను స్వాధీనం చేసుకొందా మనుకుంటున్నాడు. ఎందుకంటే వజ్ర వైఢూర్యాలతో నగరా న్నంతా కొనివేయవచ్చు. ఇది అతనికి బాగా తెలుసు.

ఇలా చెప్పే సమయంలో ఆమె సుదీర్ఘ నేత్రాలనుండి అశ్రుబిందువులు రాలాయి. "విశ్వాస ఘాతకులు! నా నలు వైపులా విశ్వాసహీనులే ! !"

ఇది విని అంగరక్షకుల కెప్టెను కత్తిదూసి రాణి కెదు రుగా మోకరించి ఇలా అన్నాడు—"అందరూ కాదు మహా రాణీ, అంగరక్షకులు తమకు శాశ్వత భక్తులుగా వుంటారు."

రాణి అతనిని లేవదీయడానికి చెయిచాచింది. అతని ఉత్సాహాన్నీ, సద్భావాన్నీ ప్రశంసించి "నీమీద నాకు యేనాడూ అవిశ్వాసం కలుగలేదు" అన్నది.

బక్నీ ఒక మహా శక్తిశాలి. ఆపాదమస్తకం వీరత్వం తొణికిసలాడుతూంది. నా కిప్పటికీ మిరిమిట్లు గొల్పే అతని కవచం, దీర్ఘమైన గడ్డం, బలిష్ఠమైన భుజస్కంధాలూ జ్ఞప్తి కొస్తున్నాయి.

సమావేశం వాయిదా వేయబోయేముందు మే మొక కార్యక్రమాన్ని నిర్ణయించాం. దీనికి సంబంధించన ప్రతిపాదన చేసింది బక్నీ. దీన్ని గురించి చాంగ్ ధీరేంద్రులతో చెప్పి నప్పుడు వారుగూడా ఎంతగానో మెచ్చుకొన్నారు.

నోహారీ దండయాత్ర కోసం నిరీక్షిస్తూ రాజప్రాసాదం వద్ద చేతులు ముడుచుకు కూర్చోవడం బక్నీ కిష్టంలేదు. సైనికుడయినందువల్ల స్వయంగా దండెత్తకుండా వాళ్ళొచ్చి పైన బడ్డ తర్వాత రక్షించుకొందామన్న మాటను విశ్వసిం పడు. ఒక్కొక్క బక్నీ సైనికుడు ఆరుగురు నోహారీ సిపాయి లను ఎదుర్కోవలసి వున్నది. అయినా అతడు స్వయంగా వెళ్ళి నోహారీ సైన్యాన్ని ఎదిరించడానికే నిశ్చయించాడు. సెరాఫిస్ ధనరాసులను వశపర్చుకొందామన్న అపోహతో సేనాపతి అక్కడే తిష్ఠ వేశాడు. సూర్యోదయానికి గంట ముందుగా బక్నీ తన సైనికు లందర్నీ రాజప్రాసాద విశాల ప్రాంగణంలో సమావేశ పర్చాడు.

నేను ఇసిస్ మందిరానికి వెళ్ళి నా మిత్రులను వారి వారి వేషాలు ధరించమనిన్నీ, పిస్తోళ్లతో పాటు సాధ్యమైనన్ని

గుళ్ళు తీసుకరమ్మనీ హెచ్చరించాను. కొద్దిమందిని మాత్రమే ప్రాసాద రక్షణార్థంగా వుంచాం. మహారాణి వుద్యానంలోకి వచ్చి తన సైనికులకు, వుత్సాహ పరిచే మాటలు కొన్ని చెప్పింది.

నాకా నాటి ప్రాతః దృశ్యాలన్ని సవిస్తరంగా ఇప్పటికీ గుర్తుకొస్తున్నవి. చంద్రుడు దిగిపోయాడు. ఆకాశం తారకా గణంతో వెలిగిపోతూన్నది. యీ పురాతన సైనికుల ఆకారాలు ఆ వెన్నెలలో నీరవంగానూ, నిశ్చలంగానూ నిలబడి నట్లు కన్పిస్తున్నవి. ఇలాంటి శక్తివంతమైన, శ్రేష్ఠవంతమైన యువ బృందాన్ని నేనెప్పుడూ చూడలేదు. మహారాణి వద్ద నుండి ఆ సైనికులకు దాపుగా వస్తున్నప్పుడు నేను వారి భుజాల వరకు మాత్రమే వున్నానని గమనించాను. పైపెచ్చు వారు ముందుకు చాపిన చేతుల క్రిందుగా నేను నిలబడే నడచి పోవచ్చు. కర్మం చాలక నా తలమీద నాలుగు వెంట్రుక లున్నా తగిలేవికాదు. మహారాణి మాట్లాడు తూన్నప్పుడు ఆమె స్వరంలో ఒక విచిత్రమైన ఆవేశం కన్పించింది. ఆమె తన వుపన్యాసాన్ని పూర్తి చేయగానే సైనికులు తమ తమ బల్లేలను పైకెత్తి భూమ్యాకాశాలు దద్దరిల్లేలాగా జయ ధ్వానాలు చేశారు.

ఆ తెలతెల్లవారే కనువెలుగులో మేము ముగ్గురు వ్యక్తులను — నా దృష్టిలో మానవులైనా అధిక సంఖ్యాకుల దృష్టిలో దేవతలు — ప్రాసాద సోపానాల నుండి దిగడం చూచాం. వీరే ప్రాచీన మిశ్ర దేశంలో అత్యద్భుత కార్యాలెన్నో చేసిన దేవతలు. అంటే ఆకాశ దేవత అయిన ఓసరిస్

పుత్రుడు హోరస్, మాయల దేవత థాత్, మృత్యు దేవత అనుబిస్‌లు.

సైనికులు తమ తాత - ముత్తాతలచే పూజింపబడిన ఆ పూజ్య దేవతలను చూసి గౌరవాశ్చర్యాలకు లోనై మళ్లీ ఒకసారి ఆకాశం ప్రతిధ్వనించేలాగా జయఘోష పెట్టారు. కొద్ది క్షణాలపాటు క్రమశిక్షణ తప్పిపోయింది. అప్పుడు బక్నీ మేఘ గర్జన వినవచ్చింది.

"శూరులారా, సాహసించండి. నేను మిమ్మల్ని నోహారీ సేనాని రాజద్రోహ కేతనాన్ని ప్రతిష్టించిన రా మందిరానికి కొనిపోతున్నాను. సృష్టి ప్రారంభ దశలో మృత్యుధర్మం గలిగిన సామాన్య మానవులతోపాటు కత్తులెత్తిన ఆ నైలు దేవతలు మళ్ళీ మితనీ నగరానికి వేంచేశారు. వారిని సందర్శించండి. భయాన్ని దరికైనా చేరనివ్వకండి. విజయం మనదే. థాత్, అనుబిస్, హోరస్‌లను ఎదిరించగలిగిన వాడెవడు? దేవతలతో పోరాడే శక్తి ఎవరికున్నది."

సైనికులు మళ్ళీ జయనాధం చేశారు. బక్నీ వెంటనే కదలిపొమ్మని ఆదేశించాడు. ఒక క్షణంలోనే సైనికులందరూ మహలునుండి నిర్గమించారు. ప్రాసాద సోపానాల క్రిందవున్న రేవులో ఎన్నో నావలున్నవి. ఒక్కొక్కరుగా సైనికులందరూ వాటిలో చేరారు. ఏమీ శబ్దం లేకుండా, శ్వాసయినా పీల్చకుండా వెళ్ళమని కెప్టెన్ ఆదేశించాడు.

బలిష్ఠులైన గులాములు తెడ్లు తీసుకొని నదీ ప్రవాహంలో దక్షిణ దిశగా శీఘ్రగతిన నడపసాగారు. ఇరువై నిమి

షాఫ్లోనే మేమూ రా మందిరమున్న పర్వత స్థలానికి చేసుకొన్నాం.

దేవతాత్రయం వున్న నావమీదే నేనూ వున్నాను. తమ కన్నివిధాలా విజయాశ వున్నట్లు ధీరేంద్రుడు మెల్లగా చెప్పాడు. ఆయన మాటలవల్ల మేము షికాయుకు బయలుదేరినట్లుగానూ, యిది జీవన్మరణ సమస్య కానట్లుగానూ వ్యక్త మవుతోంది. ఈ సందర్భంలో చాంగ్ యేమీ మాట్లాడలేదు. ధనదాసు కేవలం ఒక్కమాట అన్నాడు. గత సంఘటనవల్ల అతని హృదయంలో ఖజానాతప్ప మరేమీ లేదన్నట్లు స్పష్టమాతోంది.

ఆ అర్థాంధకారంలో హోరస్ నా చెవి దగ్గరకు చేరాడు. అతడు మెల్లగా అన్నాడు — "సెరాఫిస్ సమాధి మూల్యం మేమాత్రముంటుంది?"

నేను :- ఇది వూహాకందని విషయం. ఆ పెట్టెల్లోని రత్నాలు, పద్మరాగాలూ, నీలాలూ, పచ్చలూ, పుష్పరాగాలూ మొదలగు అమూల్య రత్నాలు రాసులుగా పడి వున్నవి. దాన్ని నేషనల్ బ్యాంకుగూడా కొనలేదనుకొంటాను.

ఇది విన్న ధనదాసు శ్వాస ఆపుకొని అన్నాడు — ప్రొఫెసర్, దోపిడిలో నా భాగం లభించనంతవరకు నే నీ దేశాన్ని వదలను.

నేను:- దోపిడీ జరిగే అవకాశమే లేదిక్కడ. మనం దోపిడీగాళ్ళం కాము. మనం గౌరవనీయులం — పెద్దమనుష్యులం.

ధన: పెద్దమనుష్యులమా! ఈ దౌర్భాగ్య మానవులకు యీ అపార ధనసంచయాలు ఎందుకు పనికివస్తవి? సహస్రాబ్దాలుగా భూగర్భంలో దాచి వుంచడమేనా దీని వుపయోగం? మనం వీటిలో ఒక పెట్టెను తీసికెళ్ళాలి. ఆనాడు మనం ప్రపంచంలోకల్లా ధనాఢ్యులమవుతాం.

ఇంతలోనే మా నావ రేవు జేరుకొన్నది. మా సంభాషణ మధ్యలోనే తెగిపోయింది. మా కెదురుగా 'రా' మందిరం వున్నది. దాని నలువైపులా యిప్పటికీ నౌహరీ సైనికుల అలికిడి విన్పిస్తూనే వుంది.

మేము మెదలకుండా నది ఒడ్డుకు చేరాము. తూర్పు దిక్కున వుషాదేవి ప్రధమరేఖ దర్శనమిచ్చింది. చంద్రుడు అస్తమించాడు. నక్షత్రాలు మిణుకుమిణుకు మంటున్నవి. నీలాకాశంలో కెంజాయలు విస్తరిల్లుతున్నవి. మితనీనగర బురుజులు, శిఖరాలూ, కప్పులూ అక్కడక్కడా కుడ్యాలూ కొంచెం కొంచెంగా కన్పిస్తున్నవి.

బక్నీ తన సైనికులను మూడు వరుసలుగా నిలబెట్టాడు. నేను నా మిత్రులతో పాటు ప్రధమపంక్తి మధ్యభాగంలో నిలబడ్డాను. ముందుకు పోవడానికి ఆజ్ఞాపించగానే నా ప్రాణాలు ఎగిరిపోతున్నాయనడం నిజం.

నా భావాలకూ, ధనదాసు వుద్దేశాలకూ చాలా తేడా వుంది. అప్పుడు నావద్ద సెరాఫిస్ ఖజానాలోని 1000వ భాగం వుండి, నన్ను యెవరైనా అక్కడినుండి భారతదేశం చేరవేస్తామంటే ఎంతో సంతోషంగా ఆ సంపత్తి నతనికి యిచ్చివేసే

వాడిని. ఒక యెండుగడ్డి పోచ నదీప్రవాహ గర్భంలో పడి పోయినట్లుగా నేనీ విషయంలోకి మెల్లమెల్లగా లాక్కుపో బడ్డాను. నేనిప్పుడు చాంగ్ - ధీరేంద్రుల మధ్య వున్నాను. వుషాదేవి కెంపురేఖల్లో మెరుస్తూన్న కవచాలతోనూ, దీర్ఘమైన గడ్డాలుగల యువకులను నేనా పంక్తిలో నిలబడి చూశాను. ప్రక్కగా వెళ్ళి మందిరంమీద దెబ్బ గొట్టాలని బక్షీ వుద్దేశం. అదని సైనికు లెంత ఆతురతగా వున్నారో మేము చూస్తూనే వున్నాము. వారి భయంకర నేత్రాలు, కత్తులనూ, బల్లెములనూ హస్తాలలో దృఢంగా పట్టుకొన్న సైనం, నిరాడుగావున్న కంఠాలు నాకు యుద్ధ పాటేళ్ళను స్ఫురణకు తెస్తున్నవి. నేనప్పుడు పురుషుల మధ్య వృద్ధ స్త్రీగానో, లేక వీరులలో పిరికిపందగానో వున్నాను. నే నిదంతా బాగా అర్థం చేసుకొంటున్నాను. కాని నాలో వున్న స్వల్ప సాహసంతో ప్రాణా లర్పించాల్సి వచ్చినా దీన్ని బాగా పరిశీలించి చూడాలని నిశ్చయించుకొన్నాను.

అప్పుడొక ధ్వని వినిపించింది. ఎవరో పిస్తోలు ప్రేల్చినట్లుగా వుంది; కాని యీ ధ్వని బక్షీది. అతడు తన సైనికులను గందరగోళం చేయమని ఆజ్ఞాపించాడు. సముద్ర తరంగం లాగా మే మొక్కసారిగా ముందుకెళ్ళి కొద్ది సేపట్లోనే మందిర ప్రాంగణానికి చేరుకొన్నాము.



# 21 'రా' మందిర సంగ్రామం

నోహారీ, సైనికులంతా ఒక్క సారిగా కలత జెందారు. వారు సుప్తావస్థలో మైమరచి వున్నారు. వారంతా తమ-తమ ఆయుధాలను తీసుకోకముందే బక్నీ సైనికులు వాళ్ళపై విరుచుకు పడ్డారు. అక్కడ సైనిక నియమాలను పాటించే అవకాశమేది ?

ఇక నా విషయంలో అడిగే పనేలేదు. ముందుకు వెళ్లే సాహసం నాలో లేనేలేదు. వెనకవున్న గుంపులో బడి సంకులంగా వున్న స్థలంలోకి నెట్టివేయ బడ్డాను. యుద్ధ ప్రారంభ దశలోనే నా తొడ మీాద గాయం తగిలింది. ఆరంభంలోనే అపశకునంగా మార్జాల మెదురైనట్లయింది. నే నీ వంకతో జారుకొని బయటికి వచ్చాను.

ఒక సురక్షిత స్థానంలో, ఒకపెద్ద ఆడసింహం విగ్రహం జూశాను. ఆ విగ్రహం ముందు కాళ్ళమధ్య కూర్చొని నేను నా గాయాన్ని కడుగుకొన్నాను. మందిరంనుండి వినబడుతున్న కోలాహలం వర్ణించ వీలులేకుండా వుంది. ఆయుధాల ఖణ ఖణలూ, జయకారాల గర్జనలూ, క్షతగాత్రుల చీత్కారాలూ, తమ విరోధులను పారద్రోలడానికి చక్రవర్తి సైనికులు జేసే విజయ ధ్వానాలు.

ఇంత జరిగినతర్వాత సూర్యుడు ప్రాచ్యదిశ నలంకరించాడు ఈ యుద్ధకాలంలో పగలూ, వెలుగు — చీకటీ, వుషస్సు మొదలగు నవేవీ వుండవు. దినకరుడు పర్వతాల

చాటునుండి బయటబడి మితనీ నగరమున్న ఆ విశాల మైదానంలో ప్రకాశించాడు.

నేను నా మిత్రులవద్దకు వెళ్దామని నిలబడ్డాను. కాని వారు యుద్ధం చేస్తూ చేస్తూ ముందుకు జరిగిపోయారు. రక్త స్రావంవల్ల నా కాళ్ళు నడచే శక్తినిగూడా పోగొట్టుకొన్నవి. నాల్గువైపులా చూశాను. ఆ ఆడసింహం పైభాగంవరకూ వున్న మెట్లను చూశాను. యుద్ధం యెలా జరుగుతుందో చూడాలని వుబలాట పడ్డాను. నేనా మెట్లగుండా యెంతో మెల్లగా, చాల కష్టంగా ఆ సింహంమీదకు వెళ్ళాను. అక్కడ మెదలకుండా కూర్చొని యుద్ధక్షేత్రంలోని తమాషా జూడసాగాను.

కలతజెంది, క్రమశిక్షణను యిప్పటికీ అదుపులో వుంచుకో లేకపోయిన శత్రుసైనికులు ప్రతి అంగుళంలోనూ వధించబడుతున్నారు. స్వయంగా సేనానిగూడా స్వర్ణకవచం ధరించి తన సైన్యం మధ్యవుండి పోరాడుతున్నాడు. నా ముగ్గురు మిత్రులూ యీ హత్యాకాండ మధ్యలో వున్నారు. వారు ముగ్గురూ తమ పిస్తోళ్ళను జాగ్రత్తగా గురిజూచి ప్రేలు స్తున్నారు. ఈ ఆగ్నేయాస్త్ర ప్రయోగం ఈ దేశంలో ఒక్క ప్సారోకు తప్ప యింకెవ్వరికీ తెలియదు. ధీరేంద్ర ధన దాసుల ద్వారా అతి జాగ్రత్తగానూ, తెలివిగానూ ప్రయో గింపబడుతున్న యీ పిస్తోళ్ళను సెరాఫీయులందరూ యే దివ్యాస్త్రాలుగానో, ఇంద్రజాలంగానో, మంత్రతంత్రాలనో అనుకొంటున్నారు.

తమ పూర్వజులు పూజించిన దేవతలతో పోరాడడం నోహారీ సైనికులపై ఎంతో చెడ్డ ప్రభావాన్ని ప్రసరింప జేసింది. ధనదాసు దీర్ఘకాయం ఘోరంగా యుద్ధం జరుగుతున్న చోటల్లా దర్శన మిస్తున్నది. థాత్ చేష్టలలో చాంగ్ మహాశయుని ప్రశాంతమైన ఆలోచన ప్రతిబింబిస్తున్నది. ఆయన వుండి-వుండి కాలుస్తున్నాడు. ఆయన కాల్పు గురి తప్పడం లేదు. పిస్తోలు శబ్దంతో పాటు సైనికుడు నేలకొరుగుతున్నాడు. ధీరేంద్రుడు నిజంగా ప్రత్యక్ష మృత్యువేమో ననిపిస్తున్నాడు. క్షణానికోచోట కన్పిస్తున్నాడు. చూచిన చోటల్లా ప్రత్యక్షమౌతున్నాడు. యుద్ధం బాగా జరుగుతున్న చోటనే ధీరేంద్రుడు కాల్పులు సాగిస్తున్నాడు.

అంత్య సమయంలో నోహారీకి సహాయం అంది వుండక పోతే విజయలక్ష్మి యెవరిని వరించి వుండేదో నిశ్చయించడం తేలిక సంగతే. నదికి దిగువ, మందిరానికొక మైలు దూరాన ఒక పెద్ద సైనిక గుడార ముండడం నేను గమనించలేక పోయాను. ఆ డేరాలో కొన్ని వందల సైనికులు పానో అధీనంలో వుంచబడ్డారని తర్వాత తెలిసింది.

పానో మొదటి రకం ధూర్తుడని మీకు తెలుసు. అతడు తన దేశ వాసుల్లాగా కూపస్థమండూకం కాదని గూడా గుర్తించుకోవాలి. అతడెన్నో దేశాల నతిక్రమించాడు; సముద్రాలను పరిక్రమించాడు; ఎన్నో దేశాల వాయువులుపీల్చాడు. అతని సైనికులు, దేశవాసులు యెలా భావించినప్పటికీ, మితనీ నగరంలోని యీ దేవతలు 'వేషధారులని' అతనికి బాగా తెలుసు. అతని మనస్సులో ముగ్గురు దేవతలూ

క్రమంగా హోరస్, థాత్, అనుబిస్‌లూ ధనదాసు కెప్టెన్, నేనూ అని నిశ్చయించుకున్నాడు. పాపం చాంగ్‌ను ఎరుగనే ఎరుగడు.

మందిరం మీద దండయాత్ర జరిగిందని వినగానే అతడు తన సైనికుల సందర్శి సంఘటిత పర్చాడు. అతడు వాళ్ళకొక చిన్న ఉపన్యాస మిచ్చాడని నాకు తర్వాత తెలిసింది. "మీరేమాత్రం భయపడనవసరం లేదనీ, ముగ్గురు దేవతలూ కేవలం వేషధారులనీ, వారి ఆయుధాలను సామాన్య మానవులే నిర్మించారనీ, దివ్యశక్తి వాటిలో యే మాత్రం లేదనీ అతడా సైనికుల మనస్సుల్లో చిత్రించడానికి ప్రయత్నించాడు.

ఇప్పు డతడు తన సైన్యాన్ని తీసుకొని సేనాని సహాయార్థం మందిరం వైపుకు బయలుదేరాడు. అతని బుద్ధి చాల సూక్ష్మమైనది. అతని కెన్నో యెత్తులు తెలుసు. అతడు తన సేనను రెండు భాగాలుగా జేశాడు. ఇప్పు డిప్పుడే పారిపోవడానికి తయారౌతున్న సేనాని సహాయానికి కొద్ది భాగాన్ని పంపాడు. ఇక రెండవ భాగాన్ని తీసుకొని బక్నీ సేనకు వెనుక వైపుగా ముట్టడించడాని కుపక్రమించాడు.

నే నీ మోసాన్ని కళ్లారా జూశాను. ఇది మాకు పెద్ద ఆపదని తెలుసుకొన్నాను. నేను వేగంగా మెట్లు దిగి నా మిత్రులను హెచ్చరించడానికి పరుగెత్తాను. శరీరం మానవ స్వాధీనం. ఆ భయంకర స్థితిలో నా గాయాన్ని, బాధను మరచిపోయాను. కొద్ది క్షణాల క్రితం నాలో కదలడానికి

గూడా శక్తి లేదనిపించింది. కాని యిప్పుడు ఆపద ముంచు కొస్తున్నప్పుడు నేను నడవడమేగాక, పరుగెత్తాను గూడా.

ఆ సమయంలో యుద్ధం గర్భ మందిరంలో జరుగు తోంది. నోహారీ, అతని సైనికులు సమాధి వైపుగా వీపు లుంచి పోరాడుతున్నారు. ఇప్పుడు ప్సారో తన సైన్యంతో ఈ ద్వారం వద్దకు వస్తే బక్నీ తిరిగి వెళ్ళడానికి దారి వుండక పోవడమేగాక అందరూ అక్కడే హతం గావడమో, లేక బంధించబడడమో జరిగేది.

నేను ధీరేంద్రుణ్ణి యుద్ధ మధ్యభాగంలో జూశాను. నేను పెద్దగా కేకవేసి ఆయనతో చెప్పాను "బక్నీకి చెప్పు" అంటూ ఆయన చాంగ్ వైపుకు తిరిగాడు.

ఎంతో కష్టంతో ఆ గుంపులోగుండా నేను నా కెప్టెన్ (బక్నీ) వద్దకు వెళ్ళగలిగాను. నే నతన్ని రాబోవు ఆపదను గూర్చి హెచ్చరించాను.

అతడు వెంటనే వెనుకంజ వేయమని సైనికుల నాజ్ఞా పించాడు. సరిగ్గా ప్సారో తన సైనికులతో బయటి ప్రాంగణం వరకు వచ్చాడు. నే నా సమయంలో క్షణిక మాత్రపు టాలస్యం చేసి వున్నా మేమందరం అక్కడే వధింపబడి వుండే వాళ్లం. సెరిసిస్ పతనం గూడా తథ్యమయ్యేది.

ప్సారోతో ప్రాంగణంలో జరిగిన యుద్ధాన్ని గూర్చి నేను వర్ణించబోవడం లేదు. దూరంగా వుండి తమాషా చూడడం మంచిదే గాని, మనిషి యుద్ధ మధ్యంలో బడ్డప్పుడు ఆతని స్థితిని గూర్చి యిక అడిగే పనేలేదు. ప్రథమంలో నేను దూరాన వుండి అంతా చూస్తున్నాను. అప్పుడు బుద్ధికి చూసే

తీరిక వున్నది. కాని నలువైపులా శత్రువులు ముట్టడించిన యీ తరుణంలో యింకా చూడడమేమిటి? నేను నా గొంతు పగిలేట్లు అరుస్తూ నా రివాల్వరును ప్రయోగిస్తున్నానని నాకు జ్ఞాపకం. నేను పిచ్చివానిలాగా ఒక చోటునుండి మరో చోటుకు పరుగెత్తుతున్నాను. ఆ సమయంలో నేను క్రూర జంతువుల్లాగా ప్రాణాలు దీయాలను కోవడమేగాక అందు కోసం ఆతుర జెందుతున్నాను గూడా. ఒక్క క్షణం తర్వాత నేనొక పసిబిడ్డలాగా మొహాన్ని చేతులతో కప్పుకొని యేడ్వాలను కొన్నాను. నేనా యుద్ధంలో జూచింది ఒకేఒక వస్తువు. అది హద్దు మీరిన మానవ హృదయ క్రౌర్యం.

ఎలాగో ధనదాసు అంగరక్షకుల నుండి చీలిపోయాడు. అత డందరికంటే వెనకనే మందిరం నుండి వచ్చేవాడు. అసంఖ్యాకములైన బంగారు రాసులున్న ఆ చోటునుండి తనకు తానై తేలికగా రావడం అతని కెంతో కష్టంగా వుంటుందని నేను భావించాను. నలందా విద్యాలయంలోని నా గృహానికి వచ్చిన నాటినుండీ అంతిమ సమయం వరకూ —మితనీహర్పి రాజ ప్రాసాదంలో అతని మృత్యు ఘడియ లాసన్నమైన వరకు — ఆ వ్యక్తి మనస్సులో కేవలం ఒకే ఒక ఆలోచన వుంది. అతని చేష్టలకు మూలంలో కేవలం ఒకేఒక వుద్దేశ్యం వున్నది — సెరాఫిస్ సమాధిలోని రత్నరాసు లన్నిటికీ సర్వాధికారి కావడమే అతని ఏకైక కోరిక.

ప్రాంగణంలో ప్సారో తన సైనికులతో ప్రవేశించి నప్పుడు సర్వ ప్రథమంగా ధనదాసు అతని సమక్షానికి

వచ్చాడు. అతని సైనికుబలో అధిక భాగం ధనదాసును నైలు నదీ దేవత హోరస్ అనుకొన్నది.

మేము యిక్కడనుంచి వైదొలగాలన్నది స్పష్టమై పోయింది. మేము శత్రువుల కెక్కువ హాని చేకూర్చినప్పటికీ మా సైన్యానికి చాల తక్కువ హాని కల్గినప్పటికీ ఇప్పటికీ శత్రువుల సంఖ్య మా కంటే అధికంగానే వున్నది. వైదొలడమే మాకు లాభకరం.

మేము జయించలేమని ధనదాసు యిప్పుడు వూహించి వుండవచ్చు. ప్సారోతో అతడేదో మాట్లాడటం నేను జూశాను. నేను పూర్తిగా ఆ మాటలు వినలేక పోయినప్పటికీ కొన్ని సంవత్సరాలుగా భారత దేశంలో వుండి ప్సారో హిందీ నేర్చుకున్నాడని నేను నిశ్చయించుకొన్నాను. ధనదాసుతో మాట్లాడి అతడతనికి ధనాశ జూపించాడని, నిశ్చయంగా తెలుస్తూంది. బహుశా 'కమల్' మీాద వున్న సమయంలో అతడు ధనదాసు స్వభావాన్ని చక్కగా అర్థం జేసుకొని వుంటాడు. కాకపోతే మనుష్యులను గుర్తించడంలో అతడు నాకంటే అధిక ప్రతిభా సపన్నుడై వుంటాడు.

వారి సంభాషణాంశాన్ని నేను వినలేక పోయినా వూహించడమేమంత కష్టమైన పనిగాదు. "నాకు మీా వేషాలు, మీా వాస్తవ స్థితి పూర్తిగా తెలుసు" అని ధనదాసుతో ప్సారో అనివుంటాడు. ఆధునిక కలకత్తా, బొంబాయిలను జూచి అత్యంత నిశిత దృష్టిగల బీహారు గుప్తచరుల నేత్రాల్లో దుమ్ము గొట్టగలిగిన వానిముంపు, కొయ్యముక్క, చర్మంతో చేయబడ్డ ముఖాలూ దాగడం అసంభవం. తన

మిత్రులపట్ల కృతఘ్నుడై, నొహారీతో మనస్ఫూర్తిగా సహాక రిస్తే, ధనదాసును ప్రాణాలతో వదలడమేగాక సెరాఫిస్ సమాధి సంపత్తిలో భాగంగూడా పెడతామని ప్సారో ప్రతిజ్ఞ చేశాడని నేను చెప్పగలను. తన మిత్రులకు వేరే అవకాశం లేదని ధనదాసు అనుకొన్నాడు. ఈ విషయం ప్సారో పరతును వెంటనే వప్పుకోవడానికి ప్రోత్సహించింది. నేనతని విషయంలో సదభిప్రాయమే కలిగి వుండేవాణ్ణేగాని యీ ఆధారాలు అలా జరుగనివ్వలేదు. తర్వాత జరిగిన సంఘటనలు గూడా దీన్ని బలపర్చినవి.

బక్షీ వెనుకంజ వేయమని ఆజ్ఞాపించగానే సైనికు లంతా ఎంతో చాకచక్యంతో వెనకడుగు వేశారు. నొహారీ మా దక్షిణ సేనాభాగంమీద దెబ్బ తీయాలని చూశాడు. కాని చాంగ్ - ధీరేంద్రుల రిసాల్దార్లు అతన్ని వెనక్కు నెట్టి వేసినవి. రెండో సైన్యభాగం నది ఒడ్డుకు చేరుకుంది. కాని శత్రువు లక్కడ నావలు లేకుండా జేశారు. అయినా అందు వల్ల నష్టమేమీ జరుగలేదు; ఎందుకంటే అక్కడ నావ లున్నా ఆ స్థితిలో ఎక్కిపోవడం కష్టం. నది కుక్షివైపుగా నగరాన్ని చేరుకోవడంకంటే మాకు వేరే మార్గంలేదు.

యుద్ధ రంగంనుండి తిరిగి వస్తూన్నప్పుడు సైన్య భాగా లను రక్షించుకోవడం కష్టమూ, అవసరంగూడా. ధనదాసు మందిరంలోనే దిగబడి పోయాడని చాంగ్ - ధీరేంద్రులు గమనించలేదు. ఇప్పుడు మేమంతా నదిదానికి చాల దూరంగా ఒక సురక్షిత స్థానానికి చేరుకొన్నాం నొహారీ

వెంటాడడంగూడా విరమించాడు. ఇదే సమయంలో ధీరేం ద్రుడు నావద్దకు వచ్చాడు.

ధీరేం:- ధనదాసు యేమయ్యాడు? గాయపడ్డాడా?

నేను:- అతడు విశ్వాస ఘాతకుడు.

ధీరేం:- విశ్వాస ఘాతకుడా!

నేను:- అతడు ప్సారోతో యేదో మాట్లాడాడు. ప్సారో హిందీ మాట్లాడగలడని నాకు తెలుసు. అయ్యో ధనమా! ధనం తప్ప అతని దృష్టిలో మరేమీ లేదు.

ధీరేంద్రుడు మెల్లగా అన్నాడు – మీరనుకొన్న దాని కంటె భయంకర విషయం. ధనదాసుకు సమాధి రహస్యం తెలుసు.

నేను:- అబ్బో, పెద్దపనే చేస్తాడు! గోబరైలా లేక పోతే సర్వం వృథా.

ధీరేం:- అదిగూడా వున్నది.

అప్పుడు నేను శ్వాస పీల్చడంగూడా మర్చిపోయాను. నాఅంతరాత్మ కేదో పెద్ద దెబ్బ తగిలినట్లయింది. ప్రథమం లోనే నేనీ విపత్తునుగూర్చి దూర మాలోచించ లేకపోయాను. నేను అనుస్తూ అన్నాను – ధనదాసువద్ద బీజక్ వున్నదీ! నే నెన్నోసార్లు యీ వాక్యాన్ని వల్లించిన తర్వాతగాని దీని అర్థం నాకు తెలియలేదు. ధీరేంద్రుడు పొరబడ్డాడని నేను అనుకొన్నాను. కాని ధీరేంద్రుడు మళ్ళీ ఈ మాట చెప్పి నప్పుడు పొరపాటనుకొన్న భావం సమూలంగా పోయింది—

"రా మందిరానికి వెళ్లేప్పుడు ధనదాసు నాతో సాహ రీని జయిస్తే ఖజానాను వశపరచుకోవచ్చన్నాడు. అంతేగాక

దాన్ని రాజ ప్రాసాదానికి - సురక్షిత ప్రాంతం - చేర్చడానికి తగిన అవకాశం దొరుకుతుందని గూడా నాతో అన్నాడు. అతడీ విధంగా చేయడానికే బీజక్‌ను తనవెంట తెచ్చుకొన్నాడనడానికి ప్రమాణం.

ఇక నాకు వినే శక్తిగూడా లేదు. నా హృదయ పరిస్థితి ఆ సమయంలో వర్ణించడా[నికి] వీలులేకుండా వుంది. నేను వుద్వేగంతో అరచాను — ఓరి నరపిశాచమా ! అరి విశ్వాస ఘాతకుడా ! ! వాడు వున్మాదుడు. స్వర్ణంతప్ప వాడికేమీ అవసరం లేదు. అరెరే, ప్రథమంలో దీన్నిగూర్చి నేనెందు కాలోచించలేదు ? మొదట్లోనే వాడి యీ భావాన్ని తెలుసుకొన్నాను. కాని విచారకరం ! బంగారం లోభంతో వాడు యింతదూరం వస్తాడని నేను అనుకోలేదు. ఇప్పుడు వాడా ధనాగారంలో జొరబడతాడు. వాడు, నొహార్రీ, ప్సారో - ధనాన్నంతా పంచుకొంటారు. ఇంతేగాక యీ దేశ ప్రజలను గూడా కొనగల్గుతారు. ఈ విధంగా దేశమంతా ఆ అమాయిక రాణికి విరుద్ధంగా నిలబడుతుంది.

ధీరేం:- ఇక యీ మూర్ఖుల అంధవిశ్వాసాల ఆధారంతో అధికకాలం నాటకమాడలేదు. మనం దేవతలమన్న విశ్వాసం వున్నవాళ్ళు యిప్పుడు థాత్ - అనుబిస్‌లకు వ్యతిరేకం పోరాడగల్గుతారు; ఎందుకంటే హోరస్ వాళ్ళ పక్షాన వున్నాడు.

ఆ మానవుని పైశాచిక కృత్యాన్నిగూర్చి యింకా చెప్పలేను. నేను భయాతురుడ నయ్యాను. ఏదో నా కంఠంలో కంటకంలాగా బాధిస్తోంది. ధీరేంద్ర - చాంగ్‌లు

లేకుండా ఆ నృశంసుడుతో వచ్చివుంటే అప్పుడుగూడా వీడే నామీద విరుచుకుపడేవాడు. అప్పటి నా స్థితిని తలుచుకొంటే నా హృదయం ప్రక్కలైపోతూంది. కాని మరుక్షణంలోనే మాట్ల అనేక రోజులుగా యెంతో ప్రేమను ప్రదర్శిస్తోన్న సౌందర్య, సహృదయురాలైన ఆ అల్ప వయస్క రాణివైపు నా దృష్టి మళ్ళింది.

మిట్టమధ్యాహ్నపు ఎండలో ఆ మట్టి రోడ్డుమీదుగా బారులుదీరి రాజప్రాసాదం చేరుకొన్నాం. బక్నీ తన సైనికులను వెళ్ళిపొమ్మని చెప్పగానే దీర్ఘగడ్డాలుగల ఆసైనికులు విశ్రమించడానికి వారి వారి గదుల్లోకి వెళ్ళారు. వారు చింతాక్రాంతులై యుండడం నేను చూశాను. వారి బంధు- మిత్రులెందరో యుద్ధంలో నిహతులయ్యారు. కాని వారు పరాజితులు కాలేదు. వారి వుత్సాహం పెరిగిపోయింది బక్నీ ఆదేశానుసారం రాణికోసం వారిలో ప్రతి ఒక్కడు ప్రాణాలర్పించడానికి సంసిద్ధంగా వున్నారు.

సోపానాలవద్దే నాకు ప్రధాన పురోహితుడు అహ్మోసో కన్పించాడు. "అంతా కుశలంగా గడిచిందా?" అని ఆయన అన్నాడు.

నేను:- మాయెడ కృతఘ్నత జరిగింది.

అహ్మో:- కృతఘ్నతా! ఎవరివలన ?

ఇప్పుడు వాస్తవాన్ని మరుగుపరచడం కష్టం. నేను చెప్పాను — "హోరెంస్‌వల్ల." ఆయన యీమాట వినగానే భీతి జెందుతాడేమోనని అనుకున్నాను. దీనికి బదులు ఆయన చిరునవ్వును చూశాను.

అహ్మ:- థోథ్‌మస్, మీ అభిప్రాయం మీరు మా ముందు ఓసరిస్ - ఇసిస్ పుత్రునిగా ప్రదర్శించిన వ్యక్తిని గురించేనా ?

"తమ కెలా తెలిసింది" అని నేను సాశ్చర్యంగా అడిగాను.

అహ్మ:- గతరాత్రి మీరొక అజ్ఞాత భాషలో యేదో అంటూండడం మరచారా ? అదే నా హృదయంలో అనుమానం కల్గించింది. థాత్ తన స్నేహితునితో మాట్లాడుతున్నప్పుడు ఇసిస్ మందిర ద్వారంవద్ద వుండి చెవిబెట్టి విన్నాను.

నేను:- మేము మోసగాళ్లమని మీకు తెలిసిపోయింది గదా !

అహ్మ:- మీరు మహారాణి హితచింతకులని గూడా తెలుసుకొన్నాను. మా కన్నిటికంటే ప్రధానమైదీ విషయమే.

నేను వృద్ధుని హృదయం జూచి ముగ్ధుణ్ణయ్యాను. వెంటనే ఆయన భుజంమీద చేయివేసి అన్నాను - "మీరు మా మిత్రులు."

అహ్మ:- మహారాణి కోసం స్వార్థ త్యాగం జేయడానికి సిద్ధపడే వారంతా మా మిత్రులే. పోదాం పద; ఆమెకు అసలు విషయం చెబుదాం. ఇక భయపడే అవసరమేమీ లేదు. మీ మిత్రులు దేవతలు గానీ, మానవులుగానీ దేశంకోసం పోరాడుతున్నారు. మన కర్తవ్యం స్పష్టంగానే

వుంది — యీ విప్లవాన్ని, విద్రోహాన్ని అణచి వేయడమో లేక మానవులవలె ప్రాణా లర్పించడమో.

నేను :- అహ్మాసో, నీవు - నేనూ యిద్దరం వృద్ధులమే మనకెలాగూ మృత్యువు సమీపించింది. అందుకు మనమేమీ భయపడే అవసరం లేదు. పద, లోగడ మీరు థాత్, అనుబిస్ అనుకొంటున్న ఆ నా మిత్రులతో సహా రాణి వద్దకు వెళదాం. మీరు ప్రస్తుతం అనుకొంటున్నట్లు వారు మనుష్యులే అయినా చాల బుద్ధి సూక్ష్మత, అనుభవం గలవారు.

## 22 చాంగ్ అద్భుత సాహసం

అహ్మాసో మాంచి చతురుడు. బాల్యంనుండి అతడు రాణికి మార్గ దర్శకుడు, రక్షకుడుగానూ వున్న సహృదయుడు. ఆమె ఈయన వద్దనే పరిపాలనా విధానాన్ని నేర్చుకొన్నది. ఈతడే ఆమెకు ప్రాచీన మిశ్రదేశపు ఆచార వ్యవహారాలను నేర్పాడు. తన శాసన కాలమంతటిలో ఒక పర్యాయం గూడా బుద్ధిమంతుడూ, హితైషీ అయిన తన యీ మంత్రి అభిప్రాయాన్ని ఆమె తృణీకరించలేదు.

సెరిసిస్ రాణికి నా మిత్రులమీద యెంతో విశ్వాసమున్నది. ప్రాచీన మిశ్రదేశపు దేవతలైన హోరస్, థాత్, అనుబిస్‌ల సభ్యతా చిహ్నాలే నైలు ప్రాంతమందున్న యెడారిలో యిప్పటికీ యెంతో దూరం వ్యాపించి వున్నవని ఆమెకు తెలుసు. శక్తివంతులైన నైలు దేవతలు మరో

పర్యాయం పృథివిపైకి దిగివచ్చారు. ఈ నమ్మకం అను కొన్నంత మూర్ఖత్వంగానూ, గుడ్డిగానూ లేదు. ప్రాచీన మిశ్ర దేవతలలో యెన్నో మానవ గుణాలున్నవి. ఫరోవా సామ్రాట్టు గూడా దేవతగా పరిగణింప బడేవాడు. ప్రాచీన రోమ్, యవన, భారత దేశాల్లోవలెనే మిశ్ర దేశంలోగూడా మానవులు వీరులుగానూ, వీరులు దేవతలుగానూ పరిగణింప బడుతారు. ఈ విధంగా నరులలోనూ, అమరులలోనూ పెద్దగా భేదం వుండేదిగాదు.

మా కృత్రిమ వేషాలు నగరంలో ప్రవేశించిన నాడే మహారాణీతో సహా వేలకొలది సామాన్య వ్యక్తులముందు చక్కగా సాఫల్యం జెందాయి. థేబీయ రాజుల కాలంనుండి దేవతా పూజలతోనూ, మందిరాలతోనూ నిండి వున్న సెరాఫీయ దేశానికి హోరస్, థాత్, అనుబిస్‌లు అవతరించి రావడం మహారాణి కేమీ అసంభవంగా తోచలేదు.

ఇప్పుడు సరిగ్గా గోబరైలా భవిష్యద్వాణి నిజమైంది గూడా—"రక్షకులు వధించ బడ్డప్పుడు స్వర్గపు నలుమూలల నుండి దేవతలు దిగివస్తారు."

ఈ వార్త వినగానే ఆమె యెలా అర్థం చేసుకొం టుందో నేను వూహించలేకపోయాను. ఎవ్వరూ తమను మూర్ఖులుగా జేయడం చూసి సహించలేరు. అందువల్లనే ఆమె మామీద మండిపడుతుందేమోనని అనుకొన్నాను. మొదటినుండీ చెబుతున్నట్లుగా మోసాన్ని యెప్పుడూ నేను ద్వేషిస్తాను. కాని ఇక్కడ గత్యంతరం లేక అలా చేయాల్సి వచ్చింది.

అహ్మోసో చాకచక్యంగా ఆమెకు యీ విషయా న్నంతా చెప్పి వినిపించాడు. వీరు చాల దూరదేశాన్నుండి వచ్చినవారనీ, యీ దేశానికి వద్దామని తమ రక్షణార్థమై వారీ యేర్పాటు చేసుకొన్నారని ఆయన మహారాణికి విన్న వించాడు. ఆయన యింకా మాతరఫున మహారాణిని క్షమించ మనీ, పైగా ఆపదసమయంలో తమను మహారాణికి నిజమైన స్నేహితులుగా నిరూపించుకొన్నారని గూడా చెప్పాడు.

నే నామె వుదారగుణాన్ని విస్మరించలేను. రాణి యేమాత్రం అప్రసన్నతను ప్రకటించకుండా నన్ను పిలిపించి అన్నది — "ఏం థోథ్మస్, నీవుగూడా యింకెవరి వన్నానా!"

నేను:— ఓ మహారాణీ, నీవు చూస్తూనే వున్నావు నా గూపాన్ని. వయస్సు చెల్లిన నేను యోధుణ్ణిగాను. విద్యా వ్యసనుణ్ణి మాత్రమే. కాని నేనిక్కడ యెవ్వరికీ హాని చేద్దా మన్న తలంపుతో రాలేదని మాత్రం స్పష్టంగా చెబు తున్నాను. విశేషించి, సౌందర్యంతో పాటు శుభ గుణవతి యైన మహారాణిని గురించి అట్టి తలంపే లేదు.

మహా:— బహుశా నీలో విద్యావ్యసనంకంటే విదూష కత్వమే ఎక్కువ. కాని నీవు మా యీ భాష నెలా నేర్చు కొన్నావో చెప్పు.

నేను సమాధానం చెప్పాను — నేనుంటున్న దేశంలో ప్రాచీన సభ్యతను గూర్చిన అధ్యయనంలో తమ జీవితా న్నంతా వ్యయంజేసే పురుషులెందరో వున్నారు. ఇలాగే నేనుగూడా మితనీనగర వాసులతో మాట్లాడే యోగ్యుడ నయ్యాను; ప్రాచీన మిశ్రధర్మాలనూ, రాజనీతినీ, వేషభాష

లనూ తెలుసుకోగలిగాను. చిత్రలిపినిగూడా చదువగలుగుతాను.

నేను మహారాణితో మళ్లీ చెప్పాను – "హోరస్ రూపధారి మా అందరిపట్ల కృతఘ్నుడుగా వ్యవహరించి విరోధులలో కలసిపొయ్యాడు." ధనాగారాన్ని ప్రవేశించే మార్గ మతనికి తెలుసుననీ, యిప్పుడు దానికి యజమాని నోహారీయనీ నేను చెప్పినప్పుడు రాణి – అహ్మాసో యిద్దరిలో యెవరూ తమ మానసిక భావాలను దాచుకోలేకపోయారు.

ప్రధాన పురోహితుడు గుండెలు బాదుకుంటూ అన్నాడు — అయ్యో! అయ్యో!! మన పనంతా మట్టిలో కలసిపోయింది. నా వద్ద అనేకమంది గుప్తచరు లున్నారు; వారి ద్వారా రాజ ప్రాసాదపు నాల్గు గోడల కావల యేమి జరుగుతున్నదో తెలుసుకో గలుగుతాను. ఇప్పటివరకూ ప్రజలు యీ తగాదాలో యేపక్షాన చేరగూడదని నిశ్చయించుకొన్నారు. వారికి నోహారీ రణకౌశల్యాన్ని గూర్చిన భయం లేకపోతే వాళ్లు బహిరంగంగానే మహారాణి పక్షం స్వీకరిస్తారు. కాని వారు సేనాని అంటే భయపడుతున్నారు. అతనివద్ద యెంతో బంగార మున్నదని వాళ్ళకు తెలుసు. సైన్యంలో అధికభాగం మనకు వ్యతిరేకం. సాధారణ ప్రజలు. సేవకులు గూడా విద్రోహులకు సాయపడితే వారిని పారద్రోలడం అంగరక్షకుల శక్తికి మించిన పని.

రాణి సన్నని అధరాలు కంపించుతూండడం నేను చూశాను. కాని ఆమె వీరోచితంగా యిలా అన్నది—బక్నిని పిలిపించండి. ఇప్పుడు నా వద్ద ఒకవైపు యిద్దరు చతుర పురు

షులున్నారు. రెండవ వైపున ఒక పీఠం. నే నింకెందుకు భయపడాలి? రాజ సింహాసనం నా హక్కు. ఫరోవాల రక్తం నాలో ప్రవహిస్తోంది.

నేను నా స్నేహితు లిద్దరినీ తీసుక రావడానికి అనుమతి కోరాను; ఎందుకంటే ఆ యిద్దరు పురుషులు యుద్ధరంగంలో యెంతో లాభకరమైన వారో, కలహా యివ్వడంలోగూడా అంతే. సెరిసిస్ వాళ్ళను చూడాలన్న ఆతురతతో వున్నది. నేను ఇసిస్ మందిరానికి తిరిగి వెళ్ళే సరికి ధీరేంద్రుడు ఆసనం జమాయించి కూర్చొన్నాడు. ఆయన నక్క మొఖం ఆయన తొడలమీద వున్నది. నలువైపులా ధూమాన్ని వ్యాపింపజేస్తున్న బీడీ ఆయన నోట్లో వెలుగుతోంది.

నేను :- నీవు యీ అనర్థాన్ని దెచ్చే పొగ నొదిలి పెట్టవా ? నీవు నీరో లాగున్నావు. రోమ్ మండిపోతోంది. నీవు విలాసాలలో మునిగి వున్నావు.

ధీరేం :- అనుబిస్‌కు ధూపం వేయడానికి నా వద్ద యీ ఒక్క సాధనం మాత్రమే వున్నది.

నేను :- "ఈ తమాషానంతా కట్టిపెట్టు. ఇప్పుడు నీవు దేవతవూ గావు - దయ్యానివీ గావు. మహారాణికి వాస్తవం తెలిసిపోయింది." నేను యిద్దర్నీ త్వరగా సిద్ధంగుండని చెప్పాను. తర్వాత రెండు నిముషాల్లోనే రాణి ముందున్నాం.

తర్వాత జరిగిన సంభాషణలో నేను దుబాసీపని జేశాను. రాణి మాదేశాన్నీ, ఆగ్నేయాస్త్ర ప్రయోగాలను గూర్చిన అనేక విషయాలను అడిగి తెలుసుకుంది.

అన్నిటికంటే మించిన ఆశ్చర్యం ఆమెకు ధీరేంద్రుని అద్దాల పెట్టెను జూసినప్పుడు కల్గింది.

ఆరోజు యే విషయమూ నిర్ణయం గానప్పటికీ మా అసలురూపాలు బయటపడడం మంచిదైంది. మా హృదయం మీాదున్న పెద్ద బరువు దించబడింది. రాణీ, బక్షీలిద్దరూ మమ్మల్ని హితైషులుగా గుర్తించారు. కార్యక్రమాన్ని గూర్చి యే నిర్ణయం చేయాలన్నా కష్టంగా వుంది. మే మిప్పుడు బయటకు వెళ్ళి యేమీా చేయలేం. కాబట్టి రాజ ప్రాసాదంమీాద జరగబోయే ఆక్రమణకోసం నిరీక్షిస్తున్నాం.

ఆ రాత్రి నేను, చాంగ్ - ధీరేంద్రులతో అన్ని విషయాలను గూర్చి సంప్రదించాను. ధీరేంద్రు డెన్నో సలహాలిచ్చాడు. నేను నా జీవితంలో అలాంటి నిత్య చైతన్యుణ్ణి ఎక్కడా చూడలేదు. ఆయన శరీరమెంత ధృఢమైనదో, మస్తిష్కంగూడా అలాగే కార్యతత్పరత కలిగి వుండేది. కాని చాంగ్ ఆ రాత్రంతా నిశ్శబ్దంగా వున్నాడు; ఆసనం వేసి సమాధిస్థుడైనట్లుగా వున్నాడు. ఆయనేదో ఆలోచనలో నిమగ్నమై వున్నట్లు నేను తెలుసుకొన్నాను. ఆయన ఆలోచనా శక్తిలోని అద్భుత చమత్కారాలు నాకు పరిచయమై వుండడం వల్లనే నేనాయన్ను మాట్లాడించలేదు. మరునాటి ప్రభాత సమయంలో నేనూ - ధీరేంద్రుడూ కొన్ని గంటలు నిద్రించిన తర్వాత ఆయన మమ్మల్ని మేల్కొల్పాడు.

నేను:- ఏమిటి, సంగతి ?

చాంగ్ :- నాకో వుపాయం తోచింది. ఇదెంతో భయంకరమైనది; నేను కావాలనుకునేదానికంటే గూడా

భయంకరమైనది. అయినా దానిని మించిన మరే మార్గమూ నాకు కన్పించడంలేదు. నేను వెళ్ళిపోవాలి.

నేను:- వెళ్ళడమా ? ఎక్కడకు వెళ్ళడం ?

చాంగ్:- ఇది నేను మీకు తర్వాత చెప్తాను. ఇక సెలవు.

ఈ మాట అని ఆయన నిద్రబోయాడు. కొద్ది నిముషాల్లోనే ఆయన గురక మొదలుపెట్టాడు. నిజంగా ఆయన చాల విచిత్ర పురుషుడు.

ఇక నేను నిద్రించడం అసంభవం. అందువల్ల లేచి వుద్యానవనం వైపుకు వెళ్ళాను. అక్కడ పచారుచేస్తూ ప్రాచ్యదిశలో పర్వతశిఖరాలపై సూర్యభగవానుని యింద్రజాలం వ్యాపించడం జూశాను. నేను దేవీ-దేవుల నీరవ విగ్రహాల, స్త్రీ సింహాల మధ్యగానూ ఆ సమతల మార్గంలో తిరుగుతూన్న సమయంలో నా దృష్టి ఒక్కసారిగా నా యీ అద్భుత యాత్ర వైపుకు మళ్ళింది. నా శరీరం ఒక గ్రహం నుండి మరో గ్రహానికి పంపబడినట్లుంది. నేను ఆ సభ్యతనూ నా సభ్యతనూ పోల్చడం ప్రారంభించాను. ఇదంతా స్వప్నమని అనుకొన్నాను. ఈ స్వప్నం నన్ను అనేక వేల సంవత్సరాల కాలగర్భంలోకి తీసుకపోయింది. దాని మహోన్నత గౌరవం మనకు చాల తక్కువ తెలుసు. నా మెదడు రకరకాలైన ఆలోచనలతో నిండివున్నది. నా నలువైపులా అలభ్యమైన, అద్భుతమైన సుందరోద్యాన మున్నది. మేము తిరిగి యేనాటైనా జన్మభూమికి వెళ్ళగలమన్న విషయం ఆలోచించడం కష్టం.

ఈ విధంగా నేను తిరుగుతున్న సమయంలో ముఖ్య పురోహితుడు నా వైపుగా రావడం చూశాను. ఆయన నత సిరస్కుడై వున్నాడు. చూపులు నేలమీద ప్రసరిస్తున్నవి. "రాత్రి మీరు నిద్రించారా, లేదా?" అని అడిగాడు.

నేను :- అర్ధరాత్రంలో కొద్దిగా నిద్రించాను. అసలు నాకు నిద్రగూడా తక్కువగానే వస్తుంది.

అహ్మ :- నే నసలు నిద్రించనే లేదు. నగరంలో నా గుప్తచరులు తిరుగుతూంటారు. వారు యీ అంధకారంలో ప్రచ్ఛన్నంగా యీ మహాలుకు చేరుకుంటారని నేను మీతో చెప్పాను. మూడు గంటలనుండి ప్రతి నిముషం నాకు వార్తలు చేరుతూనే వున్నవి.

నేను :- ఏమిటా వార్తలు? శుభమా — అశుభమా?

అహ్మ :- శుభవార్త యేమీలేదు. మహాలంతా విద్రోహులతో ముట్టడించబడి వుంది. ఎంతో కష్టంగా నా అనుచరులు తప్పించుకొని లోపలకు రాగలిగారు. నగరంలో ప్రస్తుతం నొహరీ ప్సారోల అనుచరు లెందరో వున్నారు.

నేను :- నాగరికుల్లోనా?

అహ్మ :- అవును. నొహరీ ఖజానాను స్వాధీనం చేసుకొన్నాడని నగరంలోని బీద ప్రజల్లో బాగా వ్యాపించింది. సైన్యంలో జేరిన ప్రతి పౌరునికి అందులో భాగం పెడతానని నొహరీ ప్రమాణం జేశాడు. మూడు రోజుల్లోగా యీ బంగారాన్ని పంచిపెడతారు. అయితే, నొహరీ సమాధిలో ప్రవేశించగల్గుతాడా?

నేను :- ఇందులో యేమాత్రం సందేహం లేదు. మీరు హోరస్ అనుకొంటున్న వ్యక్తికి ఆ రహస్యం బాగా తెలుసు.

అహ్మా :- ఈ దేశంలో విశ్వాసం, దైవభక్తి శూన్యం సెరాఫిస్ ఖజానాను కొల్లగొడతారు. మితనీ నగరంలోని శక్తి ధనానికి అమ్ముడు బోతుంది. నోహారికి గూడా యీ విషయం బాగా తెలుసు.

ఆయన వెల్లగా, ఆ బాల ప్రభాకరుని కాంతిలో ముందుకు సాగాడు. ఆ వృద్ధుని వదనం మిక్కిలి వుదాసీనంగా వుంది. నాకెంతో ఆవేదన కలిగింది. ఆ వ్యక్తి ఎంతో సహృదయుడూ, రాణికి అత్యంత హితైషి.

నేను నా స్నేహితుల వద్దకు వెళ్ళినప్పుడు వారు మేల్కొని వుండడం చూశాను. నన్ను చూడగానే చెవుల దాకా నోరు చేసుకొని నవ్వసాగారు. "ఓ ప్రొఫెసర్ మహాశయా, ఇప్పుడు మీతోనే అవసరం. మీరు సర్వజ్ఞులు. బహుశా మీరు చెప్ప గలిగే వుంటారు.

నేను:- రెండవ గదిలో.

చాంగ్:- సర్వం ?

నేను.- అవును. సర్వం. తమకేం గావాలి ?

చాంగ్:- భానుమతి పిటారిమాత్రం.

నేను స్వయంగా రెండో గదికి వెళ్లి పెట్టె తెచ్చి యిచ్చాను. "ఇదెందుకు ? ఏమి చేయాలని ?" అన్నాను.

చాంగ్:- నేనో వుపాయ మాలోచించాను. అదేమిటో చెప్పకముందే మీవల్ల రెండు - మూడు విషయాలు తెలుసుకోవాలి. నొహరీ - ప్సారోలు సమాధిని ప్రవేశించ రాదనడం అన్నిటికంటే అవసరమైన విషయం.

నేను:- ఇది నిజమే. కాని దురదృష్టవశాత్తూ యీపని జరిగే వుంటుంది. ఒకవేళ కాకపోయినా దీన్ని మనమెలా అడ్డగించగల్గుతామో బోధపడడంలేదు.

చాంగ్ :- సమాధిని తెరచి యిక మనం చేయగల్గిందేమీ లేదు. కాని అప్పుడుగూడా కలత జెందవలసిన అవసరం లేదు. జీవితాంతంవరకూ ఆశ వుండడం సహజం.

తర్వాత ఒక అర్ధగంట వరకూ తమాషా కార్యక్రమం సాగింది. చాంగ్ మహాశయుని ఒక ఆశ్చర్యకరమైన వేష ధారణ చూస్తే సౌభాగ్యం కలిగింది. ఎడారిలో గూడా మోసుక రాబడిన ఆ అసాధారణ పెట్టెను గూర్చి చాల తక్కువగానే చెప్పగలుగుతాను. అందులోని సీసాల్లోనూ, డబ్బాలలోనూ రకరకాలైన రంగులున్నవి.

ఆయన నాతో అన్నాడు — "ఒక కటిక బీదవాడైన సెరాఫీయు భిక్షుక దుస్తులు వెంటనే తెప్పించమని కెప్టెన్ బక్లీతో చెప్పు". బక్లీ వెంటనే చాంగ్‌యొక్క యీ ఆజ్ఞను శిరసావహించాడు. గుడ్డలు చీరికలు - పేరికలుగా వున్నవి. చాంగ్ తన రూపం మార్చుకోవడం అన్నిటికీ మించిన విషయం. తన శరీరంమీదనూ, ముఖంమీదనూ ముడతల గుర్తులు వేసుకొన్నాడు. ఆఖరుకు మేముగూడా ఆయన్ను గుర్తించలేని విధంగా తన రూపాన్ని మార్చుకొన్నాడు.

కళ్ళలోని తెల్లదనం మాత్రమే కనిపించేలాగ తన రెప్పలను మూసుకొన్నాడు. ఆయన్ను చూస్తేనే భయం వేస్తోంది. తాను అంతా చూడగలుగుతానని నాతో ఆయన నమ్మకంగా చెప్పినా, నాకుమాత్రం అంధునిలాగ కన్పిస్తు న్నాడు. ఆయన లేచి నిలబడి ఒక కర్రను తీసికొని ఆ గదిలో గ్రుడ్డివానిలాగ నడవసాగాడు.

ధీరేం:- చాల బాగుంది. నేనెందర్నో వేషధారులను చూశాను. కాని యిలాంటి నైపుణ్యం మరెక్కడా చూడ లేదు.

చాంగ్ మహాశయుడు శాంతంగా అన్నాడు — "నేను రా మందిరానికి వెడుతున్నాను."

నేను:- రా - మందిరానికా ?

చాంగ్:- సెరాఫిస్ సమాధికి.

నేను అరచి అన్నాను — నీవు కాలచక్రంలో పడిపో గోరుతున్నావా ?

చాంగ్ విరగబడి నవ్వాడు — "నేను అక్కడ పడి వుండ గోరడంలేదు." ఆయన మృత్యువు నాహ్వానిస్తున్నాడని నా కనిపించింది. ఆయన్ను వెళ్ళనివ్వవద్దని నా హృదయం మొరపెట్ట సాగింది. ఆయన ద్వారంవద్దకు వెళ్ళేసరికి పరు గెత్తుకెళ్లి ఆయన చేతిని పట్టుకొన్నాను. "ఇది వున్మాదం."

చాంగ్ :- నేను మృత్యువువాత బడ్డప్పుడు సంతో షంగా నన్ను వున్మాదు డనండి. ఏదైనా పని జేయబోయే

ముందు దాన్ని - పూర్వాపరాలు బాగా ఆలోచించేవాడే చైతన్యవంతుడు (మహాజ్ఞాని) అని చెప్పబడతాడు. నేను గూడా అలాగే చేశాను. అందువల్లనే, నేను చైతన్యంగా వున్నాను; వున్మాదంతో నిండిలేను.

నేనరుస్తూ అన్నాను — కాని నీవు రాజప్రాసాదాన్ని వదలి వెళ్తున్నావు. నీవు యిచ్చటి మనుష్యులతో మాట్లాడలేవు. ఇక్కడి భాషలో ఒక్క మాటగూడా నీకు తెలియదు.

చాంగ్:- నాకు దాని అవసరమే లేదు. నేను మూగవాణ్ణి.

ఆయన మొదట్లోనే అన్ని విషయాలను గూర్చి ఆలోచించాడని అనిపించింది. నేను బక్నీని పిలిచాను. మేము ముగ్గురం కలిసి వుద్యానవనంలోని ఒక కిటికీ వద్దకు వెళ్ళాం. బక్నీ దాన్ని చాల జాగ్రత్తగా తెరచాడు. చాంగ్ తన కర్రసాయంతో పడుతూ-లేస్తూ ఎడమ చేతిని ముందుకు చాచుకొని బయటికి వెళ్ళిపోయాడు.

[illegible] ద్వారం మూసి తాళం వేశాం. నేనెంతో వ్యథిత హృదయంతో మహాలు వైపుకు మళ్లాను. తిరిగి ఆ అకారణ బంధువుని, ఆ చిరునవ్వులు చిందే గుండ్రని ముఖాన్ని చూడగలుగుతానా! అని ఆలోచిస్తున్నాను.



## 23 శభాష్ చాంగ్

చాంగ్ మహాశయుడు యీ మూడురోజుల్నుండీ నిమగ్నమై యున్న కార్యాన్ని క్లుప్తంగా వివరించా లనుకొంటున్నాను. చాంగ్ స్వయంగా యీ విషయాలన్నీ నాతో చెప్పాడు. ఆయన యీపని నెరవేర్చుకొని ప్రాణాలతో తిరిగి రాగలిగాడని వేరే చెప్పే అవుసరం లేదు. అలా జరిగివుండక పోతే యీ యాత్రను గురించిన వివరాలను చెప్పే అదృష్టమే వుండేదికాదు.

ఆయన ప్రాసాదంనుండి కొంచెం దూరం వెళ్ళి ఒక ఇరుకు రోడ్డుమీద - మూలలో - కూర్చున్నాడు. అక్కడ చాలా తక్కువమంది తిరుగుతున్నారు. పదధ్వని చెవుల్లో పడగానే బిచ్చమడగడం ప్రారంభించేవాడు. కొన్ని గంటలపాటు ఆవిధంగా అక్కడే అడుకుంటూన్నాడు. దీన్లో ఆయన వుద్దేశ్యం సమీప స్థలాన్ని పరిశీలించడం, మరొకటి, తాను ప్రాసాదంనుండి రావడం చూచిందీ, లేనిదీ తెల్సుకోవడం.

రెండుజాములకు రాజప్రాసాదం వున్న పర్వతం దిగి ఆయన నది కుడిభాగానికి చేరుకున్నాడు. జన సంకీర్ణములైన ఆ నగర మార్గాల నతిక్రమిస్తూ సూర్యాస్తమయమైన కొద్దిసేపటికి రా-మందిరం చేరుకున్నాడు.

రాత్రికి అక్కడ వున్న సైనికుల డేరాల్లో మంటలు వెలుగు కన్పిస్తూంది. ఆకస్మికంగా దండయాత్ర జరుగుతుం

దేమోనన్న భావంతో సైనికులను స్వారో మందిర సమీపా నికి చేర్చాడు.

సిపాయీలు చాంగ్‌ను గ్రుడ్డివాడనీ, మూగవాడనీ, పేద బిచ్చగాడనీ అనుకొన్నారు. వాళ్ళు ఆయనపట్ల చాల వుదారంగా ప్రవర్తించి ఖానా - పీనా గూడా పూర్తి చేయిం చారు. యే దేశపువాళ్ళయినా, యే జాతివాళ్ళయినా సైనికు లెప్పుడూ మృదుహృదయం కల్గివుంటారు. ప్రాచీన సభ్యతా ప్రతినిధులైన సెరాఫీయ సైనికులుగూడా యీ సాధారణ నియమాలకు విరుద్ధంగా లేకపోవడం సంతోషకరం.

చాంగ్ వారిమధ్య పడుకొని కొద్దిసేపట్లోనే నిద్ర పోయాడు. ఆయన యీ ప్రకృతి నాకు చాలా ఆశ్చర్యం కల్గిస్తూంటుంది. ఆ వ్యక్తి నిద్రను తన స్వాధీనంలో ఎలా వుంచుకొంటాడో! విశేషించి నలువైపులా ఆపదలతోనూ, శత్రు సమూహాలతోనూ ఆవరించబడి వున్నప్పుడు!! వాస్త వంగా ఆయన జీవితంలో ఆపదలు, ప్రాణసంకట సమయాలూ నిత్యమూ సంభవించేవే.

ఆయన రెండోరోజు వుదయమే లేచి సైనికుల మధ్యగా అటూ-ఇటూ తిరగడం ప్రారంభించాడు. ఎవరైనా పలకరిస్తే వినబడనట్లుండేవాడు. ఇంకెవరయినా చేతితో తాకితే తన కళ్ళవైపూ, నోటివైపూ సౌంజ్ఞ చేస్తూండేవాడు. ఆయన సిపాయీల ఒక్క మాటయినా తెల్సుకోలేడు. వాళ్ళతో ఒక్క మాటయినా మాట్లాడలేడు. ఆయన అంధుడేనని అందరూ అనుకొన్నారు. అయినా ఎంతోమందిని మిత్రులుగా చేసుకొన్నాడు. ఎవరూ ఏమాత్రమూ గుర్తించలేని విధంగా

ఆయన తన వేషాన్ని ఎంతో నైపుణ్యంగా నిర్వహించడం ఎంత గొప్పపని! ఆ సాయంకాలమే నొహారీ ప్సారోలు తమ వుద్యోగులందర్నీ సమావేశపరచి వుంచిన మందిరంలోకి చేరు కొన్నాడు.

మొట్టమొదట ఆయ నక్కడకు పోగానే కొంతమంది ఆవేశపడ్డారు. కాని ఆ నవాగంతకుడు అంధుడనీ, నోరు లేనివా డనీ తెల్సుకోగానే ఆయన్ని నిర్లక్ష్యం చేశారు. చాంగ్ మహా శయుని ఎత్తులు ఒకటీ రెండూ కాదు. ఆయన నడక తీరూ, పడక తెన్నులూ చాలా హాస్యం పుట్టించేవిగా వున్నాయి. ఆయన విషయ సంగ్రహణం ఇంకా విచిత్రమైంది. మంది రంలో ఒక చీకటిమూలన కూర్చొన్నాడు. నోరు మూసు కొనే వుంది. చూచేవాళ్ళకు కళ్ళుగూడా మూతలు పడ్డట్లు గానే కన్పిస్తున్నవి. కాని ఆ సమీపంలో జరుగుతున్నదంతా ఆయన చూస్తూనే వున్నాడు.

రెండోరోజు అంతా ఆయన మందిరంలో అటూ ఇటూ తిరుగుతూనే వున్నాడు. ఎంతోమంది ఆయనతో మాట్లాడాలని చూశారు. కాని ఆయన అటువైపే చూడడు. అయినా యేంచేస్తారు? నోరులేనివాడాయె మరి! అక్కడా విధంగా తిరగడంలో అందరూ తనని బాగా గుర్తించాలని తన వుద్దేశమైనట్లు తర్వాత చాంగ్ నాతో చెప్పాడు. ఇరవై నాలుగు గంటల్లో ఆ ప్రదేశమంతా ఆయనకు బాగా పరి చయమైపోయింది. ఇప్పుడాయన మరో అడుగు ముందుకు వేశాడు. ఆవిధంగా తిరుగుతూ, మెల్లిమెల్లిగా ధనదాసు - నొహారీ - ప్సారోలున్న గదికే చేరుకున్నాడు.

ఆ ముగ్గురూ ఆయన్ను క్రితనే మందిర ప్రధానమండపంలో చూశారు. ప్సారో అతని రాకను కంటగించుకొని వెళ్లిపొమ్మని ఆజ్ఞాపించాడు. కాని చాంగ్ ఆవగింజంతయినా వినబడనట్లు వూరుకొన్నాడు. నిశ్చింతగా నేలమీద ఆసనం బైఠాయించాడు.

ప్సారో ఆయన మెడమీద చెయ్యివేశాడు. కాని చాంగ్ అప్పుడుగూడా లేవలేదు. బిచ్చగాణ్ని లేపడం అంత సులభం కాదని ప్సారో తెలుసుకొన్నాడు. ఇంతలోనే నొహరీ "వాడు గృడ్డివెధవ, మూగమొద్దు, ముసలిగొడ్డు. వాడివల్ల మనకేం నష్టం? అలాగే కూర్చొని వుండనీ" అన్నాడు. ఈవిధంగా చాంగ్ మూనాడోనాటి రాత్రి నొహరీ ఆలోచనా మందిరం జొచ్చి నిద్రపోయాడు.

ధనదాసు ఇప్పుడుగూడా హోరస్ వేషంలోనే వుండి అటూ ఇటూ తిరుగుతూండడం ఆయన చూశాడు. ప్సారో తీరు తెన్నులమీద చాంగ్ బాగా నిఘా వుంచాడు. ఎందుకంటే సూయజ్‌లో యీ వ్యక్తివద్దనుంచే తాను బీజక్ కాజేశాడు. వీడే దానాపురంలో శివనాథుని వధించాడు.

కాని ఇప్పుడా అన్నకొడుకే ఆ పినతండ్రి హంతకునితో కలసి కుట్రచేస్తున్నాడు. ధనదాసు అక్కడ యీ మిత్రుల సమక్షంలో మాత్రం తన వేషాన్ని తీసేస్తూన్నాడు. అప్పుడు చాంగ్ అతని ముఖాన్ని చూచి అతడు పూర్తిగా పిచ్చివాడయిపోయాడని తెల్సుకొన్నాడు. ప్రథమంలో అతడు అర్థోన్మాదుడిగా వున్నట్లున్నాడు. సువర్ణ కాంక్ష అతణ్ని వున్మాదుడిగా చేయడం సంభవమే. చాంగ్ అనేక రకాల

అపరాధులను అధ్యయనం జేసి అలా కావడం పూర్తిగా సంభవమని నిశ్చయించుకొన్నాడు.

ధనదాసు మిశ్రీభాషలో నొహారీతో మాట్లాడలేడన్న విషయం మనకు తెలుసు. కాబట్టి ఇప్పుడతడు తాను చెప్పాల్సిన దంతా ప్సారోతో చెపుతే, అతడు మళ్లీ నొహారీకి తెలియ చెపుతున్నాడు. అంటే; ప్సారో ఇద్దరి మధ్య దుబాసీగా వ్యవహరిస్తున్నాడు. ధనదాసు ఎప్పుడన్నా నొహారీతో చెప్పాల్సివస్తే చేతులూ, మొఖం మొదలైనవాటితో అనేక రకాల సంకేతం చేస్తున్నాడు.

చాంగ్ ధనదాసు సంకేతాలను నొహారీకంటే బాగా తెల్సుకొంటున్నాడు. ఆయన ప్సారోకంటే హిందీని బాగా అర్థం చేసుకోగలడు. ఆయన అక్కడ తన ఒక్క క్షణంగూడా వ్యర్థం చేయలేదు. ఆయన చెవినొగ్గి అన్ని విషయాలనూ బాగా వింటున్నా ఆయన ముఖంమీద హర్ష విస్మయాల చిహ్నమైనా కనబడడంలేదు. అక్కడ కూర్చొని ఆయన మాకు అమూల్యములైన ఎన్నో విషయాలను తెలుసు కొన్నాడు.

నాగరికుల్లో అధికభాగం విద్రోహులతో కలసిపోయారని ఆయన తెల్సుకొన్నాడు. నొహారీ మనుసటిరోజే వారికి బంగారం పంచిపెడతానని మాట ఇచ్చాడు. రాజప్రాసాదాన్ని జయించి సింహాసన మధిష్టించిన తరువాత మరికొంత ధనంగూడా పంచిపెడతానన్నాడు. అదే సమయంలో ఖజానాను గురించి వారిలో జరిగిన సంభాషణను గూడా చాంగ్ విన్నాడు.

ధనదాసు వారితో "నాకు రత్నాలలో మూడో భాగం ఇస్తానని మీరు ప్రమాణం చేసేవరకు నేను సమాధిని తెరవను" అని అన్నాడు. అతడు దీనికొరకు ఎంతవరకు సన్నద్ధపడ్డాడంటే ఆ యిద్దరూ రెండు మూడేసి మార్లు ప్రమాణం చేసి వాటి నెప్పుడూ భగ్నం చెయ్యమనీ మాట ఇచ్చేవరకూ వూపిరిగూడా పీల్చలేదు. తనను రత్నమందసాలతో సహా బానిసల నిచ్చి, శస్త్రసంపన్నులైన సైనికులతో సురక్షిత స్థానానికి చేర్చాలన్న షరతుగూడా వాళ్ళచేత వొప్పించాడు. నోహారీ ఆ రెండు విషయాలనూ ఒప్పుకొన్నాడు. పర్వతాలకు ఆవైపున ఒక అరణ్యముందనీ, ఆ తరువాత ఒక నది గలదనీ, ప్సారో చెప్పినట్లు, ఆ మార్గమే బాహ్యజగత్తుకు చేరుస్తుందనీ చాంగ్ అప్పుడే తెల్సుకొన్నాడు.

ఇప్పటివరకూ సమాధి తెరువబడ లేదనీ, నోహారీ ప్సారోలు సమాధిలో ప్రవేశించలేదనీ స్పష్టంగా తెలిసిపోయింది. ధనదాసు చెప్పిన సువర్ణ, రత్నరాసులను చూడాలని వారిద్దరూ ఎంతగానో వువ్విళ్ళూరుతూన్నారు. ప్రమాణాలు చెయ్యడం పూర్తయ్యాక ధనదాసు వారిని ఆ రాత్రికే భూగృహానికి తీసుకపోవడాని కిష్టపడ్డాడు. అయినా ఆ రహస్యాన్ని చెప్పడానికి మాత్రం అంగీకరించలేదు. అతడన్నాడు. "నేను ముందువెళ్లి సమాధి ద్వారాన్ని తెరుస్తాను. అప్పుడు మిమ్మల్ని తీసుకవెళ్తాను" ఇలా అని అతడు పూజారులు పడుకునే మందిరంలోని గదివైపుకు వెళ్ళాడు.

ధనదాసు నోహారీ, ప్సారోలకు కొద్ది దూరంగా వెళ్ళి తన కృత్రిమ ముఖాన్ని తీసివేశాడు. వాళ్ళిద్దరూ తెలుసుకో

లేని విధంగా అతడా గడ్డిలోకి చేతులు దూర్చాడు. వాళ్ళిద్దరూ దీనిపై అధికధ్యాన ముంచకపోయినా చాంగ్ మాత్రం అక్కడే కూర్చొని ఇదంతా శ్రద్ధగా చూస్తున్నాడు. ధనదాసు ఆ గడ్డినుంచి సెరాఫిస్ సమాధి తాళపుచెవ్వి (గోబరైలా) ని బయటకు తీశాడు.

ఇక ధనదాసు గదినుండి బయటకు వెళ్ళి దగ్గరలో వున్న మెట్లమీదుగా భూగర్భ గృహంవేపు కెళ్లాడు. చిత్ర లిపి తెలియనందువల్ల అక్షరాలను కలిపి, త్వరగా చదువలేక పోయాడు. అందువల్లనే అర్ధగంటదాకా బయటకు రాలేదు. తర్వాత భూగృహంనుండే నోహరీ, ప్సారోలను లోనికి రమ్మని కేకవేశాడు.

ధనదాసు లేనప్పుడు చాంగ్ దృష్టి నోహరీ, ప్సారోలపై కేంద్రీకరించబడింది. వారి ప్రతిజ్ఞలు ధనదాసుపట్ల విశ్వాస ఘాతకాన్ని ప్రదర్శించుతాయేమో నని పరిశీలిస్తున్నాడు. వారికా వుద్దేశం లేదని తెలిసింది. ఎందుకంటే ఆలాంటి భావమేవుంటే చాటుగా మాట్లాడుకునేవారే. అయినా వారు నైలు లోయనుండి లభించిన – యిక్కడే వేలకొలది సంవత్సరాలక్రితం సారవంతమైన సభ్యదేశ మొకటుండేది – అపరిమిత ధనరాసులను చూడాలన్న ఔత్సక్యంతో వున్నారు.

ధనదాసు పిలువగానే నోహరీ ప్సారోలు అటువైపు కేసి పరుగెత్తారు చాంగ్ కదలకుండా ఆసన మేసుకొని అలాగే కూర్చున్నాడు. ఆయ నేమాత్రం నవ్వనైనా లేదు. అతని నేత్రాలు అలాగే అర్ధ నిమీలితంగా వున్నవి. పెదవులుకూడా కదలలేదు.

ముస్గుగూ భూగృహంలో ఒక గంటసేపు వున్నారు. చాంగ్ ఒంటరిగా కూర్చున్నచోట ఒక కాగడా వెలుగు తూంది. ఎంతో ఉత్కంఠతతో అడుగుల చప్పుడు ఆలకిస్తున్నప్పటికీ ఆయ నక్కడనుండి ఒక్క అంగుళమైనా కదలలేదు. గోడవైపునుండి ఒక ఎలుక వచ్చి చాంగ్‌ను చూచింది. తర్వాత ముందుకాళ్ళతో తన మీసాలను దువ్వుకోసాగింది. పాపం! ఆ ఎలుక చాంగును మృతకళేబర మనుకొంది.

నొహారీ తన బంగారు కవచాన్ని ధరించి లోనికి వచ్చాడు. అతని కళ్లు మెరుస్తున్నవి, ముఖంమీద రక్తం తీవ్రంగా ప్రవహిస్తున్నట్లుంది. ఒరనుండి కత్తి తీసినప్పుడు అతని చెయి కంపించడం చాగ్ చూశాడు.

ప్సారో పరుగెత్తుకుంటూ సేనాని వద్దకు వచ్చాడు. అతడాతని భుజంపట్టుకొని వూపాడు. అతడు పిచ్చివాడయినాడేమో ననిపిస్తున్నది. తరువాత ఎంతో ఆదుర్దాగా వారిద్దరూ తమ భాషలో మాట్లాడుకొన్నారు. ధనదాసు అప్పుడు లోనికివచ్చి వాలిద్దరకూ కన్పించకుండా, ఆ గద్దెలోనే గోబ శైలాను దాచివేశాడు.

తర్వాత అతడు తన అనుచరుల వద్దకు చేరాడు. అతని స్థితి మరీ వున్మాదంగా వుంది. రెండు చేతులనూ పైకెత్తుకొని నృత్యం చేయసాగాడు. అతని ఆజాను లంబిత హస్తాలూ, పాదాలూ, డేగ ముఖంతో చేయబడుతున్న యీ వికృత నృత్యం మరీ అసహ్యంగానూ, పిచ్చిగానూ కనబడుతూంది. అతడనుస్తూ అన్నాడు — వజ్రాలు! బంగారం! ముత్యాలు! రత్నాలు! ఓ హో హో! వూహాకందని ధనరాసులు! నేను

వజ్ర వైఢూర్యాలలో చేతులు దూర్చాను. ఆహా! అవి నా చేతుల్లోనుండి పాదరసంలాగా జారిపోతున్నాయి! మోకా ళ్ళెత్తున బంగారపు ఇటుకలు పేర్చబడి వున్నాయి!

అతడప్పుడు ప్సారో రెండు చేతులనూ పట్టుకొని అతని ముఖంలోకి చూస్తూ అన్నాడు — ఏం, అన్నమాటను నిలబెట్టు కుంటారా? నన్ను నీవు నమ్మి, నిన్ను నేను నమ్ముతాను.

ప్సారో:- నిశ్చింతగా వుండు. బంగారమంతా ప్రజలకు పోనివ్వు. దీనితో నొహారీ మనోరథం యీడేరుతుంది. రత్నా లలో మన ముగ్గురికీ సమాన వాటాలు.

ధన:- నన్ను ఇక్కడనుండి సురక్షితంగా పంపే యేర్పాట్లుగూడా చేయాల్సి వుంటుంది.

ప్సారో:- నొహారీ యీ విషయంలో ముందే మాటి చ్చాడుగా?

ధన:- నేను హోరస్ దేవతగా మీకు సహాయం చేస్తుంటాను.

ప్సారో నవ్వుతూ అన్నాడు — ఇక్కడివాళ్ళకు ఆలో చనాశక్తి శూన్యం. మన యిష్టం వచ్చినట్లుగా వాళ్లముందు నటన చేయవచ్చు.

ఇప్పటివరకూ నిద్రిస్తున్న చాంగ్ ఇక గురకలు పెట్ట సాగాడు. ఒక పెద్ద గురక ప్సారో ధ్యానాన్ని అటు ఆకర్షిం చింది.

ప్సారో:- యీ ముసలిముండాకొడుకింకా ఇక్కడే వున్నాడు. వీణ్ని బయటకు గెంటివేసేదా?

ధనదాసు దీన్నిగూర్చి ఆలోచిస్తున్నట్లున్నాడు. చివర కతనుగూడా స్పారో అభిప్రాయాన్ని సమర్థిస్తూ అన్నాడు— అవును, అదే మంచిపని; అనవుసరంగా కష్టాల నెందుకు కొనితెచ్చుకోవాలి ?

స్పారో వచ్చి చాంగ్ మెడ పట్టుకొన్నాడు. చాంగ్ మహాశయుడు వులిక్కిపడి లేచాడు. గుడ్డివాడిలాగే, నిద్ర మత్తులో వున్నట్లుగానే, స్పారోను గది మధ్యభాగంలోకి విసరివేశాడు. చాంగ్ అప్పుడు దొర్లుకుంటూ రెండడుగులు ముందుకు వేశాడు. ఇది చూచిన నొహారీకి కోపం వచ్చి చాంగ్ వైపుకు పరుగెత్తాడు.

నొహారీ సరిగా పట్టుకోలేకనేపోయాడో, ముసలి బిచ్చగాడి కాళ్లలో శక్తే లోపించిందో గాని చాంగ్ బోర్లా పడిపోయాడు. అదృష్టవశాత్తూ అతడు గడ్డి మధ్యభాగంలో పడ్డాడు. దెబ్బలేమీ తగల్లేదు.

ఆ ముగ్గురు వ్యక్తులూ కుక్కల్లాగా గుడ్డివాడిమీద ఎక్కి కూర్చున్నారు. వాళ్ళు చాంగ్ కాళ్ళూ-తలా పట్టుకొని అక్కణ్ణించి లేవదీసి మందిరంలోని రాతి గచ్చుమీదకు విసరివేశారు. పాప మా మూగవాడికి యేడవడానిగ్గానీ, అరవడానిగ్గానీ శక్తిలేదు. అతడు కేవలం మూలుగుతున్నాడు. అతని రెండు చేతులూ గుండెకు అంటించినట్లున్నవి. వాటి క్రింద వున్నదే సెరాఫిస్ సమాధి తాళపుచెవి గోబర్రైలా బీజక్.



# 24 రాజప్రాసాదంమీద దండయాత్ర

చాగ్ సావధానంగా నిలబడి నాల్గువైపులా చూశాడు. ప్సారో - నౌహరీ - ధనదాసులు లోపలి గదికి వెళ్ళిపోయారు. ఆ సమీపంలో యెవరూ లేరు. కొద్దిమంది వృద్యోగులు మాత్రం ఒక మూలన కూర్చొని జూదమాడుకొంటూ మాన సికానందం పొందుతున్నారు. తనవైపు యెవరూ చూడలేదనీ, ఒక్క క్షణంగూడా వృథాజేయడం మంచిదిగాదనీ అనుకొన్నాడు; ఎందుకంటే యేసమయంలోనైనా ధనదాసు బీజక్ పోయిందని తెలుసుకోవచ్చు. అతడు వణుకుతున్న నడకతో నాల్గడుగులు ముందుకువేసి నిముషంలో భూగృహానికి చేరుకొన్నాడు. సమాధి తెరచివుందో మూసివుందో తెలుసుకోవడమే అక్కడకు వెళ్ళడంలోని ఆయనభావం. ద్వారం మూసివుండడం ఆయన చూశాడు. ఇంకా సంతోషంకొద్దీ యెన్నో చక్రాలను త్రిప్పాడు. వెంటనే మందిరంలోకి వచ్చి మళ్ళీ అంధుడై పోయాడు. కర్ర పొడుచుకొంటూ సిపాయీలను దాటి కొద్ది సేపట్లోనే బాహ్య ప్రదేశానికి వచ్చాడు.

విద్రోహ సైన్యమంతా నిద్రలో మునిగివుంది. వాళ్ళందరూ మృతప్రాయంగా పడివున్నారు. చాగ్ డేరాల మధ్యగా కర్ర బొడుచుకొంటూ, కాళ్ళీడ్చుకుంటూ ముందుకెళ్ళాడు. పహరావాడు జూచి పలకరించాడు. కాని మూగవాడు సమాధానం చెప్పలేడని వాడికి గుర్తొచ్చింది. అరే! వీడేగా గుడ్డి

బిచ్చగాడు; రెండు - మూడు రోజులనుంచి అడ్డా - ఆపూ లేకుండా మందిరంలో అటూ - యిటూ తిరుగుతున్నాడు.

పహరా ప్రదేశం దాటగానే ఆయన ఒక్కసారి పరుగు లంకించుకొన్నాడు. ఇంకా ఆయన 100 గజాలైనా పరుగెత్తక ముందే సేనలో గోలరేగింది. బీజక్ మాయమైందని ధన దాసుకు తెలిసిపోయింది.

అదృష్టవశాత్తూ గుడ్డి బిచ్చగాడు ఈ త్రోవనే వెళ్లాడని వారెవరికీ సందేహం కలుగలేదు. వాళ్లా మందిరం చుట్టుప్రక్కలనే వెదకడం ప్రారంభించారు. బయటి పహరా మనిషి అతను బయటికి వెళ్లాడని చెప్పేటప్పటికే ఆయన చాల దూరం దాటివచ్చాడు.

ఆయన రాత్రి 3 గంటలకు నగరం చేరుకున్నాడు. ఫలానా సంకేతంగల వ్యక్తి వస్తే వెంటనే అతన్ని ప్రవేశించ నివ్వవలసిందిగా రాజ ప్రాసాదంలో చెప్పి వుంచాం. ఈ విధంగా ఆయన కిటికీ త్రోవన రావడంలో ఆలశ్యమేమీ కాలేదు.

ఆయన సరీగ్గా నేనూ - ధీరేంద్రుడూ వున్న చోటుకే వచ్చాడు. బీజక్‌ను చాంగ్ మళ్ళీ ఎగురగొట్టుకొచ్చాడని వినగానే మా హర్షాశ్చర్యాలకు హద్దులేకుండా పోయింది. నా ప్రియమిత్రుణ్ణి మళ్ళీ కలుసుకొంటానన్న విశ్వాసం లేదు. ఇప్పటికే ఆయన మృత్యువాత బడివుంటాడని నేను నిశ్చయించుకొన్నాను. నేను స్వప్నంలోగూడా అనుకోని సాఫల్యాన్ని ఆయన పొందాడు. ఖజానా యిప్పటికీ సురక్షితంగానే

వున్నది. ఫిరంగులు ప్రయోగిస్తేనేగాని ఆద్వారం కదలదనడం నిశ్చయం. కాని వారికి మందుగుండును గురించిన జ్ఞానం శూన్యం. ఇప్పుడు నోహరీ స్వర్ణంతో ప్రజలను కొనలేడు. ఇక అతనికి యుద్ధం జేయడానికి యెక్కువమంది సైనికులు దొరకరు. మొదటికంటే యిప్పుడు మాస్థితి చాల మెరుగ్గా వుంది.

అరుణోదయంతో పాటు మళ్ళీ మేము యుద్ధసమితిని సమావేశపరచాం. అందు స్వయంగా మహారాణి అధ్యక్ష పీఠాన్ని అలంకరించింది. ఇక బక్షీ, అహ్మసో, ధీరేంద్రుడూ, చాంగ్, నేనూ సభ్యులం.

ప్రస్తుతంవున్న పరిస్థితిలోని ప్రతి అంశాన్ని గురించి చర్చించాం. మహలును రక్షించాలని మేము నిశ్చయించుకొన్నాం. నోహరీ వెంటనే దండెత్తుతాడన్నది నిస్సంశయం. ఆ ఖజానాకోసం పిచ్చివాడైపోయిన ధనదాసు బీజక్ మా వద్దకు చేరిన తర్వాత శ్వాసగూడా పీల్చుకోడు.

మేము 5 రోజులవరకూ నిరీక్షించాం. చివరకు దండయాత్ర ప్రారంభమైంది. గుడ్డి బిచ్చగాడు గుప్తచరుడని హ్సారోగానీ, ధనదాసుగానీ నమ్మడానికి సిద్ధంగా లేకపోవడమే యీ ఆలస్యానికి కారణం. ధనదాసుకు చివరివరకూ చాంగే తనను యీవిధంగా బోల్తా కొట్టించాడని తెలియదనడంగూడా సంభవమే.

ఈ అయిదురోజుల్లో బక్షీగానీ, అతని సైనికులుగానీ ఒక్క క్షణంగూడా వూరుకోలేదు. మహలు నిర్మాణంలో కుడ్యాలు చాల బలిష్టంగా వున్నా అవి దండయాత్రను ఆప

గలిగినంత దృఢంగామాత్రం లేవు. మేము బయటి గోడల్లో తుపాకులు కాల్చడానికి వీలుగా వుండేటట్లు చిన్న చిన్న కంతలు యేర్పరిచాం. విశేషించి మహారాణి నివాస స్థలాన్ని బాగా దృఢంగా తయారుచేశాం. ద్వారాలను మూసివేసి కిటికీలను ఇటుకలతో పునర్నిర్మించాం. తోటలో యీవైపు నుండి ఆవైపుదాకా ఒక కందకాన్ని త్రవ్వించాం. ప్రతిచోట ముళ్ళపొదలూ మొదలయిన అనేక ఆటంకాల నేర్పరిచాం.

ఈ 5 రోజుల్లోనూ నగరంలో నూతన విశేషమేమీ లేదు. అందరూ మందకొడిగా వున్నారు. ఎవ్వరికీ, ఏపక్షాన చేరుదామన్నా సాహసం లేదు. అందరూ తటస్థులే. విజయం కలిగేవైపు తామున్నామని వుద్ఘోషించడానికి తయారుగా వున్నారు. మహారాణిపట్ల వారికి భక్తివున్నా, నోహరీ శక్తిని జూచి వాళ్లామెకు యేవిధంగానూ సహాయ పడలేకపోయారు. అల్పసంఖ్యాకులైన రాణి అంగరక్షకులు యింత పెద్ద సైన్యాన్ని యెదుర్కో గలుగుతారన్న విశ్వాసం వారి కేమాత్రం లేదు.

ఆరవరోజు సూర్యోదయ సమయంలో మేము మహలు పైకెక్కి చూశాం. నోహరీ హ్సారోల నాయకత్వంలో ఒక పెద్ద సైన్యం నదివొడ్డుగా రావడం కన్పించింది. తమ-తమ స్థానాల్లో దృఢంగా వుండమని బక్షీ తన సైనికులను ఆజ్ఞాపించాడు.

మేము నిశ్శబ్దంగా దండయాత్రకై ప్రతీక్షిస్తున్నాం. ఇది ఒకవైపు జిజ్ఞాస మరోవైపు వ్యాకులాలతో నిండిన సమయం. ఇది జీవితానికే గాక మితసీనగర సింహాసనానికి

గూడా సవాలని మేము బాగా తెలుసుకొన్నాం. మహారాణి ప్రాణాలు గూడా ఆపదల్లోనే వున్నాయి.

ఆ రోజంతా సైన్యం నావలమీద నదిదాటి ఒక సురక్షిత స్థానాన్ని చేరుకొంటున్నది. ప్రత్యాక్రమణ చేయాలని ధీరేంద్రుడు ప్రస్తావించాడు. కాని చాగ్ బక్షీలు ఈ ప్రస్తావనను నిరోధించారు; ఎందుకంటే అలా చేయడానికి మనం విశాలమైన యుద్ధరంగంలోకి పోవాల్సివస్తుంది. అక్కడ అల్ప సంఖ్యాకంగా వున్న మన సైన్యం బహుళంగావున్న ప్రతిపక్ష సైన్యంవల్ల దెబ్బ తినాల్సివస్తుంది. చివరకు మేము మా స్థానాల్లోనే వుండి ఆక్రమణకోసం ప్రతీక్షించసాగాం.

హూణ్ వేషధారి ధనదాసు నోహరీ సైన్యంలో యిటూ అటూ తిరుగుతూండడం నేను చూశాను. మూడింట రెండువంతుల సైన్యం నది దాటగానే ఆక్రమణ ప్రారంభమవడానికి ధనదాసు ఆతురతే కారణమని అనుకొంటున్నాను. ధనదాసు స్వయంగా కొంత సైన్యాన్ని తీసికొని మహాలు ద్వారానికి వచ్చి చేరుకొన్నాడు.

అటుతర్వాత జరిగిందొక చిన్న హత్యాకాండ. ఆ హత్యాకాండను సందర్శించకపోవడం నన్ను నేను అదృష్టవంతుణ్ణని అనుకొంటున్నాను. వాళ్ళు తమవెంట పెద్ద-పెద్ద నిచ్చనలను తెచ్చుకొని గోడలకు వేశారు. కాని అవి వెంటనే పైనుండి యినుప కడ్డీలతో త్రోసివేయబడ్డాయి. పైకెక్కడానికి సాహసించినవాడు అక్కడేపడి పైలోకానికి చేరుకొంటున్నాడు. రక్షకసైనికులు కొండల్లాగా తమస్థానాల్లో స్థిరంగా వున్నారు. సముద్రతీరంలో వున్న పర్వతాల్లాగా శత్రుతరం

గాలను ఎదుర్కొని వెనక్కు నెట్టివేస్తున్నారు. మా సైనికుల వద్ద వున్న మా సైనికుల ధనస్సు బాణాలతో శత్రుదళాలను తీవ్రంగా దెబ్బకొడుతున్నది. ఒకడు చావగానే మరొకడు అక్కడ నిలబడుతున్నాడు. నోహరీ సైనికులంతా నిర్భీకులూ, నిర్దాక్షిణ్యులూ.

రాత్రికాగానే యుద్ధం ఆగిపోయింది. శత్రువు లిక్కడి నుండి సురక్షిత ప్రాంతానికి తరలివెళ్ళారు. రాజప్రాసాదపు దక్షిణ-పశ్చిమదిశల్లో విశాల ప్రదేశమున్నది. అక్కడే వేల కొలది సిపాయీల డేరాల ముందు చలిమంటలు మండుతున్నవి. నగరానికి తూర్పునవున్న గృహాలన్నీ నోహరీ సైనికుల స్వాధీనంలో వున్నాయని మాకు తెలిసింది. రెండో వైపున నదివున్నది. ఈ విధంగా రాజప్రాసాదం నాల్గువైపులా చుట్టడించబడింది. ఇక మేము తప్పించుకుపోయే అవకాశమేమీ లేదు. అంత్య సమయంవరకూ పోరాడడం తప్ప మాకు మరోమార్గం లేదు.

సూర్యోదయంతోపాటే తిరిగి దండయాత్ర ప్రారంభమైంది. యుద్ధం ప్రారంభంకాగానే యీసారి దండయాత్ర చాలా భీకరంగా వుండడం మేము చూశాం; ఎందుకంటే రాత్రికే నోహరీ ఒక పెద్ద దుర్గభేదకయంత్రాన్ని తెచ్చాడు. నినేవా, బాబుల్, జెరూసలెం విజయాల్లో సహాయం జేసిన యంత్రమేయిది. దీనిలో ఒక పెద్ద యినుపదూలం వుంటుంది. కొంతమంది మనుష్యులు కలసి దీనితో ద్వారాన్ని గుద్దుతారు. రెండుమూడు దెబ్బల్లోనే యెంతో బలంగల గోడలు గూడా నేలమీద కూలిపోతాయి.

చాంగ్ ధీరేంద్రులు ఘోర యుద్ధంలో నిమగ్నులై వున్నారు. అత్యవసర పరిస్థితుల కోసం భద్రపరచబడిన సైనికులతో నేను వున్నాను. ఆనాటి యుద్ధంలో ధీరేంద్రుడు గొప్ప వీరత్వాన్ని ప్రదర్శించాడని విన్నాను. తన అనుచరులు ఒకొ్కక్కరుగా చనిపోనంతవరకూ, దుర్గభేదక యంత్రం ద్వారాన్ని బ్రద్దలు గొట్టనంతవరకూ ముఖద్వారంనుండి అంగుళమైనా వెనక్కు తగ్గలేదు.

అదే సమయంలో హోరస్ లోనికి వచ్చాడు. అతడు యిప్పటికీ శత్రుసైన్యంలో దైవంలాగే భావించబడుతున్నాడు. ఇటు పశ్చిమద్వారానికి ఈగతి బట్టింది. అటు తూర్పుద్వారానికి గూడా అదేస్థితి. చాంగ్ పోరాడుతూన్న ద్వారంమీద గూడా అలాంటి దెబ్బలే తగుల్తున్నవి. ఈ విధంగా రెండు వైపులా ఆపద ముంచుకొస్తున్నందువల్ల అందరూ మహలు వైపుకు తిరగవలసిందిగా బక్నీ ఆజ్ఞాపించాడు.

ఈ తిరోగమనం గూడా క్రమశిక్షణతోనే జరిగింది. క్షతగాత్రులందరూ మహలుకు తీసుకరాబడ్డారు. అక్కడ మహారాణి స్వయంగా తన చెలికత్తెలతో వారికి చికిత్స చేస్తోంది. మూడవఝామున శ్వాస బీల్చుకోవడానికి గూడా వీలులేని యుద్ధ సమయంలో నాకు ధీరేంద్రుణ్ణి కలుసుకొనే అవకాశం దొరికింది.

నేను— పరిస్థితి చాలా భయంకరంగావుంది. వారివద్ద దుర్గభేదక యంత్రం లేకుంటే ద్వారందాటి వారు లోపలకు రాలేరు. బాహ్యకుడ్యాలు అంతఃపురపు గోడలకంటే దృఢం

గానే వున్నవి. మనమెలా ఎదుర్కొంటామో నాకు తెలియడంలేదు.

ధీరేం— నేను దీనికేమీ కలతజెందడం లేదు. ఇప్పుడైనా వారు కందకం దాటాలి. ఇది తేలిక విషయమేమీ కాదు.

నొహారీగాని, అతని అనుచరులుగానీ స్వల్ప కాలాన్ని గూడా వృధా చేయడంలేదని తెలుస్తోంది. కొంచెం ఆలస్యమైనప్పటికీ దుర్గభేదకయంత్రం ముఖద్వారంగుండా లోపలకు తీసుకరాబడింది. యుద్ధం మళ్ళీ ప్రారంభమైంది. ఇప్పుడు మా సంఖ్య చాలా తగ్గిపోయింది. కాబట్టి నేను నా రిజర్వు సైనికులతో యుద్ధంలోకి దిగాల్సి వచ్చింది. మహాలు ముందు భాగాన్ని రక్షించడంలో ధీరేంద్రునికి సాయం జేయడం నా వంతు.

మానవ హృదయం యింత క్రూరంగా వుంటుందని నేను స్వప్నంలోగూడా అనుకోలేదు. మాటి-మాటికి శత్రువులు ముందుకు రావడానికి ప్రయత్నించారు; మాటి-మాటికి వారు వెనక్కు నెట్టివేయబడ్డారు. ధనదాసు ఒక చేతిలో రివాల్వరు, మరొకచేతిలో తుపాకుతో తన అనుచరులను వుత్సాహపరుస్తున్నాడు. నొహారీ అటూయిటూ పరుగెత్తుతూ తన సైనికులను ఆదేశిస్తున్నాడు. ఆ ఆజ్ఞాపాలనగూడా అక్షరాలా జరిగిపోతున్నది.

ధీరేంద్రుడు అనుబిస్ రూపంలో పోరాడుతున్నాడు. ఆయన చంకలో గుండ్లసంచీ వ్రేలాడుతోంది. శత్రువులు యంత్రాన్ని కందకంవద్దకు తీసుకొచ్చినప్పుడల్లా ఆయన గురి

జూసి కాల్చే కాల్పులకు ప్రతిసారి శత్రువులు బలి అవు తున్నారు. అలాంటి దెబ్బలు తిన్నతర్వాత యిప్పుడు యంత్రాన్ని ద్వారంవద్దకు తీసుకపోయే సైనికు లెవ్వరూ నొహారీకి కన్పించలేదు.

రాత్రికాగానే యుద్ధం తీవ్రరూపం దాల్చించి. అంధ కారంలో పోరాడడానికి మంచి అవకాశం దొరుకుతుందని నొహారీ ఆశించాడు. అతడు క్రొత్తసైన్యాన్ని యుద్ధంలోకి దించాడు. మేమూ యుద్ధం చేస్తూనేవున్నాం. ఇప్పుడు మా వద్ద మహలు రక్షణకు సరిపోయే సైన్యంగూడా లేదు. మా స్థితి అలసటతో త్రాగుబోతుల్లాగా అయిపోయింది. ధనదాసు రాత్రి 10 గంటలకు ఒక యంత్రాన్ని మహలు ద్వారంవద్దకు చేర్చడంలో కృతకృత్యు డయ్యాడు.

ధీరేంద్ర-బక్షీలు అక్కడకు పరుగెత్తినప్పటికీ అప్ప టికే చాల ఆలస్యమైపోయింది. ఒక్క దెబ్బతోనే బయటి గోడ లోపలకు విరుచుకుపడింది. దానిమీదున్న గది గభీలున నేలపై కూలింది. ఒక గంట ప్రయత్నంతో వారు బాటను విశాలపర్చుకొన్నారు. బక్షీ-అతని సైనికులు ఎంతోశౌర్యంగా ఎదుర్కొన్నారు. కాని యిదంతా వ్యర్థమౌతుందేమో ననిపిస్తున్నది.

అర్ధరాత్రికి యుద్ధ మాగిపోయింది. అలసట, ఆకలి, దప్పిక యిరుసైన్యాల్లోనూ ఒక విధమైన రోగాన్ని ప్రవేశింప జేసినవి. దానిమూలంగా రెండు సైన్యాలూ ఆజ్ఞలేకుండానే విశ్రాంతికి వెనుదిరిగినవి. నొహారీ, బక్షీ లిద్దరూ తమ తమ భగ్న స్థానాల్లో పహారాలను పెట్టారు.

"మహారాణి నీతోనూ, నీ మిత్రులతోనూ మాట్లాడ గోరుతున్నది" అని అహ్మాసో వచ్చి నాతో చెప్పాడు. నేను నా స్నేహితులతో దర్బారుహాలుకు చేరుకోగానే బక్నీ గూడా అక్కడే వుండటం చూశాను. ఈ సమావేశంలో నేను దుబాసీపని చేశాను.

ధీరేం-: మహాలునుండి వెలుపలకు వెళ్ళే మార్గమే దైనా వుంటే మనకు మంచి అవకాశం దొరికినట్లే. నేను స్వయంగా చిన్న సైన్యాన్ని తీసుకొని శత్రువులను వెనుక వైపుగా ముట్టడిస్తాను. అలాంటి ఆకస్మిక ముట్టడివల్ల శత్రు సమూహాల్లో కల్లోలం వ్యాపించి యంత్రాన్ని తమ స్వాధీనంలో వుంచుకోలేక పోతారు.

చాంగ్-: ఇక్కడలాంటి మార్గమేదైనా వున్నదా?

ఈ మాట నేననువదించి వినిపించగానే సంతోషంతో బక్నీ నా భుజంపై కొట్టినదెబ్బ నన్ను చాల వ్యాకులపర చింది. అతడన్నాడు— అలాంటి మార్గమున్నది. నేను దాన్ని గూర్చి ఆలోచించకపోవడం మూర్ఖత్వమే. సొరంగ మార్గ మున్నది. అది మహాలునుంచి పట్టణ మధ్యభాగంలోకి పోయి అక్కడ పైకివస్తుంది. తిరిగి అతడు ధీరేంద్రుని వైపుకు తిరిగి అన్నాడు—దీన్ని నేను అనువదించి వినిపించాను—"మీరు నా వెంటవస్తే నేను స్వయంసేవకులను (స్వచ్ఛంద) అప్పగిస్తాను. వీరిలో నాకు తెలిసిన వారినే యేరుకొంటాను. వారిని నేను నగరంవరకు తీసుకువస్తాను. తిరిగి మనం నొహాలీకి వెనుక వైపుగా ముట్టడిద్దాం. అతడి సైన్యాన్ని చీల్చి చెండాడుతూ మహాలులో ప్రవేశించి యంత్రాన్ని మన స్వాధీనం చేసుకొం

దాము. ఒక్కసారి దానిని స్వాధీనం చేసుకొంటే ఈ నరపిశా చాలను నది ఆవలివైపుకు నెట్టివేయ గల్గుతామని ఆశించ వచ్చు.

అదే సమయంలో ఒకడు వగర్చుకుంటూ వచ్చి చెప్పాడు—నొహారీ ఒక దూతనుబంపాడు. అతడు మహారాణిని కలుసుకో గోరుతున్నాడు. వెంటనే ఆ వ్యక్తి రాణి సమక్షం లోకి పిలిపించబడ్డాడు. అతడు మోకరించి రాణికి నమస్క రిస్తూ అన్నాడు-మహారాణీ, నొహారీసేనాని తమకు 'వందనాలు' పంపాడు. తాను చక్రవర్తిననిగూడా చెప్పాడు. ఇంకా సందే శమయిది—"నీకు ఒక్క అవకాశంమాత్రం వుంది. నీకై నీవు మాకు లోబడితే మేము నిన్ను దేశబహిష్కారము మాత్రమే చేస్తాం. వైరం బెట్టుకుంటే నీకు మృత్యువు తథ్యం."

ఇప్పటివరకూ, కూర్చొనివున్న మహారాణి లేచి నిల బడింది. ఆమె నేత్రాలు నిప్పులవలె వున్నాయి; వదనంమీద రక్తం చిందుతోంది; అధరాలు కంపిస్తున్నాయి.

ఆమె చాలా గంభీరంగా అన్నది-వెళ్ళు; వెళ్ళి నీయజ మానితో చెప్పు. మిశెనీనగర మహారాణి సెరిసిస్, విశ్వాస ఘాతకుల హస్తాల్లోగాని, లేక వారి అనుచరుల హస్తాల్లోగానీ మరణించడానికేమీ వెనుదీయదు.

వచ్చినవ్యక్తి ఒంగి నమస్కరించి తన బాటనవెళ్ళాడు. నేను బక్నీవైపుకు చూశాను. అతని హస్తం కరవాలంమీద వున్నది. నేత్రాలు రక్తరంజితాలైనాయి. అధరాలు కంపిస్తు న్నాయి.

# 25 భయంకరస్థితి

ఆ భయంకర దినాల్లో, మేము మా శరీరాలనూ, యితర పనులనుగూడా మరచిపోయాం. ఆకలైనప్పుడు తినడం, అలసటమూలంగా నిద్రవస్తే వివసులమై నిద్రించడం.

ఇంకా చాలరాత్రి వుండగానే బక్షీ తన సైనికుల నందరినీసమావేశ పరచాడు. కేవలం మహలు పహరాకుగాను అక్కడక్కడ వుంచబడ్డవారు తప్ప. తానొక భయంకరమైన పనిలో ప్రవేశించబోతున్నాడని తన సైనికులకు విప్పిచెప్పాడు. అతడు విస్తారంగా చెప్పకపోయినా ఈ వెళ్ళేవారిలో ఒక్కడు గూడా బ్రతికిరావడం సంభవం కాదన్నమాట స్పష్టంచేశాడు. తర్వాత స్వచ్ఛందసేవకులను ముందుకు రమ్మన్నాడు. వారిలో ప్రతిఒక్కడూ ముందుకు వచ్చినవాడే. అటుపైన బక్షీ నాతోనూ, అహ్మసోతోనూ చెప్పాడు — "నే నాశించినట్లే అయింది. వాస్తవంగా మహారాణి చాల అదృష్టవంతురాలు; ఎందుకంటే ఆమె సింహాసన రక్షణార్థమై యిటువంటి రక్షకులు దొరకడం సామాన్య విషయం కాదు.

బక్షీ తన కార్యసాఫల్యానికి 50 మందిని మాత్రమే కోరుతున్నాడు. అందువల్ల అతడు స్వయంగా సైన్యంవైపుకు వెళ్ళాడు. అతడు ఏ సైనికుని వక్షస్థలంమీద తన చేయి పెడతాడో అతడు వెంటనే వేరై తన మిత్రులకభిముఖంగా నిలబడుతున్నాడు. ఈ గుంపు రాణి, ధాత్, అనుబిస్‌లు వున్న దర్బారు హాలువైపుకు వెళ్ళింది. ఇప్పుడుగూడా నా మిత్రులు

చక్రవర్తి అంగరక్షకుల దృష్టిలో ప్రాచీన మిశ్ర దేవతలే. వారి యీకృత్రిమవేషాన్ని తొలగించాలని నేనెన్నోసార్లు అహ్మోసోతో చెప్పానుగూడా. కాని రాణీ, అహ్మోసోలు "అలా చేయడం మనకు చాల హానిగా పరిణమిస్తుంది, యిలా ఇంకా కొన్నాళ్ళు వుండనివ్వండి" అని నాతో అన్నారు.

ఇరుపక్షాల సైనికులు తమ పూర్వజుల దేవతలు పృథ్వి మీదికి దిగారని, మానవులతో భుజంకలిపి యుద్ధం జేస్తున్నారని అనుకొంటున్నారు. ఈ అంధవిశ్వాసుల దృష్టికి యివేమీ అసంభవంగా కనిపించడంలేదు. ట్రాయ్ విజయంకోసం ఒలంపస్ దేవుడు ట్రోజన్ పక్షానచేరి యుద్ధంచేసిన ఆ దృశ్యాలు జ్ఞాపకం వస్తున్నాయి. ఇలాంటి వుదంతమే మిశ్రదేశ చరిత్రలోగూడా కన్పిస్తూంది. నిజంగా ఈ భయంకర యుద్ధంలో, యిరువాగుల సైనికులూ రాణీ-నొహాకీల పక్షాన యుద్ధం చేస్తున్నామన్న తలంపుకంటే, తాము అనుబిస్-హోరస్‌ల పక్షాన పోరాడుతున్నట్లుగా భావించారు.

కనుక యెన్నుకోబడ్డ సైనికులు అనుబిస్ స్వయంగా తమకు నాయకత్వం వహిస్తాడని తెలిసినప్పుడు వారి హృదయం అనంతోత్సాహంతో నిండిపోయింది. మృత్యు దేవతకంటే వారి శరీరాలను రక్షించే వారెవరు?

నేను స్వయంగా ఆ సైన్యంవెంట సొరంగ ద్వారం వరకూ వెళ్లాను. దానిని జూచిన నాకు మేరి సరస్సువొడ్డున గల ప్రాచీన మిశ్రీయుల భూగృహాలు జ్ఞాపకం వచ్చినవి. వాటిలో 3000 గదులున్నాయి. వాట్ని స్వయంగా నా కళ్ళతో జూశాను. మాకు ముందుగా మహాలు గులా

మొకడు కాగడా తీసికొని నడుస్తున్నాడు. మేము ఒక గది నుండి రెండో గదికి చేరుకొనేసరికి అలసిపోయాం. ఆ గోడలను జూసి నాకు మరీ ఆశ్చర్యం వేసింది. అవి నాలుగు గజాలకంటే ఎక్కువ వెడల్పుగా వున్నాయ్. రాజప్రాసాదం మంచి బలిష్టమైన పునాదులమీద నిర్మించబడింది.

మేము చివరకొక పెద్దగదికి చేరుకొన్నాం. దాని వైశాల్యం 550 గజాలకు తక్కువవుండదు. దీని పైకప్పు ఎంత ఎత్తుతక్కువగా వున్నదంటే పొడవైన వ్యక్తి దానిని తాకడానికి మునివ్రేళ్ళమీద నిలబడే అవసరం లేదు. నేను ఇంజనీరును కాను; కాని యింత విశాలమైన కప్పును భరించడానికి ఒక్క స్తంభంగూడా లేకపోవడం చాల విచిత్రంగావుంది. కాగడావాడు తన కాగడాతో కూర్చున్నట్లున్న విగ్రహం ముందుగా త్రోవదీశాడు ఈ విగ్రహంగూడా మితనీహార్ప మార్గాన చూచిన ఆసీన దేవతల విగ్రహం లాంటిదే.

బక్షీ స్వయంగా ముందు నడిచాడు. అతడేదో యంత్రం త్రిప్పినట్లుంది. ఆ విగ్రహం తిరగటం ప్రారంభమవగానే మాముందున్న గోడలో ఒక సొరంగం యేర్పడింది. అందులో కొన్ని సోపానాలు ముందుకు పోతున్నట్లు కన్పిస్తున్నాయి. ఇక్కడ బక్షీ నమస్కార పూర్వకంగా నావద్ద సెలవు తీసుకొనాడు. ఒక్క మాటైనా మాట్లాడకుండా క్రిందకుదిగి కొన్ని జాలు వెళ్ళినతర్వాత తిరోహితుడయ్యాడు. అతని సైన్యం ఒకే పంక్తిగా నడుస్తోంది. నాకష్టుడు వారు సమీపంగా పోతున్నారు. కాగడా వెలుగులో నేను వారి ముఖాలను చూశాను వారిలో భయచిహ్నాలు నామ

మాత్రంగానైనా లేవు. వారు ఎక్కడకు వెళ్తున్నారో వారికి తెలియదు. వారు పెద్దవిపత్తుల్లో అడుగు వేయబోతున్నారని వారికి తెలుసు. తాము విశ్వసించడమేగాక పూజిస్తూన్న దేవత కెప్టెన్ కాగా వారు ఆయన వెనుక నడుస్తున్నారు. ఈ దృశ్యం నాకు అద్భుతంగా తోచింది. ఈ వీరులు కర్తవ్య నిర్వహణార్థం తమ ప్రాణాలను బలిజేయడానికి వెళ్తున్నారు.

ఆఖరు వ్యక్తిగూడా దాటిపోయాడు. ఇప్పుడు కాగడా వాడితో పాటు నావద్ద ధీరేంద్రుడు మాత్రం మిగిలాడు. ఆయన వెంటనే నా భుజంమీద చేయివేసి ముందుకు వంగాడు. ఆయన శృగాలముఖం నా నోటిదాకా వచ్చింది. ధీరేంద్రుడు మెల్లగా చెప్పాడు - సెలవు ప్రొఫెసర్. ఈపనిలో మనిద్దరం ప్రాణాలతో తిరిగి పోకపోయినా లోటేమీ లేదు. మనకు వెనకా ముందెవ్వరూ లేరు. ఒక్కసారైనా జ్ఞాపకం రావడానికి నాకు భార్యా బిడ్డలెవ్వరూ లేరు. నేనొకప్పుడు ప్రయాగలో వుంటూండేవాడను. అక్కడ సాయం సమయాల్లో నూగుజీడీలు సంచినిండా పోసుకొని 'ఖుసరో బాగ్'కు వెళ్ళి చిన్న చిన్న పిల్లలకు పంచిపెడుతూండేవాడిని. నేను చిరునవ్వు నవ్వాను. నా విషయంలోగూడా అలాగే జరిగిందొకప్పుడు.

ధీరేంద్రుడు విరగబడి నవ్వాడు. కాగడావాడు ఆయన ముఖంవైపు విచిత్రంగా జూశాడు. అనుబిస్ నవ్వడమంటే వాడికింకా ఆశ్చర్యం కల్గింది.

ధీరేం:- మనమంతా ఒకే తరగతికి జెందినవారం. వృద్ధులూ

తర్వాత ఆయనేమీ అనకుండానే ఆ అంధకారంలో లీనమయ్యాడు. వేగంగా పోతున్న ఆయన పదధ్వనులు మాత్రం వింటున్నాను.

నేనప్పుడు కాగడా వానితో అన్నాను—'నీ విక్కడే వుంటావుగదూ?'

అతను తల వూపుతూ చెప్పాడు—అవును. ఎందుకంటే ఈ ద్వారం సర్వదా తెరచేవుంటుంది. ఒక చిన్న సైన్యం దీని రక్షణకు వస్తూన్నది.

సొరంగంలోని చీకటివల్ల నా మనస్సు చెడిపోతున్నది. భయంగా "నేను తిరిగి యిక్కడ నుండి వెళ్ళడమెలా!" అన్నాను.

కాగ:- తమరు నా కాగడాను తీసుకపొండి. చీకట్లో భయపడడానికి నేను పసిబిడ్డనేమీ గాదు. నేను బాటకు కాపలాగూడా కాయాలి. కాగడా తీసుకొని నేలవైపు చూస్తూ వెళ్ళండి. తమకు దుమ్మిమీద మా పదచ్ఛాయలు కన్పిస్తాయి.

వాడు నా పిరికితనాన్ని అపహాస్యం చేస్తూండడం చూశాను. కాని యేమైనా నాకు అంధకార బంధురంగా వున్న ఆ పాతాళలోకంలో వుండడం యిష్టంలేదు. నేనక్కడి నుండి రాజ ప్రాసాదంలోకి వెళ్ళాలనుకొన్నాను. అక్కడ గూడా ధగధగ మెరుస్తూన్న కత్తులమధ్య వుండాల్సి వచ్చినా సరే.

నేను వాడి చేతినుండి కాగడా తీసుకొని వాడు చెప్పింది పూర్తిగా నిజమేనని తెలుసుకొన్నాను. వేలసంవత్స

రాలుగా దుమ్ము-దూళి అక్కడ పడివుంది. దానిమీద మా పాదరేఖలు స్పష్టంగా వున్నాయి. ఆ పెద్ద హాలుదాటి ఒకటి తర్వాత వొకటిగా ఆ చిన్న గదులను దాటాను. అప్పుడు విన్పించిన ద్వనికి నా శరీరంలోని రోమ రోమం భయకంపిత మైంది. ఇదొక సైనికుల గుంపని తర్వాత తెలుసుకొన్నాను. అది సౌరంగ రక్షణకు వెళ్తోంది. వారి నాయకుడు నాగొంతు పట్టకొన్నాడు. నేను వ్యతిరేక పక్షంవాడినని అతడను కొన్నాడు. నేను నిస్పృహ జెందాను. కాని యేదో విధంగా అతనికి నా పరిచయమిచ్చాను. అప్పుడా సైనికులు ఎంతో ఇదిగా క్షమించమని ప్రార్ధించారు. ఎందుకంటే మహారాణి నా మాట వింటుందని వారికి బాగా తెలుసు.

అక్కడినుంచి రాజమహాలుకు వచ్చిచూస్తే నాకు చాలా ఆశ్చర్యమేసింది. అక్కడ నలువైపులా పట్టపగలుగా వెలుగు కన్పిస్తూంది. నాకు సమయజ్ఞానం లేకుండాపోయింది. మహాలంతా నీరత్వంతో నిండియుండడం నాకింకా ఆశ్చర్యం వేసింది. యుద్ధం పునఃప్రారంభ మైందేమోనని నేను అను కొన్నాను. నేను వెంటనే మహారాణి గదికివెళ్ళాను. చాంగ్-అహ్మసో లిద్దరూ అక్కడే వున్నారు.

నేను-: వారింకా యుద్ధం ప్రారంభించలేదా ?

అహ్మసో అన్నాడు—ఇంతవరకూ లేదు. ఏసమయంలో నైనా ఆరంభం కావచ్చు. నొహారీ తన సైనికుల సందర్శ మహాలు వెలుపలవున్న మైదానంలో నిలబెట్టాడు. ఒకేసారి నాల్గువైపుల నుండీ మహాలును చుట్టుముట్టాలన్న సంకల్ప

మున్నట్లుగా తెలుస్తోంది. భగ్నభాగంలోనే ముట్టడి జరుగు తుండవచ్చడంలో సందేహం లేదు.

బక్షీ తన సైనసంచాలనాన్ని ఒక సమర్థుడైన సహాయ కుని చేతికి అప్పగించాడు. ఇక మిగిలిన సైన్యం నాల్గు దళా లుగా విభజించబడి మహలుయొక్క వేరు వేరు భాగాల రక్ష ణార్థమై పంపబడింది. ఈ అంతిమ యుద్ధపు సమాచారాన్ని తెలియజేసే ముందు సెరిసిస్ మహలు నిర్మాణం యెలా గున్నదో చెప్పడం అవసరమని అనిపిస్తోంది.

రాజ ప్రాసాదం నది కుడివైపు వొడ్డునవున్నది. నదీ-ముఖద్వారాల మధ్యవున్న వెడల్పైన రాతిమెట్లు కాశీలోని పంచగంగాఘాట్‌లాగ నిర్మించబడి వున్నాయి. ఈమెట్లమీదనే నిలబడి రాణి మా ఆగమన సమయంలో సాష్టాంగపడ్డది. ముఖద్వారానికి లోపల, విశేషించి రాజ భవనపు ఉత్తర-పశ్చిమ-పూర్వదిశల్లో వుద్యానవన మున్నది. దక్షిణపువైపున నాల్గుగోడలకు ఆనుకొనే రాజభవనం వున్నది.

ఈ దక్షిణ భాగం చాల బలంగావుంది. ఎందుకంటే రాజభవనం ఒక పర్వతంమీద నిర్మించబడి వుంది. దగ్గర-దగ్గ రగా వున్న వెలుపలి గోడలు చాల యెత్తుగా వున్నందువల్ల సోపానాలు నిర్మించడం కష్టమైన పని.

విద్రోహులు ప్రధాన ద్వారాన్నిదాటి వుద్యానాన్ని గూడా వశం చేసుకొన్నారు. రాజభవనానికి ఎదురుగానూ, దర్బారు-భవన ద్వారానికి కొంచెం ఎడమవైపుగావున్న గోడ ధ్వంసం చేయబడింది. గోడ పడ్డచోటుకు చుట్టుప్రక్కల యెన్నో చిన్న-చిన్న గదులున్నాయి.

దర్బారు భవనపు చివరిభాగంలోని చలువరాతి మెట్లు, రాణి అభ్యంతర మందిరానికి చేరుకొంటాయి. ఇక్కడే మహా రాణి శయన మందిరం, సింహాసనా గృహం వున్నాయి. ఈ చలువరాతి మెట్లు తప్ప పైకి పోవడానికి మరో మార్గమేదీ లేదు. పాడైపోయిన దోవను బాగుజేయాలని మేమను కొన్నాం.

ఆ మార్గాన్ని అలాగే వుంచితే శత్రుసైనికులు లోప లకు రావడం సులభమనీ, మా సైనికులు వెనుకంజ వేయక తప్పదనీ అనుకొన్నాం. అందువల్ల మేం మొదట్లో అనుకొన్న విధంగా సోపానాల ద్వారానికి అవరోధాన్ని యేర్పాటు జేశాం. తోటలోని యిసుకను బస్తాలకుపట్టి మేమీా ఆటం కాన్ని యేర్పరిచాం. మెట్లు 15 మంది వరుసగా నిలబడి యుద్ధం చేయగలిగేటంత వెడల్పుగా వున్నాయి. అక్కడ ప్రక్కలనుండి వచ్చి పైన బడతారన్న భయంలేదు. భవనం శిలా నిర్మితంగాబట్టి నిప్పంటిస్తారన్న భయంగూడా లేదు. ఈ విధంగా పెద్దహాలు శత్రువులు స్వాధీన మయ్యేప్పటికి మేము మరో సురక్షితస్థానానికి వెళ్ళవచ్చునని పాఠకులకు స్పష్టంగా అర్థమై వుండవచ్చు. మాతో పోరాడడానికి బహుశా సంఖ్యా కంగా వున్న నోహారీ సైన్యం అక్కడకు రాలేదు. అందరూ ఒకేసారి రావడానికి వీలులేదు.

ఎన్నో గంటలనుంచి దండయాత్రకై మేము నిరీక్షి స్తున్నాం. మొదటిరోజు కలిగిన శ్రమవల్లనే, నేను పొడుం-పొడుం అయిపోయ్యాను. మహారాణి నన్ను యేమన్నా తిన మని బలవంతం జేసింది. భోజనం చేసినతర్వాత నిద్రొచ్చింది.

వేడి తీవ్రంగా వున్నా, పైగదుల్లో ఒకటి చల్లగా వుంది. దాని లోనే ఒక చాపమీద పడుకొన్నాను. కొద్దిసేపట్లో బాగా నిద్రపోయాను.

నేనెక్కువసేపు గూడా నిద్రబోలేదు. అకస్మాత్తుగా మేల్కొన్నాను. నేను లేచి చూసేసరికి మహారాణి కిటికీవద్ద నిలబడివుంది. నేను నిల్చొనగానే నన్ను దగ్గరకు పిలిచి ఆమె అన్నది– "మిమ్మల్ని మేల్కొల్పినందుకు ఎంతో చింతిస్తున్నాను. క్షమిస్తారని గూడా ఆశిస్తున్నాను. నేను మీతో అసలు విషయం చెబుతాను. మీరు బుద్ధిమంతులుగా, అనేక భాషలు తెలిసినవారు. నాకు తెలిసినంతవరకు నా రోజులు దగ్గర కొచ్చాయనీ భావిస్తున్నాను."

ఆమె కిటికీవైపు చూస్తున్నది. మా క్రింది భాగంలో మిథనీ నగరమున్నది. దాని భవనశిఖరాలూ, కప్పులూ సూర్యరశ్మిలో మెరుస్తున్నాయి. రోడ్లమీద ప్రజలు చీమల్లాగా పారాడుతున్నారు. బజార్లన్నీ మనుష్యమయంగా వున్నాయి. రైతులు తమ తమ వస్తువులను అమ్ముతూన్నారు. ఈ భయంకర విప్లవ సమయంలో గూడా ప్రజల నిత్యవ్యవహారాలు మామూలుగా జరుగుతూండడం చూసి నేను ఆశ్చర్యపోయాను. వాస్తవంగా అక్కడి స్థితి గూడా అలాగే వుంది. ఎందుకంటే రాజసింహాసనాన్ని గూర్చిన చింత మహారాణి– నొహాకిలకు మాత్రమే.

మహా:– థోథ్మస్, చెప్పుకునేటంత మహత్వం గల వారు కారు రాజులు–రాణులు. వేలకొలది సంవత్సరాల

నుండి నా పూర్వీకులు వీరిని శాసిస్తూ వచ్చారు. ఆ తరాల్లో తమ-తమ సమయాల్లో ఎందరో రాజులు ప్రజలను తమ కన్నబిడ్డల్లాగా చూసుకొన్నారు. మితసీనగర గౌరవమంతా ప్రాచీన మిశ్రదేశపు అద్భుతమైన సభ్యతా మీా ముందు కన్పిస్తూనేవుంది. ఈ సభ్యతోద్ధరణకూ, ప్రతిష్ఠకూ థేబీయ చక్రవర్తులే కారకులైనప్పటికీ యిప్పుడు ప్రజలు ఆ రాజవంశాన్ని యే మాత్రంగానైనా లక్ష్య పెడుతున్నారా? ఈ విధంగా అద్భుతకాలూ- కొనుగోళ్ళూ జరుపుకొంటున్న ప్రజలకు మా ఆపదలతో నిమిత్తమేమిటి?

నేనా అల్పవయస్కురాలైన రాణి హృదయం దుఃఖ సంతప్తం గావడం గ్రహించాను. అయినా ఆమెను ఓదార్చడానికి నాకు తగిన మాటలేవీ దొరకలేదు.

నేను:- మహారాణీ, విధివశాత్తూ మనం లోగడ పుణ్యాలు చేసివుంటే, దానికి ప్రతిఫలంగా సత్ఫలితమే లభిస్తుంది. అలాగాక మనం పాపాలే జేసివుంటే యిప్పుడా పాపాలకు ప్రాయశ్చిత్తం మాత్రమే జరుగుతోందని అనుకోవాలి. మనం భయపడాల్సిన అవసరం లేదు.

ఇదే సమయంలో పూదోటనుండి భయంకరమైన చప్పట్ల శబ్దం వినిపించింది. అది పర్వతాన్నీ, మహలునూ, పూదోటనూ - అన్నిటినీ ప్రతిధ్వనింపజేసింది.



# 26 అఖరు యుద్ధం - విజయం

ఎలాగైనా సరే నౌహారీ యీరోజు మహల్లో ప్రవేశించాలని నిశ్చయించుకొన్నట్లు యుద్ధారంభంనుండీ అనిపిస్తూనేవుంది. ఆక్రమణ యెంత ప్రణాళికాబద్ధంగానూ, ధైర్యంగానూ వున్నదంటే దాన్ని జూచి నా హృదయం కంపించిపోయింది. మాటి మాటికి విద్రోహులు ముందడుగు వేయడానికి తీవ్రంగా ప్రయత్నిస్తున్నారు. కాని అంగరక్షకులు గూడా సిద్ధంగానే వున్నారు.

ఒక్కసారిగా తూర్పు - పశ్చిమాలనుండి దండయాత్ర ప్రారంభించబడింది. కాని దానిని ఆపడానికి పెద్దగా కష్టపడాల్సిన అవసరం లేకపోయింది. కుడ్యభాగం శిథిలమైన వైపునుండే ఆక్రమణ ప్రారంభమైంది. మహలులో నౌహారీకి తెలియని రహస్యాలేవీ లేవు. దర్బారు జరిపే ఆ పెద్ద హాలును స్వాధీనపరచుకొంటే రాజ్యమంతా తన అధీనమైనట్లే ననుకొంటున్నాడు. అప్పుడు ప్రతిపక్షులు ఆత్మసమర్పణైనా చేసుకోవాలి, లేక చలువరాతి మెట్లమీదుగా పైకైనా పారిపోవాలనీ అతని ఉద్దేశ్యం.

చాంగ్, అంగరక్షక దలంతోపాటు ధ్వంసభాగపు రక్షణార్థంగా తన రివాల్వరు తీసికొని సిద్ధంగా వున్నాడు. పంక్తులు - పంక్తులుగా శత్రుసేన లోనికి రావడానికి సిద్ధంగా వున్నది. స్వయంగా ధనదాసు లోపలకు రావడానికి తీవ్రయత్నం చేస్తున్నాడు. చాంగ్ రివాల్వరు క్షణంసేపు గూడా

వ్రాసుకోవడంలేదు. పిచ్చివాడిలా తిరుగుతున్న ధనదాసును యింతవరకూ కాల్చకుండా వుండడం ఆశ్చర్యకరమైన విషయమే. అసలు హోరస్, థాత్ లు యిద్దరూ బ్రతికి వుండడమే ఆశ్చర్యం. ఇద్దర్లో ఆంశికంగా అమరత్వమేమీ ప్రవేశించలేదుగదా? అంగరక్షక సైన్యంగూడా నష్టపడ్డప్పటికీ శత్రువులుగూడా యెంతో కోల్పోయారు. ఎందుకంటే వాళ్లు సురక్షిత మార్గాన ముందడుగు వేయడంలేదు. భగ్నాంశం వైపుగా యెవరన్నా ముందుకు రావాలని ప్రయత్నిస్తే చాంగ్ రివాల్వరూ, బక్నీ సైనికుల తక్షణశర పరంపరలు వాళ్ళ నక్కడనే హతమారుస్తున్నాయ్. శత్రువులు శిథిలమైన స్థానాన్ని చేరుకొన్నప్పుడు యిరుపక్షాలకూ ముఖాముఖీ యుద్ధం జరుగుతోంది. ఆ దృశ్యం చాలా భీతిని గొల్పుతున్నది. నేను అక్కడకు వెళ్ళలేకపోవడం మంచిదైంది. లేకుంటే యీ కొట్లాటలో నా మూషిక శరీరం ఒక్క క్షణంగూడా వుండగలిగేదికాదు.

ఇంతసేపూ నేను మహారాణివద్ద, సింహాసనపు గదిలో వున్నాను. మధ్య మధ్య పరిస్థితుల తెలుసుకోవడానికి హాలులోకి వెళ్తొంటాను.

చివరకు వాయుగమనం మారింది. ధనదాసు తన రివాల్వరు బలంతో లోనికి మార్గం చేసుకొన్నాడు. అతడు ముందడుగు వేయగానే విద్రోహ సైనికులు కొందరు అతని వెంట నడిచారు. వాళ్ళను వెనక్కునెట్టి వుండేవాళ్ళేగాని, ఇంతలోనే నొహరీ ప్సారోలు తమ రిజర్వుసైన్యంతో వచ్చిపడ్డారు. వాళ్ళు పెద్ద జయఘోషలతో, కరతాళ ధ్వనులతో

పూదోటను దాటుతూ అటకాయించిన చోటుకు వచ్చి చేరారు. చాంగ్, ఆయన అనుచరులూ, హాలుమధ్యకు తిరిగి వచ్చేశారు. మరోమారు యుద్ధం ప్రచండరూపం దాల్చింది. సహాయక కెప్టెన్ ఇతరచోట్ల వున్న సైనికు లందర్నీ తిరిగి రమ్మని ఆదేశించడం మంచిదయింది. ఎందుకంటే పైకి రావడానికి మార్గమదొక్కటే. దాన్ని శత్రువు లాక్రమించుకొన్నప్పుడు పైకిరాలేక పోవడమేగాక అక్కడే హతమైపోతారు. దాదాపు అయిదు నిమిషాలవరకూ ఆ విశాలమైన హాలులో యుద్ధనాటకం అభినయించ బడుతూంది. నొహారీ, ప్నాకో, ధనదాసులు ప్రాణాలకు తెగించి ఇందులో పాల్గొంటున్నారు. నొహారీ మధ్య మధ్యలో నవ్వడంచూచి తనకు విజయం తథ్యమని విశ్వసిస్తున్నాడని నేననుకొన్నాను.

ఇప్పుడిక అంగరక్షకులు తమ చివరి రక్షణ స్థానానికి తిరిగివచ్చారు. చాంగ్ రివాల్వరు యీ వెనకడుగు వెయ్యడాన్ని ఎంతో చాకచక్యంతో ఆపివేసింది. లేకుంటే వీరిపై శత్రుసైనికులు విరుచుకుపడి వుండే వాళ్ళు. అందరికంటే వెనుక వున్నది చాంగ్. ఇప్పుడిది చివరిక్షణం. జీవన్మరణ సమస్య అయింది. పదిహేనుమంది అటకాయింపుకు వెనుక భాగంగా, శత్రువులను ముందుకు రానివ్వకుండా చేయడానికి సిద్ధంగా వుంచబడ్డారు. మిగిలిన వారంతా పైగదిలోకి చేరుకొన్నారు. ఖాళీఅయిన చోటుకి మరొకడు వస్తూండేవాడు. హాలంతా శత్రుమూకతో క్రిక్కిరిసి పోతున్నది. ఒక్క బాణంగూడా వృథాకావడంలేదు. ఎవడైనా సోపానాలవైపుకు

పోవాలని ప్రయత్నిస్తే బాణానికో, తుపాకీగుండుకో బలియై పోతున్నాడు.

సోపానాలపైకి వచ్చేవాళ్ళలో ప్సారో ముందున్నాడు. అయిదారడుగులు ముందుకు సాగనిచ్చి చాంగ్ రివాల్వరు పేల్చాడు. ప్సారో బీత్కారం చేస్తూ మెట్లమీదకు ఒరిగి దొర్లుకుంటూ క్రిందికి వెళ్ళిపడ్డాడు. తర్వాత ఇంకొక సిపాయికీ ఇదే గతిబట్టింది. ఈ విధంగా గుమిగూడిన వాళ్ళు గలభా చేస్తున్నారు. ముందుకువచ్చినవాడల్లా పడిపోతూనే వున్నాడు. అయినా వెనుకనుంచి వాళ్ళ శవాలపైగా ముందుకు వస్తూనే వున్నారు. ఇదే సమయంలో చాంగ్ అక్కణ్నించి నావైపుకు పరుగెత్తాడు.

నేను:- ఏం, దెబ్బ తగిలిందా ?

చాంగ్:- దెబ్బ తగలడమేమిటీ? అంతకంటే అధికమే. నా వద్ద శత్రుసైన్యాలనాపే సాధనాలు పూర్తిగా అయిపోయి నాయి.

ఎంత దురదృష్టం ! ధనదాసు గూడా తన రివాల్వరు నుపయోగించక పోవడం, నేను చూస్తూనే వున్నాను. అతని సామాగ్రి గూడా అయిపోయినట్లుంది. చాంగ్ మహాశయుడు తన రివాల్వరు బలంతోనే ఇప్పటివరకూ శత్రువుల నాప గల్గాడు.

నేనడిగాను:- ఇంకెంతసేపు ఆపగలవు ?

చాంగ్:- మరికొన్ని నిముషాలవరకు మాత్రమే. తమ సంఖ్యాబలంతో వాళ్ళెప్పుడైనా ముందుకు రాగలరు.

ఆయన ఇంకా నాతో మాట్లాడుతూనే వుండగా ధన దాసు అనేకమందిని వెంటేసుకుని అక్కడకు వచ్చాడు. అతని చేతిలో తళ్ళతళలాడుతూన్న కత్తివుంది. అతడు కళ్ళు మూసు కొని ఎడా-పెడా కత్తి తిప్పుతున్నాడు. బీజక్ ఎప్పుడు చేతికి వస్తుందా ? ఖజానా నెప్పుడు స్వాధీనం జేసుకుందామా ? అన్న భావంతప్ప అతనికి మరో ఉద్దేశ్యం లేదని నేనను కొన్నాను అతడు ముందడుగు వేయగానే అటకాయిస్తున్న అంగరక్షకులు వెనకడుగు వేయాల్సొచ్చింది. అటకాయింపుకు గాను యేర్పాటుచేసిన యిసుక బస్తాలు గూడా పడిపోయి నాయి. మహారాణి గూడా పారిపోయి సింహాసనం గదిని శరణు జొచ్చింది.

సింహాసనానికి వెలుపలవున్న గదంతా విద్రోహుల జయధ్వానులతో ప్రతిధ్వనించింది. ఇప్పుడక్కడ నేనూ, చాంగ్, అహ్మోసో, అత్యంత కష్టంమీద బ్రతికిన నలభైమంది సైనికులూ వున్నారు. మహారాణి ముఖం తెల్లబడ్డది. నోరు మెదపలేదు. ఎంతో శాంతి, గంభీరాలతో ఏమీ తొట్రుపాటు లేకుండా ఆమె సింహాసనాన్ని అధిష్టించింది. ఆమె సిరస్సు వున్నతంగా వున్నది. లలాటంమీద, తల్యాసత్రరాణి, అత్యంత ప్రాచీన కాలం నుంచీ ఫరోవా సమ్రాట్‌లు ధరిస్తూ వచ్చిన రత్నజటిత సర్పమూ వున్నది. నేనామె ముఖంవైపుకు చూశాను. ఇప్పటికీ ఆమె సౌందర్యం, దానిమధురత్వంలోనూ తేజస్సులోనూ ఏ మాత్రం తేడా కన్పించడంలేదు. ఏమను భవించాల్సి వచ్చినప్పటికీ ఒక గౌరవనీయ రాణిలాగే తన

సింహాసనంమీద కూర్చొనే అనుభవించాలని నిశ్చయించు కుంది.

సేనాని, హోరస్ గూడా ముందంజ వేశారు. కాని అంగరక్షకులు వాళ్ళను తేలిగ్గా లోనికి రానివ్వలేదు. నోహారీ అక్కడుండే బిగ్గరగా అన్నాడు—"సెరిసిస్ ఎవరి భుజస్కం ధాల్లో మితనీనగర సింహాసనాన్ని తీసికోవడానికీ, దాన్ని సుర క్షితంగా వుంచడానికీ శక్తివుందో అతనికోసం దాన్ని వదలి వేసెయ్యి."

నోహారీ నోటినుండి యీ మాటలు పూర్తిగా బయ టకు రాకముందే హాలులో ఒక పెద్ద గిలభా, భయంతో గూడిన కోలాహలమూ విన్పించినాయి. నేనప్పుడు ఎడతెగని కొన్ని ధ్వనులు విన్నాను. తర్వాత నీరవత వ్యాపించింది. ఆ నిస్తబ్ధతలోనే నేను విన్నాను—"సరే పదండి. నోహారీని సింహా సనంమీద కూర్చొబెడదాం" యీ శబ్దం కెప్టెన్ ధీరేంద్రుని దని నేను గుర్తించాను.

కెప్టెన్ ధీరేంద్రుడు, చాంగ్ మహాశయునిలాంటి ప్రశాంత, శీతలమస్తిష్కం గలవాడూకాదు. ఆ ఆవేశంలో అంతా మరచిపోయి యీ మాటలను బిగ్గరగా హిందీలో అన్నాడు.

బక్షీ, ధీరేంద్రులు ముఖ్యమైన సిపాయీలతో నోహారీ, అతని సైన్యం నిర్విణ్ణులయ్యే విధంగా అకస్మాత్తుగా వచ్చిపడ్డారు. వారెందరోగూడా విద్రోహులు గమనించలేక పోయారు. విద్రోహులలో ఎందరో చిందర - వందరగా పారి పోయి దాక్కున్నారు. బక్షీ, ధీరేంద్రులు తిన్నగా చలువ

రాతి సోపానాలవైపు కెళ్ళారు. అదే సమయంలో అంగరక్ష కులు గూడా సింహాసనంగదినుండి బయటకొచ్చారు. నోహారీ ధనదాసులు సోపానాలవైపుకు పరుగెత్తారు. కాని బక్షీ అక్కడ తన సైనికులతో సిద్ధంగా వున్నాడు. కొద్ది సేపట్లోనే వాళ్లు రెండువైపులనుండీ చుట్టుముట్టబడ్డారు. అప్పుడు ధన దాసు కళ్లుమూసుకొని తన కత్తిని తిప్పుతున్నాడు. అందు వల్ల తన సైనికులే ఎక్కువగా హతులవుతున్నారన్న విష యాన్ని అతడు గమనించలేదు.

నోహారీ అన్నివిధాలా తాను అసమర్థుడవడం చూచి సోపానాలమీదుగా పైకి పారిపోయాడు. కవచం అతన్ని సైనికుల ఆఘాతాలనుండి రక్షించింది. సైనికులను చీల్చు కుంటూ అతడు సింహాసనం గదికి వెళ్లాడు. ఇక్కడే మహా రాణిముందు కొందరు సైనికులుకలసి అతణ్ని శస్త్రహీనుణ్నిగా చేశారు.

ధనదాసు తాను సోపానాలమీద ఒంటరిగా వుండి పోవడం చూశాడు. తన ప్రాణం రక్షించుకోవడానికి క్రిందకు పరుగెత్తాడు. అక్కడ ధీరేంద్రుణ్ణి ఎదుర్కొన్నాడు. ధన దాసు ధీరేంద్రునికంటే బలవంతుడు. ధీరేంద్రుడే వుద్దేశంతోనో రివాల్వరు వుపయోగించలేదు. కాని ధనదాసు మాత్రం ధీరేంద్రుణ్ణి నెట్టేసి ముందుకు వెళ్లాలనుకొన్నాడు. అప్పుడు మంచి మల్లయుద్ధ ప్రదర్శనను చూచే అవకాశం దొరికింది. కొద్ది ప్రయత్నం తరువాత ధీరేంద్రుడు నిలదొక్కు కొన్నాడు. తరువాత ఇద్దరూ ఒకర్నొకరు చుట్టవేసుకొని క్రిందబడ్డారు. ఒకసారి ధీరేంద్రుడు క్రిందపడితే మరోసారి

ధనదాసు. యీ హడావుడిలో వారి కృత్రిమ ముఖాలు వూడి దూరంగా బడినాయి. ఇప్పుడు ప్రథమంగా అసలు స్వరూపాలు బయటబడ్డాయి.

ధనదాసు ధీరేంద్రుణ్ని చంపి వుండేవాడే. కాని ఇంత లోనే విద్రోహులలోనుంచి ఎవడో ఒక బల్లాన్ని విసరివే యగా అది సరిగ్గా ధనదాసు గుండెల్లో గుచ్చుకొంది. అతని చేతులూ కాళ్లూ పట్టు తప్పిపోయినవి. లేవడానికి ప్రయత్నిం చాడుగాని శక్తి క్షీణించిపోయింది. కొద్దిసేపట్లోనే మెడ వ్రేలాడబడ్డది. ఈ విధంగా ధనదాసులాంటి విశ్వాస ఘాత కుడూ, ధనలోభీ, దేశ బంధుద్రోహీ, ఎవరికోసం యిదంతా చేశాడో, ఆ దేశస్థుని చేతిలోనే, ఆదేశంలోనే చనిపోయాడు. ధీమంతుడైన ధీరేంద్రుడు త్రోవతప్పిన తన దేశీయ సోదరు నిపై తాను స్వయంగా ఆపదలో వున్నప్పుడుగూడా, రివా ల్వరు సిద్ధంగా వుండిగూడా చెయి చేసుకోలేదు.

దేవతల రహస్యం బట్టబయలు కాగనే సైనికులు క్రోధోన్మత్తులయ్యారు. ధనదాసుకు పట్టినగతే ధీరేంద్రునికి గూడా గల్గేది. కాని వెంటనే చాంగ్ అయిదారుసార్లు తెంపు లేకుండా పైకి కాల్చాడు. యీలోపల ధీరేంద్రుడు సోపానాల పైకి వచ్చాడు.

హోరస్ - ప్సారోలు చంపబడ్డారు. నోహరీ బంధితు డయ్యాడు. ఇక విద్రోహుల స్థితి ఎలా వున్నదో ఆలోచిస్తేనే తెలిసిపోతుంది. వెంటనే బక్షీ తన సైనికుల నాదేశించాడు. వారు శత్రువులను మహలునుండి తరిమి కొట్టారు.

రాత్రంతా నేను మందులపెట్టె దగ్గర పెట్టుకొని గాయపడ్డవారికి పట్టీలువేసే పనిలో నిమగ్నమై వున్నాను. నా మందు త్వరగానే అయిపోయింది; కాని వేరొక మందును వాడడంలో నిమగ్నుడ నయ్యాను. అదేమంటే యుద్ధక్షా లలో చనిపోయినవారికై మమ్మీలను తయారు చేయించడం. నాకు శస్త్రచికిత్స చేతగానప్పటికీ శరీరశాస్త్రమంతా బాగా తెలుసు. గాయపడ్డవారిలో అధిక సంఖ్యాకులకు ప్రథమ చికిత్సే అవసరమయింది.

అప్పుడు పట్నం, దేశం - అంతా దుఃఖమయంగానే కన్పిస్తూన్నది. విద్రోహులు ఓడిపోయారనీ, హింసాత్మక చర్యలను ఆపివేస్తే మహారాణి యిప్పుడైనా వారిని క్షమించ డానికి సిద్ధంగా వున్నారనీ అహ్మాసో దండోరా వేయించాడు.

వేలకొలదిమంది ప్రాణాలు పోగొట్టుకొన్నారు శోక సూచకంగా నాగరికులందరూ క్షౌరాలు చేయించుకోవడం మానివేశారు, మధ్య మాంసాదులను త్యజించారు, స్త్రీలు శిరోజ సంస్కారాలూ, కళ్ళకు కాటుక పెట్టుకోవడం, ముఖా లంకరణ, చేతులకు గోరింటాకు పెట్టుకోవడం త్యజించారు. మమ్మీలను తయారు జేయడానికి దేశంలోని వృద్ధులందరూ పూనుకున్నారు. పగలంతా రెండుసార్లు నాగరికు లందరూ రాజ ప్రాసాదాని కెదురుగావున్న విశాల మైదానానికి వచ్చి మృతవ్యక్తులకు తమ-తమ శ్రద్ధాంజలులను సమర్పించారు.

నది కుడివొడ్డున ఒక పెద్ద సమాధి కట్టించబడింది. దీనిలోనే విద్రోహుల మమ్మీలన్నీ పూడ్చివేయబడినాయి. చనిపోయిన అంగరక్షకుల జ్ఞాపకార్థం, వారి మమ్మీలను

పూడ్చి వేయడానికీ, రాజోద్యానంలోనే ఒక పెద్ద సమాధి నిర్మింపబడింది. దానిమీద దేవరాజైన ఓసరిస్ మందిరం నిర్మించ బడింది.

ప్రజలందరూ మా ప్రాణాలు తీయడానికి పొంచి వున్నందున యింతకాలంపాటు నేనూ నామిత్రులూ బయటికి వెళ్ళడానికి అవకాశమే పొందలేక పోయాం. శతాబ్దాల తరబడి యేవిదేశీయుడూ యీదేశానికి రాలేకపోయాడు. మొట్టమొదటి విదేశీయుడు శివనాథ్‌హౌహారీ; తర్వాత మేము. మా రక్షణకు సిద్ధంగావున్న మహారాణి, అహ్మెసో, బక్నీలు తప్ప మరొకరెవ్వరూ ఆ దేశంలో మా మేలు కోరేవారు లేరు.

రెండువారాలు గడువగానే మరల దర్బారు నియమానుసారంగా నడువసాగింది. ఇంతకాలం ఎక్కువగా నేను రాణికెంటే వున్నాను. నేనామెకు బాహ్య ప్రపంచానికి సంబంధించిన అనేక విషయాలు చెప్పాను. వాటన్నిటినీ విని ఆమె "నాకీ విషయాలన్నీ స్వప్నతుల్యంగా కన్పిస్తున్నవి" అని అన్నది. "మీ యీ దేశాన్ని గూర్చిన నా అభిప్రాయం గూడా యిదే" నని నేను అన్నాను.

చివరకొక రోజున రాణి అన్నది — "థోథ్‌మస్, నేను మిమ్మల్ని తండ్రిగా భావిస్తున్నాను. మీరు యిక్కడనుంచి వెళ్లాలని హృదయపూర్వకంగా కోరడంలేదు."

నేను:— మహారాణీ, మీ శుభగుణాలను సందర్శించిన నేనుగూడా యేమంత తక్కువ స్నేహపాశ బద్ధుణ్ణి కాలేను. కాని యీ దేశవాసుల స్థితి యిట్లా వున్నప్పుడు యెక్కువ

కాలంపాటు యిక్కడ వుండడం శ్రేయస్కరంకాదు. మాకు సెలవిప్పించండి.

మహా:- ఇందుకు నాకెంతో ఖేదంగావుంది. "ఆలస్య మమృతవిషం" నిజమాతుందేమోనని అహ్మోసోగూడా అంటు న్నాడు. తమ మిత్రులుగూడా ప్రయాణ సన్నద్ధంలోనే వున్నారు. నాహృదయం ద్రవించుకు పోతున్నప్పటికీ ఇలాంటి స్థితిలో ఆపడానికి ధైర్యం చాలడంలేదు. ఈ రాజ్యం, సింహా సనం రక్షించబడడం మీ ప్రసాదమే. నేనూ, యీ ఫరోవా సింహాసనం మీకు శాశ్వతంగా ఋణపడి వుంటాం.

నేను:- అయితే, మా యాత్ర ఎలా జరుగుతుంది ?

మహా:- ఆ విషయం బక్నీకి బాగా తెలుసు. అరణ్యా మార్గాన జరుగుతుంది.

## 27 ఉపసంహారం

మేము బయలుదేరడానికి రెండు- మూడు రోజులు ముందుగానే నోహరీకి మరణశిక్ష విధించబడింది. నేనుబయలు దేరబోయే ముందే అహ్మోసోకు సెరాఫిస్ తాళపుచెవిని యిచ్చివేశాను. నేను సమాధిని తెరిచే రహస్యాన్నంతా ఆయనకు విప్పిచెప్పాను. ఖజానాను తాకనన్నా తాకగూడ దని నా వుద్దేశ్యం. సరిగ్గా నామిత్రుల వుద్దేశ్యంగూడా యిదే. కాని నా యీ ప్రేమపూర్ణ ప్రవర్తన, వుపకారాలకు బదు లుగా అహ్మోసో నాకొక గోబర్రైలా ప్రతి కొన్ని తావీజులు

మరో మిశ్రదేశపు చెంబూ యిచ్చాడు. అవి యిప్పటికీ నావద్ద వున్నాయి.

వీడ్కోలు సమయంలో మహారాణి నేత్రాలు అశ్రుపూరితాలైనాయి. నాస్థితిగూడా యెంతో కరుణా జనకంగా వుంది. ఇంతకాలంగా వుండడంవల్ల ఆమెయెడ నాకు పుత్రికా వాత్సల్య మేర్పడిపోయింది. నా స్నేహితు లిద్దరుగూడా ఆర్ద్రహృదయులయ్యారు. వృద్ధ అహ్మోసో మాటి - మాటికీ నమస్కారాలు చేస్తూ క్షమాపన వేడుకొన్నాడు. మేమా రాత్రి సారంగంగుండా బయటికి వచ్చేశాం. నగర వీధుల్లోకి చేరే సరికి అర్ధరాత్రయింది. కిటికీల నుండిగూడా వెలుగు బయటికి రావడంలేదు. నలువైపులా నిర్జనత్వం. మధ్య మధ్య పహరా వాడెవడో కేక వేస్తున్నాడు. కాని బక్షీ కంఠస్వరం వినగానే వొంగి నమస్కరించి నిలబడుతున్నాడు. నగర ప్రాకారాన్ని దాటి మేము ముందుకు వెళ్లాం. నదివొడ్డున మాకు రెండు నావలు దొరికినవి.

మేము వాటిమీద ముందుకు సాగాం. కొద్దిసేపట్లో మేము దేవాలయం క్రిందిభాగానికి చేరుకొన్నాం. దాన్ని చూడగానే పాట్నా హైకోర్టు న్యాయవాది ధనదాసు జౌహరీ స్మృతి నా మనస్సులో నూతనత్వాన్ని రేపింది. అతన్ని ధన లోభం యింతదూరం యీడ్చుకు వచ్చింది. చివరి కతని మమ్మీ యిక్కడే పూడ్చివేయబడింది.

సూర్యోదయాని కొకటి రెండు గంటలు ముందుగా మేము నావలనుండి దిగాం. ఇక మా ప్రయాణం పర్వతాల మీదుగా. మేము పైకెక్కినకొద్దీ గాలి చల్లగా వుంది. శిఖ

రాన్ని చేరుకొనేసరికి దినకరుని వెలుగు నలువైపులా వ్యాపించింది. నేనక్కడనుండి ఒకసారి వెనక్కు తిరిగి చూశాను. దూరంగా 'రా' మందిరం, ఆ అద్భుతమైన మితనీహార్ప్ నగరం చివరిసారిగా దర్శన మిచ్చినవి. చాలా రోజుల తర్వాత మేము అక్కడ శరీరాన్ని మర్దనచేసి తోముకొన్నాం. చాంగ్ మా శరీరాలకు వేసిన రంగు యిప్పుడు చాల శ్రమపడ్డాక తుడుచుకు పోయింది. తర్వాత మేమక్కడే ఫలహారాలు చేశాం.

సాయంత్రంవరకూ మేము క్రిందికి దిగుతూనే వున్నాం. సూర్యాస్తమయానికి మేమొక అరణ్యానికి చేరుకొన్నాం. రాత్రికి అక్కడే విశ్రమించ నిశ్చయించు కొన్నాం.

చిన్న-చిన్న పొదలూ చెట్లతోనూ నిండిన ఆ అరణ్యాం గుండా మర్నాడు మేము ప్రయాణం సాగించాం. రెండు ఝాములైంది. భోజనం చేయడానికొక చిన్న దిబ్బమీద కూర్చొన్నాం. ఆ రోజునే బక్నీ యిసుక తిన్నెమీద కెక్కి క్షితిజంమీద నొక నల్లని రేఖవైపుకు చూపి అన్నాడు–మా దేశానికి మూడువైపులా హద్దు లేర్పరచిన ఘోరారణ్యమదే. అక్కడ భూత ప్రేతాలు నివసిస్తాయని అంటారు. అక్కడ తినడాని కేమీ దొరకదు. వేటాడదామన్నా జంతువులేమీ వుండవు. దాన్నిదాటడానికి మూడు మాసాల కాలం పడుతుంది.

అదికాంగో అరణ్యమై యుండవచ్చని నేననుకొన్నాను. రెండురోజులు ప్రయాణించిన తర్వాత మేము అరణ్యపుకొనకు చేరుకొన్నాం. మేమిక్కడ వీర బక్నీనుండి, అతని సైనికుల



## మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA 105 B 189 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 21/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 293 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 141,142 |
| తయారు చేసినది | pravalika |
| పేజీలు విడదీసినది | T Lasith |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | RAMYA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |